ఆ॥వె॥ పుట్టినట్టివారు గిట్టుట సహజమే
కాని గిట్టుదాక గట్టి పనుల
రాచవీరదేవరార్యుడు సలుపుచు
ఉండు చుండ జూడ నెండు ముదము.

ద్వి॥ "భీమ రథము శాంతి'' పేరుతో జరుగు
భూమిసీవుత్సవం పొందాలి జయము"
అని కాంక్ష గావించి యనవరతమ్ము
వినయంగ "సంగము'' వినతులు సలుపు.

卐卐



(పండితరత్న, ధర్మనిరత)

వే॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" కలకత్త

ఎమ్.ఓ.ఎల్. (ఓ.యు.)

హింది "భూషణ" సంస్కృత "వాణి"

ఆం.ప్ర. వీరమాహేశ్వర (జంగమ)

మహాసభాధ్యక్షులు



వే॥ పం॥ పెద్దమఠము
రాచవీరదేవరగారు
ఉస్మానియా విశ్వ
విద్యాలయము యొక్క
ఎమ్.ఓ.ఎల్.
పట్టమును పుచ్చుకొనిన
చిత్రము

# ము ౦ దు మా ట

జీవితచరిత్రయనగా ప్రతిమానవుని బదుకు బాటలోతాననుభవించిన విషయములను అనగా సుఖ దుఃఖములను, ఎగుడు-దిగుడులు - బాగోగులు - బింబ - ప్రతిబింబములుగాను సముద్రములోని ఆటు పోటుల మాదిరిగా జరిగిన అనుభూతులను తేటతెల్లముగాను, ఉన్నదున్నట్లుగాను. వ్యక్తపరచుటయే ప్రధాన లక్ష్యమైయున్నది.

ఒక వ్యక్తి తన జీవితములో అనుభవించిన సమస్యలను- లేదా విచారములను. విప్పి వివరించి చెప్పికొనినేగాని ఇతరులకు దెలియును. మరి మనిషియొక్క మంచి-చెడ్డలు ఆతని నుదుట వ్రాసియుండవుగదా ? పరితలకు తననుగురించితానై చెప్పుకొనుట ఏ మంత సమంజసమంజసముగానుండదని అనవచ్చును, అందుకు నా సమాధానమియ్యది - మనిషిలోనణగియున్న విజ్ఞాన ఖనిజములుగాని, మంచిచెడులుగాని ఆవ్యక్తి తననోటితో వివరించి చెప్పినప్పుడుగాని, లేదా అతడాచరించిన నడువడినిబట్టిగాని. ఇతరులకు బోధపడుతుంది. అట్టి యాచరణ ఆదర్శ ప్రాయముగానుండినచో మంచివాడనిగాని, చెడ్డగానుండిన చెడ్డవాడనిగాని, జనులువాకొందురు, అవుతే ఇంటిలోని చెడ్డ విషయములను బరిత్యజించి మంచిగుణములుండిన వాడి గుణములను ఇతరులు తప్పనిసరిగా స్వీకరింతురనుటలో సందేహమే మాత్రముండదు.

కొందరు తనను ఇతరులు విశ్వసించడానికై కొంత కాలమువరకు మంచినడువడినే ప్రదర్శింతురు. అట్టి వారు తమ యాచరణమును జీవితాంతమువరకు నిలుపుకొనలేరు. ఇట్టి వారి హృదయము కల్మషయుతమై బహిర్గతముగా మంచి వారుగా అగుపడుచుందురు. వారులోకమున కాదర్శప్రాయులుగారేరు. ఇట్టివారి విషయమై ఒక కవి ఇట్లుద్బోధించియున్నాడు.

''నారికేల సమవారాకాః దృశ్యంతేహిసజ్జనాః ।

అన్యేబదిరికాకారఃబహిరేవమనోహరాః ॥

సజ్జనుల హృదయము టెంకాయ మాదిరిగా ఉంటుంది. కొబ్బరి మనకు గావలెననిన మొదట టెంకాయపైనున్న బొచ్చును పెరికివైచి లోపలి టెంకనుపగుల గొట్టినసేలోనున్న రుచి కరమైన కొబ్బరి. మనకు లభిస్తుంది. అలా సజ్జనుల హృదయములుగూడ విశ్వసింపదగినవిగా ఉండును. ఇతరుల హృదయములు విశ్వసింపదగనివి, గానుండును. రేగుపండులా లోపగట్టి గాను. బయట మృదువుగా ఉంటుంది. అందుకే "సోజతికరనా దేఖనా-సోనాఘసకే-దఖనా, అని పెద్దలు'' తమ అనుభవములో జెప్పియున్నారు - దీనినే సంస్కృతవేత్త "సంసర్గదోషాఃగుణాః భవంతి" మంచి వారితో స్నేహ మొనర్చినచో మంచిగుణములలవడును. చెడ్డవారి సాంగత్యమొనర్చినచో చెడ్డవారి దుర్గుణములలవడును. ఇది సహజమేగదా ?

ఎవరైతే నిష్కల్మష హృదయులై యుందురో అంతరంగబహిరంగములలోను బరిశుద్ధముగా నుండి. సచ్ఛీలముతో యుండి. తమ జీవిత పర్యంతము ఎన్ని ఒడుదొడుకులు దటస్థించినప్పటికిన్ని వాటి నేదుర్కొనుచుదిట్ట ధైర్యముతో ముందుకు సాగి పోవుదురో వారే నిజమైనధీరులు, మనీషులు.మహనీయులు. మంచివారనియు, వారు లోకమునకీర్తి-ప్రతిష్ఠలకు బాతృగుదురు, అందుచేత ఒక అనుభవజ్ఞుడు, ఇట్లు వాకొనియున్నాడు.

"యస్యకీర్తిఃసజీవతి" ఏ వ్యక్తి తన మంచితనము-కాయా-వాచా - మానసికములతో మంచిగుణములను, అలవరచుకొనునో అతడంతమున ఈ పార్థివదేహమును వీడినను-కీర్తికాయుడై చిరకాలము విరాజిల్లుతుమని యున్నవాడగును, మహాత్ములందరికోవకు చెందిన వారని గ్రహించనగును-కీర్తికాములుగాని-మొదల ఏ మానవుడును లోకమున నున్నంత పర్యంతము మంచి-పనులను జేయనుజ్జగింపడు, ఇది సర్వథా సత్యమైన సంగతి, ప్రాచీన కాలమందలిరాజులైతేనేమి, మహారాజులైతేనేమి, రారాజులైతేనేమి, మహాపురుషులైతేనేమి, వారందరును ఏదో ఒక భంగిమతో లోకకల్యాణమునకై దాము సత్కార్యములను చేపట్టి దానము ధర్మమును జేయుట, నూతుల త్రవ్వించుట - తటాకారామాదులను మఠములను-మందిరముల నిర్మాణము లొనర్చితమ, తను-మన-ధనములను ధారపోసి యశఃకాయులై యున్నారు-కవులు కావ్యములను రచించి విజ్ఞాన జ్యోతులను వెలిగించిగాఢాంధః కారమను అజ్ఞానములో మ్రగ్గ

యున్న వారికిదారి జూపి అమరులై యున్నారు. చిరస్మరణ యులై యున్నారు.

అస్తు అంతటి మంచి తనముగాని. ఆదర్శముగాని నాలో లేశమాత్రములేనప్పటికిన్ని ఉడుతాభక్తిగానాయొనర్చినట్టి శైవ-వీరశైవ, సాహిత్య సేవలు, ఇతరులకాదర్శ ప్రాయముగా నుండవలెననే నాయుత్కంఠేచ్ఛ, నా బాల్యమునుండి విద్యార్థ నాపిపాసగలవాడినై తల్లిదండ్రుల ఆర్జనపై యాధారపడక, బంధువర్గపు చేయూతనాసింపక ఎన్నో ఇడుములకులోనై విద్యార్జనమునుజేసియున్నాడను.

అతీవచిన్న ప్రాయములోనే (8-సం॥ముల వయస్సులో) జన్మస్థానము-ఆంధ్రప్రదేశమును వీడి. ఇతర కర్నాటప్రాంత మునకరిగి గుల్బర్గజిల్లా యాదగిరి తాలూకలోని శంకర సంస్కృత కళాశాలలో జేరి అక్కడ అనుభవవేత్తలు. విజ్ఞాన స్వరూపులైనమహాస్వాములయొక్క సేవలోనుండి సంస్కృతము "నభ్యసించి కావ్యతీర్థ" యందుపట్టభద్రుడనై దానికి తోడుగా-కన్నడ-హిందీ భాషలలోను పాండిత్యమును సంపాదించి, మరలి మన ఆంధ్రప్రదేశములోని జన్మస్థానమైన జోగిపేటకు విచ్చేసి. ఉస్మానియా యునివర్శిటికి సంబంధించిన తెలుగు బి. ఓ. ఎల్ అండ్ ఎం. ఓ. ఎల్. పరీక్షల నొసంగి అందుకు పట్టభద్రుడనై ఆం.ప్ర. విద్యాశాఖలో ఆచార్యపదవి నలంకరించి ఒకవైపు ప్రభుత్వోన్నత పాఠశాల కళాశాల విద్యార్థులను

తెలుగు పాఠములను బోధిస్తు మరోవైపున సాహిత్య రూపమున శైవవీరశైవధార్మిక గ్రంధరచనలు గావించియున్నాడను. మరియు పండిత పరిషత్తు. తరుణ సంఘము-ఓరియంటిల్ విద్యార్థి సంఘము వీరశైవ సమాజము మరియు ఆం.ప్ర. వీర మాహేశ్వర (జంగమ) మహాసభలకు వరుసగా ప్రధాన కార్యదర్శిగాను, అధ్యక్షుడుగానెన్నుకొనబడి ఆయాయాకార్యము లను సక్రమముగా నిర్వహించియున్నాడను.

ఈ విషయములన్నియు సమగ్రముగా నవగతము పఠి తలకుగావలెనన్నచో నారచిత గ్రంథములనుగాని - అథవా కనీసము 1. నెనెవరు ? 2. స్వీయచరిత్రలు 2-3. భాగములను చెప్పించుకొని జదివిన యెడల నా యొనర్చిన సేవలు, నా వ్యక్తిత్వము మీకు కన్నులకు గట్టినట్లుగానానిలవు వ్యక్త మగును, అంతేగాదు భావితరమువారుగూడ కేవలము పిత్రార్జిత మునైననే ఆధార పడకుండ సొంత కృషివలన విద్యనార్జించి లోకములో నా మాదిరిగానే కీర్తి ప్రతిష్ఠలకు-పాత్రులగుదురుగాక. ఇదియే మదీయ కోరిక. ఈ గ్రంథమునాకు 70 సం॥ములు నిండిన సందర్భాన "భీమరథశాంత్యుత్సవసమారోహమున" ఆ విష్కరించబడినది.

Grams. "TELVERS"

Phones. Off. 234815
236911
Res. 248451

తెలుగు విశ్వవిద్యాలయం

# Telugu University

**Prof. C. NARAYANA REDDY**
M.A. Ph.D.D Litt.

VICE CHANCELLOR
Lalitha Kala Kshetram
Public Gardens
HYDERBCBAD-500 005
Andhra Pradesh

29-4-92

## అ భి నం ద న

నా చిరకాల మిత్రులు శ్రీ రాచవీరదేవర శైవ సాహిత్యంలో ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు. వీరశైవ ధర్మ విశ్లేషణలో వీరి స్థానం విశిష్టమైంది. వీరశైవ మతానికి సంబంధించిన అనేక గ్రంధ రచయితగా, తెలుగు భాషా సారస్వత నిరంతర సేవకులుగా శ్రీ రాచవీరదేవర చేస్తున్న కృషికి నా హార్దిక అభినందన.

(సి.నారాయణరెడ్డి)

పెద్దమఠం రాచవీరదేవర
ఇం. నెం. 3-3-139, కాచిగూడ, హైదరాబాద్-500 027.



యన్. టి. రామారావు గారు ముఖ్యామాత్యులు గారిని ఆం. ప్ర. వీర మహేశ్వర (జంగమ) మహాసభాధ్యక్షులుగల్సి మహాసభ సమస్యలను శ్రీవారికి విన్నవించిన దృశ్యము.



పం॥ రాచవీరదేవరగారి చి॥ ప్రభులింగదేవర శుభ వివాహ సందర్భాన విచ్చేసిన డా॥ సి. నారాయణరెడ్డిగారితో సంభాషిస్తున్న దృశ్యము

# అంకితము

జగద్గురు ౧౦౦౧వ బా ళె హొన్నూరు వీరసింహాసనాధీశులైన శ్రీ వీరగంగాధర శివాచార్య మహాస్వామిగారు లి॥ అయిన పిదప జగద్గురు వీరరుద్రముని దేవ శివాచార్య మహాస్వాములవారు వీరసింహాసనాధిష్ఠితులై దక్షతతో వీర సింహాసనముయొక్క కార్యక్రమములను నిర్వహించిరి. నా యొక్క షష్ఠిపూర్తి యుత్సవ సందర్భమున హైదరాబాదుకు నా ఆహ్వానముపై వేంచేసి నన్ను గ్రహించిరి. మరోసారి ఆం. ప్ర. వీరశైవ మహాసభకుగూడ విచ్చేసి భక్తజనుల నాశీర్వదించిరి. అట్టి జ॥ వీర రుద్రముని శివాచార్య మహాస్వాములవారు అకస్మాత్తుగా తేది. 15-9-1991న లింగైక్యులైనారు. వారియాత్మ శాంతికొరకు నాయా గ్రంధాన్ని భక్తితో అంకితమొనర్చుచున్నాడను.



భక్తవత్సలుడు, అభయవరదపాణి, త్రిశూలధారి
నందివాహనరూపుడైన శ్రీ చంద్రశేఖరుడు శివుడు
సమస్త జనులను కరుణతో కాపాడుగాక



శ్లో॥ నమో ఉగ్రస్వరూపాయ-నమోవిష్ణ్వాదిశాత్రవే।
దక్షయజ్ఞ వినాశాయ-వీరభద్రాయతేనమః॥ (స్వీయరచన)

ఓం

# జీవిత చరిత్ర - 3వ భా.

(వే॥ పం॥ రాచవీరదెవర తీర్థ- M. O. L.)

## ప్రార్థన

నమో ఉగ్రస్వరూపాయ, నమో జిష్ణ్వాదిశాత్రవే।
దక్షయజ్ఞ వినాశాయ, వీరభద్రాయ తే నమః॥

(స్వీయరచన)

శ్లో॥ యత్రశ్రీ రేణుకాచార్యో-విశ్వవంద్యో జగద్గురుః।
తత్రశ్రీః జయఃకీర్తిఃశాంతిధర్మశుభంసుఖం॥

శ్లో॥ జీయాత్ శ్రీ రేణుకాచార్యో - శివాచార్య శిఖామణిః।
యోమాహేశ్వర సిద్ధాంతం - స్థాపయామాస భూతలే॥

శ్లో॥ ఓం నమో లింగరూపాయ - జగజ్జన్మాది హేతవే।
నిగమాగవేద్యాయ - భక్తసిద్ధి ప్రదాయినే॥

మునియాచనయా శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థమాగతం।
వృషరాజ పరావతారతా
మహితం శ్రీ బసవేశ్వరం భజే॥

శ్లో॥ న వీరశైవ సదృశం, మతమస్తి జగత్రయే।
సర్వభోగప్రదం పుణ్యం, శివసాయుజ్యదాయకం॥

(పారమేశ్వరాగమె)

ఏతద్గ్రంధకర్త వంశావళి :

## దండకము

శ్రీకరంబైన యాంధ్రప్రదేశంబునన్ మధ్యమాణిక్యమున్ బోలి బోసంబు కాధారమైనట్టి జిల్లాకు (మెదకు) తాలూక యందోలునన్ జేవశాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మతాధీశ్వరత్వంబు గైకొన్న శ్రీసంగమేశాఖ్య మహేశ్వరుండొప్పు వీరేశగోత్రోద్భవుండై, సదాచార సంపన్న శీలుండు, ధీరుండు నౌనాతడా, శ్రీమతిన్ శివ్వమాంబాఖ్య సాధ్వీమణిన్ బెండ్లియాడెన్ మహావైభవోపేతుడై కొన్ని నాళ్ళిట్లు మహేశ్వరాచార శీలంబులందొప్పుచున్ దాను సంసార నిర్వాహమున్ జేయగా గల్గిరవ్వారికిన్ బుత్రరత్నంబులారాచయార్యుండనన్, శంకరార్యుండు పంచాక్షరాఖ్యుండునున్, శ్రీషడక్షర్యభిఖ్యుండునున్, వీరయార్యుండు నా నేవురున్ బేర్మి వర్ధిల్లగా నందుఁబంచాక్షరీ నాముడైక్యంబు నొందంగ శేషించునా నల్వురన్ జేష్ఠుడా రాచయాఖ్యుండు రాణించె నింటన్ వహించెన్ స్వసంసారభారంబు. శ్రీ శంకరార్యుండు పాపన్నపేటన్ మఠాధీశుడై యుండి రంజిల్లగా స్వామియా శ్రీషడక్షర్యభిఖ్యుండు తాజోగిపేట స్థితుండై సదాశివ్వపేటన్ మఠాధీశతన్ బూని రాజిల్లె వైరాగ్య తేజో విశేషంబు మన్నించుచున్ భక్తబృందంబు పాదార్చనల్ సేయగా శీలతన్ దక్షతన్ బూజ్యతన్, గ్రాలుచున్ దాన ధర్మాది సత్కార్యముల్ సల్పు పుణ్యాత్ముడై (గొల్లకొండముము జెందగా) కొల్లగా కీర్తులన్ జెందఁగా, వీరలన్ బిట్టి తమ్ముండు వీరయ్యకున్ జేష్ఠడౌ పుత్రు రాచయ్యనున్, దాస్వపీఠంబునన్ నిల్పి నీరీతి సామాజిక శ్రేయమున్ గోరుచున్ వేడ్కమై లింగ పూజాదుల

ఖుండునై యుండగా నంత నా శంకరుండున్ సదామోదకారున్,
నిజాధీనమునన్, జేర్చి కైలాస వాసున్, దగన్ జేసెదాన్॥

సీ॥ పరమేశుఁజేరె నా భ్రాతయని దలఁచి
వగచి వీరయ తన భ్రాతృపదవి।
కైలాతివారు రాజాలరని గణించి
తనదు పుత్రునిఁగొని నిల్పెనుముదమున।
పెద్దనతఁడిట్టులా వీరసుతుఁగూడి
తనదు భక్తుల మదుల్ తనియఁజేసె।
బాలుండు ముద్దులొలుకు పలుకులు వినిపింపఁ
వత్సలతదానతనిఁబం పెబడికి (౧)

గే॥ పిదపఁదల్లి తండ్రి పెద్ద కొమరుఁజూచి।
నెనరుతో యతీశ్వరున కొసఁగ।
నతఁడు స్వీకరించి కుతుకమ్ముతోఁబెంచి।
కారణాలు గరుపిజేరె శివుని॥ (౨)

తే॥ గీ॥ యతికి సోదరుఁడైన వీరయ్య యంత।
అన్నదివి కేగ బాలుని నాదరించు।
వారు లేరని తాఁదెచ్చిగారవమున
బెంచుచుండెను దాఁ జోగిపేటఁజేరి॥ (౩)

(కై. వా. శివశ్రీ మఠం సిద్ధి వీరయ్యదాకూరుగారి కృతి ద్వయము)

తే॥ గీ॥ శ్రీకరుఁడు వీరశైవాబ్ధి శీతకరుఁడు।
ప్రథితగుణుఁడు శ్రీవీరయాహ్వయబుధుండు।

తనదు పుత్రు రాచయకు విద్యలను నేర్పి।
యరిగె గైలాసమునకు(దానంతమందు ॥

కం॥ శ్రీ వీరయాఖ్య సుగుణికి
పేరిమి పుత్రుండు రాచవీరయకరమున్ ।
గూరిమితోడను విద్యల
నేరిచి పితృభక్తిగల్గి నెగిడెడు నెపుడున్ ॥

(సాహిత్య వాచస్పతి శ్రీ రాచోటి శంకరశాస్త్రి **M. A.** గారి
కృతిద్వయము)

పండిత రత్న భూషిత - వరద జాణ।
"కావ్యతీర్థ" "ధర్మనిరత" - కవియు శ్రేష్ఠ
రాచవీర దేవర శివ - రహియు ముదము
మానస విహార మమతయు - మధురసీమ ॥

సంస్కృతాంధ్రనిష్ణాతయు - సరసమౌళి
"వీరశైవ ధర్మ" ప్రకాశ వీర శూర
శంకరానంద ప్రియమూర్తి - శక్తికొలది
శ్రీయుబసవేశ్వరుని భక్తి - సిరిని గూర్చు ॥

## ఆత్మీయ ఇతివృత్త పంచకం

శ్లో॥ మాతామే నాగమాంబాచ
వీరార్యాచ పితా మమ
తాభ్యాంజ్యేష్ఠ పుత్రోఽహం
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ సంస్కృతాంధ్రాంగ్ల భాషాసు
హిందీ కర్నాటకేషుచ ।
పంచభాషా ప్రణో వీహం
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ ఈశ్వరాఖ్యామహాసాధ్వీ
సంగాఖ్యాచ విదుషీమణీ ।
తాభ్యాం ప్రణయ బంధస్తు
రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ ఏకాభార్యామహాగుణవతీ, ఈశ్వరాఖ్యాసుశీలా
అన్యాభార్యాగృహకర్మధర్మనిరతా, సంగాఖ్యావిదుషీమణీ ।
ఉభావేతౌసహజానురాగ నిరతా వేకోదరాజ్జాతావివ
ఏతాఖ్యాం హృదయైకప్రాణపతిరహం రాచవీరాఖ్యదేవరః ॥

శ్లో॥ ప్రథమపుత్రోమే బసవరాజాఖ్య దేవరః
ద్వితీయోమె ప్రభులింగాఖ్యదేవరః ।
తృతీయాపుత్రీమే, శివరాణ్యాఖ్యా సుశీలాహిసా
జనకస్తేషామహం శ్రీరాచవీరాఖ్యదేవరః ॥

—: శివం భూయాత్ :—

ఇట్లు

కృతికర్త : రాచవీరాఖ్యదేవరః "శివశ్రీ"

"తీర్థ" సంస్కృతం (కలకత్తా) M.O.L. తెలుగు (ఉ.యు.)

# ఆ కాం ం క్ష (6) A

ఆ॥ వె॥ తల్లి "నాగమాంబ" తండ్రి వీరయాఖ్య
పుణ్య దంపతులకు బుట్టినట్టి
"రాచవీరదేవరా చార్య వర్యుడు"
నిండ నూరు యేండ్లు వుండుగాత.

తే॥ గీ॥ స్వంతకృషితోడ "దేవర" యింతవరకు
విద్య; పదవుల, నార్జించిన వినయ శీల
సంపదల చేత యశము నింపుకొనిన
సాధు జీవిత స్ఫూర్తి సుశాంతమూర్తి

ఆ॥ వె॥ వీరశైవ మతము విరివిగా వ్యాపింప
పెద్ద మఠము నెంతొ యుద్ధరించి
శక్తి కొలది భక్తి ముక్తి బీజములను
నాటి పాటు పడిన మేటి యోధు!

తే॥ గీ॥ పత్రికను నడ్పి మంచి సంపాదకులుగ
శైవ; పండిత సభలకు సారధులుగ
బాలురకు విద్య గరపిన పండితులుగ
ఇట్టి జనహిత సేవలో గట్టి దిట్ట!

కం॥ పండిత "రాచవీరు" నకు
నిండినవీ యేడుపదులు నేటికియని యీ
పండుగ స లు పు ట ని జ ము గ
మెండుగ హర్షంబు గొలిపెమేదిని "సంగమ్"

తే॥ దిన దినం సుయశస్సు "దేవర" గారు
ఘనముగా నార్జింప కాంక్షింతు సతము

ఇట్లు
**సంగమేశ్వర్ "సంగమ్" కవి**
అధ్యక్షులు మెదకు జిల్లా రచయితల సంఘం జోగిపేట.
వే॥ పండిత శ్రీ రాచవీర దేవర హైదరాబాద్ గారి
షష్ఠి ఉత్సవ సందర్భమున సమర్పించిన



## అ క్ష రాం జ లి (6) B

సమర్పణ : ఎం. శంకరయ్య, M. A. M.O.L.
సీనియర్ తెలుగు పండితులు
ఇబ్రాహింపటన్, జి॥ రంగారెడ్డి

శివశ్రీ పెద్ద మఠము రాచవీరదేవరగారు లబ్ధప్రతిష్ఠులయిన పండితవర్యులు. సంస్కృతాంధ్రాలలో చక్కని వైదుష్యంగలవారు, కర్నాటక, హిందీ, ఆంగ్లములలో సముచిత పరిచయముగల సాహితీ వేత్తలు. "పండితరత్న" "ధర్మనిరత" సాహిత్య విశారదాది బిరుదాంకితులు. తెలుగులో విశారదులై, హిందీ భూషణులై, కన్నడమున "జాణలయి" యుండియు కలకత్తా నుండి సంస్కృతమున "కావ్యతీర్థ" పట్టమును, ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి M. O. L. ప్రాచ్య భాషా పట్టమును చేబట్టిన పట్టాధికులు.

వీరశైవధర్మ తత్త్వ ప్రచారమునకై వీరశైవధర్మాన్వేషణము; మహాజ్ఞాని చన్నబసవన్న; రత్నత్రయము; ఇష్టలింగార్చనవిధి మున్నగు గ్రంథరాజములను వెలయించిన ప్రసిద్ధ రచయితలు భాగ్యనగరము నందలి వివిధ పాఠశాలల, కళాశాలలో సంస్కృతాంధ్ర భాషాబోధకులుగా నుండుచు అనేక కష్టనష్టముల కోర్చి యొక దశాబ్దము పాటు "వీరశైవధర్మ" అను పత్రికను సక్రమముగా నిర్వహించిన దీక్షాదక్షులు.

ప్రస్తుతము వీరు వీరశైవ సోదరులందరకు అందుబాటులో నుండి, హృదయాహ్లాదకరముగా పాడుకొనుటకు వీలుండునట్లు రచించిన "వీరశైవధర్మ భావగీతికలు" అను చిఱుపొత్తమును ప్రకటించియున్నారు. దీనికి స్వాగత సూచకముగానీ "అక్షరాంజలి" ఘటించుచు, వీరింకను ఇతోధిక సాహిత్య సేవచేసి సహృదయుల కృతజ్ఞతలకు పాత్రులు కావలసినదిగను, అట్టి సదవకాశమును అనుగ్రహించవలసినదిగా నా పరమశివుని ప్రార్థించుచున్నాను.

శ్రీకర వీరశైవ మత సింధు సముద్భవ సోముడోయనన్
ప్రాకట వీరగోత్రమున ప్రాభవమందిన పూజ్యవీరనా
మాకింతు నాగమాంబసతి, మానితపుత్రుని, రాచవీరసు
శ్లోకుని, దేవరాఖ్యుడను శోభితనాముని, సంస్తుతించెదన్

సంస్కృతమ్మునఁతీర్థ; కన్నడమ్మున జాణ
పరగ తెలుగున ఎం.ఓ.ఎల్, పట్టముఁగొని
ఆంగ్ల హింద్యాది భాషల నరసి చూచి
పంచ భాషా ప్రవీణుడనఁబరగితివి భువి.



పైచిత్రంలో మధ్యనున్నవారు జోగిపేట సదాశివపేట పెద్దమఠములకు అధిపతులు నిరంతర దాసోహమూర్తి

అయిన శ్రీ లి॥ గొల్లాళ్ళప్పస్వాములవారు



లింగైక్యులైన తీర్థ స్వరూపులైన
శ్రీ పెద్దమఠము వీరయ్యగారు
జోగిపేట



వీరశైవులకు ప్రధాన చిహ్నమైన
కరస్థల ఇష్టలింగము వీరశైవ ధర్మ
తత్వ ప్రకాశిక అను పత్రిక
ముఖముద్ర



లిం. మాతృ శ్రీ నాగమాంబగారు.
పెద్దమఠము, జోగిపేట



పం॥ రాచవీరదేవరగారు యాదగిరి సంస్కృత కళాశాలలో
నున్న తమ ప్రిన్సిపాల్ శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారితో



వీరశైవ
ధర్మసంస్థాపకులైన
జగద్గురు శ్రీ రేణుకా
చార్యులు కొలనుపాక
శ్రీ సోమేశ్వర లింగము
నందుద్భవించుట

9

అరియ పండిత పరిషదధ్యక్షుడవయి
సంస్థ కొనరించితి సేవ సముచితముగ
సభ్య పండిత మండల సాధు. సాధు.
వనగ పేరొందినాడవోయనఘమూర్తి!

ఆంధ్రదేశమునందుననలరుచున్న
వీర మహేశ్వరుల సభ విదితముగను
స్థాపితముచేసి యధ్యక్ష స్థానమూని
చక్కగా నడుపు దేవరకు సాటియెవరు

మమత శ్రీ వీరశైవ ధర్మమునుజాట
పత్రికను నిర్వహించితో పదియునేడేండ్లు
నీదు ధర్మాభినిరతికి - మీదు కృషికి
అక్షరాంజలి ఇదే రాచవీరాభి దేయ!



# ప్రశస్తి పద్యాలు

శ్రీ రాచవీర దేవర!
భూరియశః కిరణజాల పూర్ణ గురువరా!
శ్రీరమ్య వీరశైవజ
నారాధిత పాదపద్మ! ఆచార్యవరా!

మాటలు లేనివాడు, కడుమన్ననతోడుత నున్నవాడు మో
మోటము చూపువాడు, మరి మోసముచేయనివాడుధాత్రి, నా
రాటముచూప కెప్పుడును రంజిలు వాడు ప్రవర్తనంబునన్
సాటికిపోటికెవ్వడును జాలడు దేవరతోడ నిచ్చలున్.

విద్దెల మిన్న అంతకును పెద్ద, పవిత్రపు వర్తనంబునన్
హద్దులు లేని బత్తిహరునందును దేశికునందు భక్తులం
దిద్దిన యాదరమ్ము శరణార్థులయందును చూపినందునన్
ఏద్దును నెక్కురౌతు సిరిలిచ్చుత నీకును వీరదేవరా!

శ్రీ ఎస్. పిళ్ళలోకాచార్యులు, M O.L., M.A.
భాషాప్రవీణ. సీనియర్ తెలుగు పండితులు.

# పూజ్యశ్రీ షడక్షరి మహాస్వాములవారి (శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారి) పరిచయము

శ్లో॥ విశుద్ధేషు విరక్తేషు-వివేకిషు మహాత్మసు ।
శివ స్తిష్ఠతి సర్వాత్మా-శివలాంఛనధారిషు ॥

అనుసూక్తి మేరకు నిర్మల మనస్కులయందు, విరక్తుల యందును, శివ చిహ్నములను ధరించు వారలయందును విశ్వ వ్యాపకుడయిన శివుఁడు నెలకొని యుంటాడని పై సూక్తి యాశయమై యున్నది.

ఆ ప్రకారముగానే పూజ్యులైన శ్రీ మ. ని. ప్ర. స్వరూపులయిన శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారు మెదక్ జిల్లా జోగిపేట తాలూక చేవెళ్ళ అను గ్రామమున మూల మఠము వంశీయులయిన శివశ్రీ సంగయ్య మరియు శ్రీమతి శివ్వమాంబల గర్భశుక్తికయందు చతుర్థ పుత్రుడై జన్మించెను.

వీరికి తలిదండ్రులిడిన జన్మ నామము "షడక్షరియను" పేరుండెను. కాని ఏ కారణము చేతనో ముమ్ముందు సన్యాసా శ్రమ పరిగ్రహణానంతరము "శ్రీ గొళ్ళాళప్పగారని" వ్యవహార నామ మేర్పడినది. చివరి కాలమువరకు వీరు వ్యవహారనామము తోనే సుప్రసిద్ధులయిరి. పిన్న ప్రాయముననే వీరి ఆచార వ్యవ

హారములను శీలమును మరియు విజ్ఞానములను చక్కగా పరి శీలించిన వీరి పూర్వపు పూజ్య శ్రీ వీరంతయ్య మహాస్వాముల వారు సన్యాసాశ్రమ దీక్షను ప్రసాదించి జోగిపేట పెద్ద (జంగం) మఠమునకు అధిపతిగా స్వీకరించిరి, జటా-గడ్డ మీసా దులతో గూడిన వీరి ముఖము బ్రహ్మతేజస్సుతో నొప్పారు చుండెడిది. మేనపాదముల వరకు కాషాయకపని (జుబ్బ) నుదుట భస్మపుండ్రములు. కంఠమున రుద్రాక్షమాలలు తలపై పాగ (రుమాలు) చెవులలో రుద్రాక్షముర్వులు చేత బెత్తము కాళ్ళలో కఱ్ఱ పాదుకలు అధికార వాణి, ఎరుపు ఛాయ ఇవి వీరి ముఖ్య లక్షణములు.

వీరంతగా విద్యలో ప్రావీణ్యతను సముపార్జించక పోయి నను సహజ విద్యానైపుణ్యములచేత, స్వాచార వ్యవహారముల చేత భక్తులయనురాగాతిశయములను చూరగొనుచు, నిరంతరము లింగనుష్ఠాన ధురంధిరులయి రేయింబవళ్ళు అన్నపానాది విత రణముల వలన వీరి కీర్తి ప్రతిష్ఠ లినుమడించినవి. భక్తిప్రేరిత సద్భక్తులెల్లరు సదా దాసోహమూర్తియైన వీరిని పూజ్య దృష్టితో పూజించుటయే గాకుండ వీరడిగిన వస్తువును లేదనకుండ సమ ర్పించుకొని వారి కృపకు బాత్రులగుచుండిరి.

జోగిపేటలోనున్న వీరి పెద్దమఠము చూచుటకు చాల పురాతనమైనది, వందలాది సంవత్సరముల క్రితము నిర్మింప

(బడి బహుదృఢముగా నున్నది, కేవలము గచ్చు శిల (కడీల)లతో నిర్మితమై శిల్పకళలతో చూపరులకు గనులవిందునొనర్చుచున్నది. కాని దీనికి దగినట్లుగా నేమాత్రం ఆదాయము లేకపోవుటచేత కేవలం గ్రామములోని బిక్షాటనముపైననే ఈ మఠంలో నుండువారు ఆధారపడవల్సియున్నది. నిరంతరము అతిధులు విచ్చేయుచునేయుందురు. వీరందరిని మఠాధిపతిగారు భిక్షాటనముతో వచ్చిన పడి పదార్థములతో తృప్తిపరచు సాంప్రదాయముండినది.

పోతే శ్రీ గొల్లాళప్పగారు తమ పూజా ప్రభావముచేత భక్తులను తృప్తిపరచి వారిచేత గొప్ప గొప్ప అశ్వరాజములను తమక్కావలసిన సామగ్గిని సమకూర్చుకొనుచుండిరి. వీరు తమ ప్రతిభా విశేషములచేత మఠము ఉన్నతస్థాయికి చేరుకొని అభివృద్ధిదశ నందుకొనినది.

ఇటీవల భక్తిప్రపత్తులు సన్నగిల్లుట వలన అట్టి సాంప్రదాయాలకు కొరత వాటిల్లినది.

కొన్నాళ్ళిట్లు కాలము గడిపిన తరువాత సదాశివపేటకు విచ్చేసి, అట అతి హీనదశలోనున్న స్థానిక పెద్ద మఠమును గూడ అభివృద్ధిలోకిదెచ్చిరి. అచ్చటి శివభక్తులెల్లరు స్వామివారి యనుగ్రహమునకు పాత్రులయి వీరానతిచ్చినట్లుగా నడుచుకొనుచుండిరి. సదాశివపేట మఠమును గట్టించుటకై శ్రీమాన్

మనుసాని మాణిక్యము గుప్తగారివద్ద రుణముగా దెచ్చి పిదప దీర్చియున్నారని ఆ వంశీయులిప్పటికిని చెప్పుకొనుట కద్దు. శ్రీవారు రంగు రంగు అద్దాల బండ్లపై అశ్వరాజముపై సంచారము చేయుచుండిరి. వీరు తమ అంతిమ దశయందు తమ కనిష్ఠ సోదరుడు శివశ్రీ వీరయ్యగారి జ్యేష్ఠ పుత్రుఁడయిన రాచయ్య (పి. రాచవీర దేవర)ను ఉత్తరాధికారిగా స్వీకరించి వీరికి దామున్నప్పుడే రక్తాక్షినామ సంవత్సరమున ఉచిత (కారణదీక్ష) సంస్కార కారణములను నిర్వహింపఁజేసిరి. తరువాత వీరకస్మాత్తుగా కలరా రోగగ్రస్తులయి జోగిపేటలోనే శివైక్యమందిరి.

ఇట్టి పుణ్యాత్ముల కాలములోనే మనవీరశైవధర్మము ఆంధ్రరాష్ట్రమందంతట వర్ధిల్లియుండెను. అందును సదాశివపేట ఆకాలముల వీరశైవులకు వారి ఆచార వ్యవహారములకు నిలయమై యుండెను. అక్కడ అన్ని జాతులవారును ఇంచుమించుగా శైవోపాసకులయి యుండిరనుటలో సందియము లేకుండెను. జోగిపేట, సదాశివపేట సిద్దిపేటలలో శైవసాంప్రదాయముగల రెడ్లు వైశ్యులెందరో యున్నారు. వీరిప్పటికిని స్థానిక మఠాధిపతులను గౌరవముతో సన్మానించుచున్నారు.

# పుణ్యస్థల ప్రభావము

పుణ్యక్షేత్రముల మహిమలు పూర్వకాలమున జరిగి యుండుటయేగాకుండ నేటికి జరుగుచుండుట మనము గమనింప దగిన విషయము. అట్లద్భుతముగ జరుగుటలో నాశ్చర్యమేమియు లేదు. ఆ ఘటనాఘటన సంఘటనలు జరుగుటకచటి మహాత్ముల తపోనుష్ఠానములే బలమైన కారణములై యుండును.

మెదక్ జిల్లా అందోలు తాలూక జోగిపేట పెద్ద మఠములో నిట్టిదే యొక విచిత్ర సంఘటనలు రెండు మారులు జరిగియున్నవి. ఇందుకందలి పూర్వాచార్యుల తపోనుష్ఠానములే ప్రబల హేతువులనక దప్పదు.

మూడు సంవత్సరముల క్రితము నా పెద్దమఠము యొక్క పరిసరములందుండు శూద్రులు కొందరు బలవంతంగా ఇది సార్వజనిక మఠము మాకును దీనిపై యధికారముకలదని వాదించుచు దాని నాక్రమించుకొనుటకై యందనేక సం॥ల నుండి వంశపరంపరంగా నుండుచున్న మఠాధికారిని దొలగించు దురుద్దేశముతో వారిపై 23-5-72 నుంచి 25-5-72 వరకు దౌర్జన్యకాండను సల్పియుండిరి. అందుకు వారేమియు చేయునదిలేక కాల ప్రవాహమునకు కట్టుబడి దేవుని మొరపెట్టుకొనుచు కిమ్మనకుండ మౌనము వహించియుండిరి. అంతేగాకుండ వారి దౌర్జన్య

మునకు నొచ్చుకొని ఒకరోజున (24-5-72)న నిరాహార దీక్షను బూనిరి. ఆ విధముగా స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించుచు ఉవ్విళ్ళూరుచుండిన శూద్రులామఠములో తప్పత్రాగి వచ్చి పరుండినచోట యెచటను రంధ్రముగూడ యుండుట కవకాశము లేని స్థలమున (గచ్చురాతితో గట్టబడిన కట్టడము) నకస్మాత్తుగా వారు పరున్న చాపల క్రింది భాగమునుండి సర్పములు వెలువడి వారందరిని భయభ్రాంతులు గావించినవి. ఇదే విధముగా గత రెండుమూడు మాసముల క్రితముగూడ ఒక పెద్ద సర్పము వారి కగుపడుటవలన వారప్పటినుండి మఠములో బరుండుటకు జంకుచున్నారు. పరమాత్మని లీల ఇట్టిది. అది యెవరికిని తెలియునది కాదు గదా!





తమ గురువుగా భావించిన శ్రీ ని. ప్ర. విరూపాక్షానంద మహాస్వాములవారు, వారి కెదురుగా దిగువ కూర్చుండి యున్న వే॥ పం॥ రాచవీరదేవరదారు



శ్రావణమాస దీక్షాంత సందర్భములో పం॥ రాచవీరదేవరగారికి
స్థానిక భక్తులు పాదార్చన గావించుచున్న దృశ్యము



జోగిపేట పెద్దమఠము మహాద్వారములో
పం॥ రాచవీరదేవరగారు తమ మిత్రులైన శ్రీ గాండ్ల సంగ
మేశ్వర్‌గారు మధ్యన శ్రీవారు వారి ఎడమ ప్రక్కనే
శ్రీ రంగలింగయ్య గుప్తగారు



ప్రతిదినము వే॥ పం॥ రాచవీరదేవరగారు అత్యంత భక్తితో తన
ఇష్టలింగార్చన గావించిన చిత్రము



వే॥ పం॥ రాచవీరదేవర పెద్దమఠముగారు యాదగిరిలో భారత
మాజి దేశ ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జట్టిగారి అధ్యక్షతన జరిగిన
బసవేశ్వర అష్టశతమానోత్సవము

ధారావాహిక :

# త్రిలింగోపాసన అను విశ్వధర్మము

కన్నడ మూలం : శ్రీ జి. టి. అక్కులయ్య దీక్షితులు
తెలుగుసేత : పండిత శ్రీ రాచవీరదేవర పెద్ద మఠం,
తీర్థ M O L. (ఫిబ్రవరి సంచిక తరువాయి)

"తస్యాభి ధానాద్యోజి నాత్తత్త్వ భావాద్భూయశ్చాంతే
విశ్వమయానివృత్తిః, శ్వేతా( 1-10)"

ఆ పరమశివుని అభిధ్యానము అంతరాను సంధానము-యోజన-సంయోగము అర్థాత్ బాహ్యధారణ, భావము తత్త్వ తత్త్వ సాక్షాత్కారములతో సమస్త అజ్ఞానము నశించును.

"విశ్వదేవం విదుషావేదితవ్యం శైవలింగం పద్మతం సర్వదేవై!
తదాత్మ సిద్ధోర్మునిభిర్ముక్తి కామైఃకంఠె హస్తే మస్తకే
వాభవంతంధార్యం॥

దుఃఖనాశకమవైన ఓయి రుద్రుడా! నీయొక్క శాంతముమరియు మంగళకరమునైన లింగరూపమైన మే శరీరముగలదో అది పాప రహితమై భక్తుల దేహములయందు ప్రకాశము విరాజిల్లుచున్నదో అట్టిది సుఖప్రదము, సూక్ష్మమునైన యా లింగ స్వరూపముచేత

మా శరీరములందెల్లప్పుడు ప్రకాశించుగాక, ఇదే మంత్రము లింగపురాణంలో నిట్లు చెప్పబడినది.

"యాతె శివాతనూరుద్ర లింగమంగల దాయకం।
లింగ వాతనూః ప్రోక్తామూర్తి ఘోరాతనుస్మృతాః॥
అపాపేషుచ భక్తేషు తయోర్మధ్యే శివాతనూః।
కాశతె పరమేశస్యాత్ శిష్టాస్తే లింగధారిణః
తయాశంత మయా సౌఖ్యకారిణ్యా లింగరూపయా।
అభిచాకసీహితను వాగిరిశంతాభిరక్షితే॥

పైనుల్లేఖితములైన యంశములతో, తైత్తరీయోపనిషత్తు శ్వేతాశ్వతరోపనిషత్తు, మరియు యజుర్వేద సంహితలలో నుక్తములైన (చెప్పబడిన)మంత్రములు వీరశైవ ధర్మమునకెట్లు ప్రాచీనతను దెలుపుటకు బలమైన ఆధారములు (ప్రమాణములు) నైయున్నవి.

"పవిత్రంతె వితంత బ్రహ్మణస్పతె
ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః।
అతప్తతనూర్నతదామో అశ్నుతే
శృతాస ఇద్వహంత స్తత్సమాశత॥ (ఋ 2-3-8)

శరీరమునందు లింగ రూపముచేత సన్నిహితమైయున్నట్టి ఓయీ! పరశివమూర్తీ, నీయొక్క బ్రహ్మ స్వరూపమైన లింగము

అతి పవిత్రమైనది అందుచేత నది శుచి, అశుచి కాలములందును శరీరమునుండి దీయకుండ యెల్లప్పుడు ధరింపబడే యుంటున్నది. అది భక్తులయొక్క స్థూల-సూక్ష్మ-కారణ శరీరములందు ఇష్ట-ప్రాణ-భావ లింగరూపములలో వ్యాపించియున్నది. అణవాది మలత్రయ వినాశమునకు హేతువైన శివదీక్షను బడయని వాడు పరిశుద్ధాతః కరుణుడుగాలేడు. కావున అట్టివాడు ఆ పరశివ-లింగ మును పొందలేడు, శివజ్ఞానులైన వారు అ శివ లింగమును బడయుదురు.

ఈ విధముగా శ్రీకరభాష్యము, క్రియాసారము, శివా ద్వైతమంజరి, లింగధారణ చంద్రిక, సిద్ధాంత శిఖామణి, వీర శైవానందచంద్రిక, ఈశ-కేశ-ముండక శ్వేతాశ్వతర-తైత్తరీయ మొదలగు గ్రంథములందు వీరశైవ మతములో అతి ముఖ్యమైన అష్టావరణ-పంచాచార మరియు షట్స్థల సిద్ధాంతమునకు వేద మూలమును స్థాపించుటవలన వీరశైవమునకు వేదాగమోపని షత్తులే మూలమనుటలో ఏ విధమైన సంశయమునకాస్పదము లేదు. బసవాది ప్రమథులు వచన సాహిత్యమునందును శివ శర ణులు తమ వచనములలో వేదాగమోపనిషత్తుల వాక్యములను అక్కడక్కడ ఉదహరించి తమ అనుభవమునకు వేదాగమ సాహిత్యములోను ఆధార ప్రమాణములున్నవని నిర్దేశించి యున్నారు.

(సశేషము)

సూచన :- నా రచిత గ్రంథముల (పదింటి)లోని దిగువ పేర్కొనబడిన రెండు గ్రంథములను గురించి మరియు "ఆనంద బృంద" అను సాహిత్య మాస పత్రిక తెలుగు (సంపుటి 15, సంచిక7,8) లో నాకు తెలియని, వారు నాయందలి వారికి గలిగిన అభిమానము సద్భావనలతో సమీక్షించియున్నారు. పఠితలు ఈ రెండు గ్రంథముల సమీక్షలను తప్పకుండ చదువగలరు.

పుట సంఖ్య 14

ఆధ్యాత్మిక గ్రంథ పరిచయము

## జగద్గురు శ్రీ రేణుకాచార్య చరితామృతము

గ్రంథకర్త : పండితరత్న ధర్మనిరత వే॥పం॥ పెద్ద మఠము రాచవీరదేవర సంస్కృత తీర్థ (కలకత్తా) MOL తెలుగు (ఉస్మానియా) 19+4+118 పుటలు మూల్యము 20 రూ॥లు ప్రతులకు "వీరశైవ గ్రంథమాల 3-3-139-కాచిగూడ హైద్రాబాదు-500 027."

హిందీభూషణ, కన్నడజాణ, భాషాప్రవీణ, బిరుదాంకిత శ్రీ పం॥ రాచవీరదేవర పెద్దమఠంవారు భక్తిభావముతో తెలుగున వెలయించిన రేణుకాచార్యుల చరితామృతం 5 అధ్యాయాల కృతి-శివతత్త్వ శక్తి విశిష్టాద్వైత సిద్ధాంత అష్టావరణ లింగాంగ సామరస్య మహాత్మ్యములు సామాజికుల మనసుకు హత్తుకునేటట్టుగా

సాహిత్యక్షేత్రాన ఒకనిధిగా వీరశైవ ఉద్వేగ ఉగ్రశక్తిగా శివుని పంచ ముఖములనుండి ఉద్భవించిన పంచాచార్యులు ప్రతియుగ మందునూ భూపథగామియై వీరశైవ అభ్యుదయ భావాలను విస్తరిల్ల జేసినవారిలో ప్రథముడు శ్రీ రేణుక భగవత్పాదులు మన త్రిలింగ దేశమందలి కొలనుపాక క్షేత్రంలోని సోమేశ్వర స్వయంభూ లింగమునుండి ఉద్భవించిన వారలు ప్రాచ్యకాలము నాటి శివాగమాలలో రేణుకుల ప్రసక్తి రామాయణ కాలంలో విభీషణ ప్రీత్యర్థం ముక్కోటి లింగములను అన్వేషణా శీలియగు రేణుకులు ప్రతిష్టించినట్లున్నది. మహాభారత గాథలోనూ క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన శ్రీపతి పండిత శ్రీకర భాష్యము క్రీ.శ. 9వ శతాబ్ది సిద్ధనాథుని సంస్కృత రేణుక విజయము ప్రథమ కన్నడ బసవేశ్వర చరిత్ర కర్తయగు 12వ శతాబ్దికి చెందిన హరిహరుడు రేణుకుల చరిత్రను గ్రంథస్థమొనర్చారు.

శ్రీ కాశీనాథశాస్త్రి కన్నడమూలంలోని మౌళికాంశము లను వినూత్నయుత మొనర్చి సాహిత్యంలోని హితాన్ని సామాజిక స్పృహగా మలచిన సవ్యసాచి రాజవీరదేవర యిదొక స్వతంత్ర రచనగా స్ఫురింపచేశారు. తమ కుటుంబంకోసం బ్రతికేవారు సామాన్యులైతే సమాజంకోసం జీవించేవారు మేధావులు వారిలో గాయకులు కవులు రచయితలు ప్రముఖులు వీర శైవ ధర్మ వ్యాప్తికై తమ జీవితాన్ని అంకితమొనర్చిన శ్రీ

వీరశైవ దర్పణము

సెప్టెంబరు - అక్టోబరు - 1991

# శ్రీ మదల్లమ ప్రభువుగారి వచనము

రచన :- పెద్ద మఠము రాచవీర దేవర M.O.L.

కాలజ్ఞాన వచనము :-

కృతయుగమున శ్రీ గురువు శిష్యునకు కొట్టి బుద్ధిగరుపిన, కాని మహా ప్రసాదమని యంటినయ్యా!

త్రేతా యుగమున శ్రీ గురువు శిష్యునకు తిట్టి బుద్ధిగరుపిన, కాని మహా ప్రసాదమని యంటినయ్యా!

ద్వాపర యుగమున శ్రీ గురువు శిష్యునకు బెదిరించి బుద్ధి గరుపిన, కాని మహాప్రసాద మంటినయ్యా!

కలియుగమున శ్రీ గురువు శిష్యునకు వందన మాచరించి బుద్ధి గరుపుతే, కాని మహాప్రసాదమని యంటినయ్యా!"

గుహేశ్వరా ఏ కలికాల మహిమను నేను ఎరియుచున్నైరి నయ్యా!

అని యాదేశించిన నుడికారము ఈ కలికాలమున నెంతయో సరిపడుచున్నది.



శ్రీశ్రీశ్రీ రుద్రముని రాజదేశికేంద్ర శివాచార్యులవారి దివ్యసన్నిధిగారికి వే॥ పం॥ రాచవీరదేవరగారు ముద్రించి ప్రకటించిన శ్రీ రేణుకాచార్య చరితామృతమను గ్రంథాన్ని ఆవిష్కరింప జేయుచున్న దృశ్యము ఇందులో శ్రీ మలఖేడు గంగాధరస్వాములవారు మరియు పం॥ శ్రీ ఎం. శంకరయ్యగారు ఉన్నారు.



శ్రీ జగద్గురుపులవారికి సన్మాన పత్రమును సమర్పిస్తున్నారు
పం॥ రాచవీరదేవరగారు ఆం.ప్ర. వీ.మా.మ. సభాధ్యక్షులు



రంభాపురి వీర సింహాసనాధీశులైన జ॥ వీర రుద్రముని శివాచార్య మహాస్వాముల వారికి వే॥ పం॥
శ్రీ రాచవీరదేవరగారు తమ కుటుంబమువారితోగల్సి పాదార్చన గావించుచున్న చిత్రము



వే॥ పం॥ రాచవీరదేవరగారు
శ్రీ జగద్గురువులవారికి సన్మాన పత్రమును సమర్పిస్తున్నారు



మనుమరాలు చి॥ ఉమారాణి మరియు మనుమడు చి॥ నటరాజ
దేవరతో కాలక్షేపము చేస్తున్న పం॥ రాచవీరదేవరగారు



జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి జయంత్యుత్సవము
వి. వి. హాస్టలులో జరిగిన సందర్భమున శ్రీ శంకరప్పగారు
వే॥ పం॥ శ్రీ రాచవీరదేవరగారికి పాదపూజను గావించిన దృశ్యం

వీరశైవ దర్పణము
సెప్టెంబరు - అక్టోబరు - 1991

# అష్టావరణములలో ఇష్టలింగ ప్రాశస్త్యము

లేఖకులు :- పండిత రాచవీర దేవర "తీర్థ" & M.O.L.

వీరశైవ ధర్మమను వటవృక్షమునకు మూలాధారము లైన అష్టావరణములలో వీరశైవులకు ఉపాస్యదేవతా స్వరూపము లైన గురు-లింగ-జంగములందు ఈ మొదటే గురువును గురించి విశేషముగా ప్రస్తావించ నైనది. ప్రస్తుతము ఇక ఇష్టలింగమును గురించి ఇక్కడ ప్రతిపాదించబడుచున్నది.

వీరశైవులకు ప్రధానముగాను ప్రత్యేకించి ప్రతి వీరశైవుడు తన కంఠమునందు లింగమును ధరించుట అత్యావశ్యకమై యున్నది. క్రైస్తవులు ఏసుక్రీస్తు సిలువను, సిక్కులు ఖడ్గము కంకణము (కడెము), కంగి (దువ్వెనను) మొదలగు పంచ చిహ్నములను ప్రధానముగా ధరించు మాదిరిగానే వీరశైవులు ఈ శివస్వరూపమైన లింగమును ధరించాల్సి ఉంటుంది. ధనమున్నవాడు "ధనవంతుడనియు" బుద్ధియున్నవాడు "బుద్ధిమంతుడని ఎట్లుగా బుద్ధిమంతుడు ప్రపంచములో వ్యవహరింపబడుచున్నాడో అట్లే వీరశైవులు కంఠమునందుగాని, యెదపైనగాని, ఎల్లప్పుడును ఎడబిడకుండ లింగమును ధరించిననే నిజముగా లింగవంతుడనబడును.

శ్లో॥ గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్రదున్మిషన్ని మిషన్నపి।
శుచిర్వాఽప్యశుచిర్వాపి లింగం సర్వత్రధారయేత్॥
(చ.బ.వచనము)

పోవునెడల, నిల్చుండిన, పరుండిన, మెలుకువతో నున్నను, కన్నులు మూసినను, తెరచినను, తాను శుచిగానున్నను, అశుచి యందున్నప్పుడుగాని లింగము నెల్లప్పుడు దేహముపై ధరించి యుండవలెను. లింగము ప్రాణమువంటిది. అందుకే దానిని ప్రాణలింగమనిగూడ చెప్పుటగలదు. మానవుడు ప్రాణములేనిదే ఎట్లు ఒక క్షణముండలేడో అలాగే దేహమున ధరించాల్సి ఉంటుంది. ప్రాణము వీడిన శరీరము శవముగా మారినట్లగును. స్పృశించుటకు గూడతగదు. అందుకే శివ శరణులు లింగము లేని వారిని "భవియని" స్పృశించుట తగదని యాదేశించిరి. భవికి, ఆలింగియను సంకేత మొసంగిరి, లింగరహితుడు లింగ వంతుడని చెప్పుకొనుట నేతిబీరకాయవంటిది.

లింగమును ధరించినవాడేకులమువారైనను సరే, వారందరు లింగవంతులుగానే పరిగణింపబడుతారు, జాతి భేదమిక్కడ యెన్నబడదు. ఇందుకు అన్ని ఆగమముల సారభూతమైన, వీర శైవులందరికిని ప్రమాణగ్రంథమనబడిన శ్రీ శివయోగి శివాచార్య ప్రణీతంబైన "సిద్ధాంత శిఖామణి"యను గ్రంథరాజము నందిట్లాదేశించబడినది.

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియోవాపి-వైశ్యోవాశూద్రయేవవా।
అంత్యజోవాశివేభక్తి-శివస్సన్మాన్యయేవసః॥
శివసంస్కారసంపన్నే-జాతిభేదంనకారయెత్।
లింగభేదం కృతోయేన-రౌరవంనరకంప్రజేత్॥
శివభక్తి సమావేశే-క్వజాతిఃప్రకల్పనా।
ఇంధనేష్వగ్నిదగ్ధేషు-కోవాభేదఃప్రకీర్త్యతే॥
ఇంధన సంపర్కాత్-వృక్షనామ వినశ్యతి।
శివసంస్కారసంపన్నే-జాతిభేదోనవిద్యతే॥
గ్రామస్యమలినంతోయం-నదీనాంచ పవిత్రకం।
శివసంస్కార సంపన్నే-జాతిభేదంనకారయేత్॥

తా॥ బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులు-అంత్యజులు, ఏ జాతికి చెందినవారైనను శివునియందు భక్తి గలిగియున్నచో వారందరు శివభక్తులుగానే పరిగణింపఁబడతారు. శివసంస్కారము బడసిన వారియందు జాతిభేదమును పాటించవలదనియు, అట్లుజేసినవారు రౌరవనరకమును బొందుదురని యాదేశించబడినది. అగ్ని సంపర్కముచేత వృక్షముల నామరూపాలు లేకుండ ఎట్లుగా నశించునో అట్లే శివసంస్కారమువలన జాతి భేదము నశించును. గ్రామంలోని మలినమైన జలము నదిలో గలిసిపోవుటవలన ఆ మురికి జలముగూడ పవిత్రముగా మారుతుంది. అట్లే శివదీక్షా సంపన్నుడుగూడ గౌరవింపఁబడతాడు.

కావున జ్ఞానసంపన్నుడయిన గురువునాశ్రయించి వారి యనుగ్రహమువలన శివదీక్షను బడసినవారు.

శ్లో॥ స్ఫాటికం శైలజంవాపి-చంద్రకాంతమయంతువా।
భాణంవాసూర్యకాంతంవా-లింగమేకం సమాహరేత్॥
(సి.శి.)

స్ఫటికము నీలమణికి సంబంధించినదిగాని, పర్వతమునందలి శిలదిగాని, చంద్రకాంతము, బాణము - సూర్యకాంత శిలకు సంబంధించినదిగాని, వీటిలో దేనినైన శివలింగరూపమున ధరించి బూజింపవలెను.

శ్లో॥ అర్పయిత్వానిజేలింగే-పత్రం పుష్పం ఫలం తోయం।
అన్నాద్యం సర్వభోజ్యంచ-స్వీకుర్యాద్భక్తిమాన్నరః॥
(సి.శి)

శివభక్తులైనవారు తన ఇష్టలింగమునకు ప్రతి పదార్థమును సమర్పించే స్వీకరించవలెనని ఆగమ ప్రమాణము శాసించియున్నది. అట్లాచరించినవాడే నిజమైన లింగభక్తుడని పేర్కొనదగును.

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వాదయోదేవాామునయాాగౌతమాదయః।
ధారయంతి సదాలింగం-ఉత్తమాంగేవిశేషతః॥

బ్రహ్మవిష్ణాది దేవతలు మునిపుంగవులైన గౌతమాది-రుషీశ్వరులు సహితము ఎల్లప్పుడీశివలింగమును తమ తమ

మస్తకములందు ధరించి యున్నారు. (ఏకామ్రనాథ విరచిత మైన) అన్యవాద కోలాహలములోని గ్రంథప్రమాణములను ఇట ఒండు రెండు పద్యములనుదహరించుచున్నాను.

శ్లో॥ భంగిగా హరినీల లింగంబునర్చించి
విష్ణుమున్ బడయడే విష్ణుపదము॥
శశికాంత లింగంబు సద్భక్తి నర్చించి
బ్రహ్మమున్ బడయడే బ్రహ్మపదము॥
లీలనంబుజరాగలింగంబు నర్చించి
ఇంద్రుడు బడయడే ఇంద్రపదము॥
కాంస్యలింగంబు కరమర్థి నర్చించి
వసువులు వడయరే వసుపదమ్ము॥

ఆ॥ గానహరుడే యాదికర్తయుననుటకు
నచ్యుతాదులీశ భృత్యులగుట
కేలప్రత్యయంబు లేకామ్రగురు చిత్తనళినభృంగ
సోమనాథలింగ (24)

శ్లో॥ సూర్యత్వమర్థించి సూర్యుడు పూజించె
తామ్రలింగంబు సుద్దామభక్తి।
సోమత్వమర్థించి సోముండుబూంచె
మౌక్తిక లింగంబును మహితభక్తిః

వరుణత్వ మర్ధించి, వరుణుండు పూజించె
రత్నలింగంబు నభిరమ్య భక్తి
ధనదత్వమర్ధించి ధనదుండు పూజించె
హేమలింగంబు నభిరమ్యభక్తి ॥25॥

ఆ॥ ననుచుఁజదివి చదివియట్లోకోయిలలింగ
బాహ్యులై మహోగ్రపాతకముల
నేలవిడిచిరిట్లు లేకామ నళినబృంగ సోమనాథలింగ॥

శ్లో॥ అజహరీంద్రాదులు హరుశిరంబునదాల్తు
రటుశిరోభిర్ధారయంతి యనగ।
యలికాగ్రమున నలికాగ్రేషునిందాల్తు
రటు రాక్షసులునుద్రియక్షహరుని।
కంఠేషునాహర కంఠాదిఋషులు శ్రీ
కంఠుఁదాల్తురు భక్తిఁగంధర్వముల।
మనసస్తథాయన మనువులు తత్త్వదే
శమునను దాల్తురీ శానుననుచు।

ఆ॥ జదివిచదివి తారునది యెట్లో ఇల లింగ
బాహ్యులైరి వెఱుతే కామగురుచిత్త నళినబృంగ
సోమనాథలింగ।

ఇట్లు అచ్చతెనుగులో శ్రీయేకామ్రనాథ కవీంద్రుడు చెప్పి యున్నాడు. ఇంకను సిద్ధాంత శిఖామణి గ్రంథములో ఇలా నొక్కి వక్కాణించబడినది.

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వాదయోదేవాః-సర్వేవేదాదయస్తథా।
లీయంతేయత్ర గమ్యంతే-తల్లింగం బ్రహ్మ కేవలం
॥35॥ (సి. శిఖామణి)

ఈ విధముగా బ్రహ్మ-విష్ణ్వాదిదేవతలు, సమస్త వేదములు దేనియందు లయమును బొందునో అదే పరబ్రహ్మస్వరూపం బైన చైతన్యపూరితమగు జ్యోతిర్లింగము.

శ్లో॥ జ్యోతిర్మయం పరలింగం-శృతిరాహశివాత్మకం।
తస్యభాసాసర్వమిదం-ప్రతిభాతిన సంశయః॥
(సి. శిఖామణి లింగనిజస్థలం)

అట్టి సర్వశ్రేష్ఠమైన శివలింగముయొక్క అనిర్వచనీయమగు దివ్యప్రకాశమునుండే ఈ సమస్త ప్రపంచము వెలుగొందు చున్నదని వేదము లుద్ఘోషించుచున్నవి. అందుచేత వీరశైవ సిద్ధాంతమునుగూర్చి స్కాందపురాణం ముక్తకంఠముతో ఈ విధ ముగా హెచ్చరించుచున్నది.

శ్లో॥ లింగేన సహపంచత్వం-లింగేన సహజీవితం
ఏతద్ధర్మాఃసుప్రతిష్ఠాః-శైలాదేన ప్రతిష్ఠితాః
॥౪॥ (స్కాందపురాణం)

ఆ కారణమున నిజమైన వీరశైవుడు తన ఇష్టలింగముతోబాటే శివైక్యమందును. లింగంతోబాటే తన సహజీవనమును సాగించును. ఇట్లాచరించుటే వీరునియొక్క నిజమైన ధర్మమని శిలాదముని యాదేశించియున్నాడు.

వీరుడు తన ఎడమచేతియందే ఖడ్గమును ధరించి యుండును. తాను రణ రంగమునకు వెళ్ళి అచట తన శత్రువులను ఖడ్గంతో ఎట్లుగా చెండాడుచున్నాడో అట్లుగానే వీరశైవుడైనవాడుగూడ తన వామహస్తమున ఇష్టలింగనుంచి అనన్య భక్తితో పూజించి- తదేక చిత్తుడు రెప్ప గదల్చకుండ నిరీక్షిస్తూ తన అంతరంగములోని అరిషడ్వర్గమును త్రుంచివేయును. అట్టి దివ్యస్వరూపమైన ఇష్టలింగం (నిరాకారం) సకలం (సాకారం) గాకుండ సకల నిష్కలమై యొప్పుచున్నది, "ఓం" ప్రణవాకారమును మొదట "ఓ" కారమును వ్రాసి తరువాత బిందువునెట్లు ఉంచగలమో అట్లుగానె ఈ ఇష్టలింగమని యెరుంగవలెను. ఇట్టి యద్భుతశక్తియుతమైన లింగాన్ని వీరశైవుడు సదాకంఠము నందు తప్పకుండ ధరించవలెను.



వి. వి. హాస్టలులో ఆం.ప్ర. వీరమహేశ్వర (జంగమ) మహాస
ఎన్నికల తరువాత కార్యవర్గ సభ్యులనెన్నుకున్న చిత్రము



పం॥ ఉ॥ పరిషత్తు పక్షమున జరిగిన మహాసభలో పం॥ రాచవీర
దేవరగారు ఉపన్యసిస్తున్న దృశ్యము

౧ సంగన బసప్ప తాలూక చెరమూర్తి నిధానసందన్నవరము
శ్రీ గురుబసపలింగాయ్నమః
శ్రీ శుభమస్తు

౧ గొళ్లాణప్ప
శివానుభావ
చెరమూర్తి సదాశివునిపేట
౧ పాపన్నపేట చంద్రయ్యగారు
దేశికమూర్తి

శ్రీమతు సచ్చిదానంద చిన్మయచిద్రూపయోగా ఆనంద ఆద్వైతనిత్యశుద్ధపరిపూర్ణ సమర్ధవియోగభవకరుతుత్వ కారణ మహానుభావులయ్న పట్టాభిషిక్తులై రేవణశిద్ధాచార్యయోగమండల కమండలధారులైన పొడమటిభగిసాంప్రదాయకులైన గురు శాంతప్ప శిష్యుడు రాచయ్య, శిష్యుడు మల్లయ్య, శిష్యుడు శంకరయ్య, శిష్యుడు శిద్దయ్య, శిష్యుడు వీరయ్య, యిట్టియి అయిదుమంది కారణ సమూహము అయ్నదివ్యేవహారిక చాంద్ర మాన రక్తాక్షినామ సం॥ ఫాల్గుణ బ॥ ౧ బుధవారం కారణం అయ్నది చేవెళ్ళ పంగసబసప్పమటంలో సహికారణములతస్వీలు

౧ రాచయ్య వ॥ వీరయ్య చేవెళ్ళ, శిద్దయ్య వ॥ సంగయ్య చేవెళ్ళ, వీండ్లు యిద్దరు సదాశివునిప్యాట జోగిప్యాట షడస్థలం పెదమటాలకు హక్కుదారి—

౧ మల్లయ్య వ॥ భూమయ్య పౌకన్‌మాలుతుమ్మెద చిలుపుచెడు మఠంనకు,

౧ శంకరయ్య వ॥ చంద్రయ్య సాకిన్ చిట్టెంపల్లి చీలెపల్లి మటాలకు

౧ వీరయ్య వ॥ శంకరయ్య అందోలుమటంకు చేవెళ్ళమటంలో కారణాలుచేసినది సహి

దస్తకతులుపెద్దలయ్నవారు.

౧ కల్పగూరు వీరు సంగప్ప తాలూక చెరమూర్తి బిక్కలం పాపన్నప్యాట మఠం చెంద్రయ్యగారు.

౧ కాదులాబాద చెరమూర్తి గంగాధరయ్య

౧ సం॥ ద॥ సంగన బసప్ప చెరమూర్తి చేవెళ్ళ తకుశీము రాయచూరు

ద॥ పులికల్ మూలమఠం శంకరప్ప మొ॥

పులికల్ దేశిఖమూర్తి.

ద॥ మఠంచెనుభసప్ప కల్పగూరు

ద॥ గురుశాంతప్ప దేశికమూర్తి చేవెళ్ళ

మహత్తుదైవంచేవెళ్ళ

మఠంసిద్ధివీరయ్య డాకూరు

౧ ద॥ భూమన్న మొకద్దంమాల

౧ ద॥ అనుమన్న మొకద్దం కొత్వాలు.

## కాపి

తీర్థ స్వరూపులైన మహారాజశ్రీ మఠం వీరయ్య మొకాం జోగి పేటగారికి తోట శివులింగం మొ॥ మాలికు సదాశివపేట పదివేలు నమస్కారములు ఇప్పుడు ఉత్తరం వ్రాసినదీగరువా ఖ్యాతు యేమనగా ఇక్కడ మా గ్రామం యినాంమటం వగైరా తమరి అన్నగారు చేసినవి బావజూదు హక్కువుండంగ విడిచి పెట్టి అక్కడ ఉన్నారు అయితే ఇద్ది చాల అశర్యము అయిన మాష ఉన్నవి. ఇది నీకే తెలుసును, ఇదిగాకను ఇట్టి విషయ ముల మీకు శానదరదు కావలసి ఉండెను. కాని దాని శివాయ మేమువగ్రామమువాండ్లుకూడ తగులంగరావు. యిక్కడ విరూ పాక్షయ్యస్వామికియినాం తకరూరు అయ్యేటట్టు ఉన్నాది. మీరు లేనిదే మేము ఏమి చెయ్యవలెను. ఇప్పుడు జల్ది జవాబు చూస్తునె ఫోరన్ యీఅయ్య వెంబడి ముంతకబాలు వగైరా యినాంకాయి దాలు యేవేవున్నవోవ తమరి కొమారునితోలుకవచ్చినట్టు అవుతే ఇక్కడ రూబరులో ఫౌరన్ ఇప్పుడొక దరకాస్తు నా బాలగుతరబుబసలామతు వేయిస్తె ఫౌరన్ అట్టి విరాసతు అడ్డము పడుతాది. అందు గురించి నీవద్దకు మనుష్యుని తోలించ సయినది. ఇన్నిసార్లు మేము గురాచారమునుంచి ఇంత కోశీశు చాయగా తమరు....బాబతు ఉండంగ అట్టి మీఅన్న మాట నిల బెట్టవైతే. ఇది చాల బేకారుమాట మాఖ్యాసు మీకు తెలుసుతుంది.

తెలిసినవారికి ఎక్కువ వ్రాయనవుసరంలేదు గాన తెలిసేది. విశ్వచఅళ యిసుపందారు

1342

క్షేమము

యె ఉత్తరం జోగిపేటలో

మఠం వీరయ్యకు ముట్టించేది

## విరూపాక్షానందస్వామి

సంస్థానమఠం కోడంగల్, సదాశివపేట

29-12-1955

శిష్యాగ్రేసరరాదశ్రీ పి. రాచవీరదేవరు జోగిపేట పెద్ద మఠంగారికి ఆశీర్వాద పూర్వకముగా తెలియ వ్రాయునదేమనగా

మఠము పెరడులో వారు వీరు గ్రామస్థులు వేరేవారెవ రైనను గ్రామ మధ్యన ఉండుటచే స్వాయత్తము జేసుకొను చున్నారని వ్రాసియున్నారు. ఆట్టి స్థలమును వృధా పోనివ్వకుండ విక్రయించి వచ్చిన ఆదాయముతో ఉన్న స్థలమునే జీర్ణోద్ధార ముగావించవలెను. ఆద్రవ్యమును వృధా వినియోగపరచకుము.

అక్కడి భక్తులు కొందరు తమలోబరుచుకొనుటకు యత్నించినను మీరు వారి స్వాధీనములో కివ్వకుండ నీవే వ్యవస్థ జేయవలెను. ఎందులకన మఠములు గురుపరంపరగా

వచ్చిన శిష్యుల ఆధీనమునని యుండునని మన చట్టము తెల్పు చున్నది.

కావున జోగిపేట పెద్దమఠంయొక్క స్థితిగతులు నీపై ననే ఆధారపడియున్నవి. కాబట్టి జాగ్రత్త కావలసినది, మరో ముఖ్యవిషయమేమనగా శ్రీ గొల్లాళ్ళప్ప శిష్యుడివి కావున సదా శివపేట పెద్దమఠము హక్కు నీకే గలదు.

ఇత్యాశీర్వాదములు

సం॥

శ్రీ విరూపాక్షానందస్వామి

కొడంగల్లు

శ్రీమన్మహారాజ నిరంజన జగద్గురు
శ్రీశ్రీ విరూపాక్షానంద మహాస్వాములవారు
సంస్థానమఠం కోడంగల్‌హాలు మొక్కా సదాశివపేటగారు

చి॥వే॥పం॥ పి. రాచవీరదేవరగారు జోగిపేటగార్కి వ్రాసి ఇచ్చిన వసీయతునామ ఏమనగా నాకు వృద్ధాప్యము వచ్చి దినం ప్రతిదినము మా ఆరోగ్యము క్షీణించుచున్నది. మేము ఇంత వరకు మాస్థిరచరాస్తులకు అధికారిగా ఎవ్వరిని శిష్యునిగా అంగీ కరించలేదు. కనుక మా సంస్థానముయొక్క దీపమును నిలుపు టకై మా గృహస్థ శిష్యుడవగు నీయొక్క జ్యేష్ఠపుత్రుడగు చి॥ బసవరాజను శిష్యునిగా అంగీకరించి ఒక సుముహూర్తమున

మాహేశ్వర దీక్షా సంస్కారమును చేసి కొడంగల్ సదాశివపేట మొదలగు సంస్థాన మఠములకు అధికారిగా స్వీకరించుటకు (నియమించుటకు) మేము సంతోషపూర్వకముగా అంగీకరించి నాము.

అట్టి చి॥ బసవరాజు చదివి పెద్దవాడయ్యేవరకు నీవు నీ కుటుంబ యుక్తముగా మాసేవలో యుండి సదాశివపేట స్థిర చరాస్తులచేత నీవు నీ కుటుంబపోషణము గావించుచు సమాజాభి వృద్ధికై పాటుపడి "శ్రీమజగద్గురు విరూపాక్షానంద శివానుభవ సంస్కృత పాఠశాలను ఉచితముగా నడిపించవలసినది. ఆ పాఠశాలకైయ్యే వ్యయము హైద్రాబాద్‌లోనున్న మా స్వంత ఆస్తియగు "జగదాదిదేశికనికేతన"ము యొక్క కిరాయనుండి జరిపించవలయును మరియు తక్కువ ఎక్కువులకు మేము చూచుకుందుము. ఇదిగాక ప్రస్తుతము కొడంగల్ మఠము కార్యాయని నీవు పూర్తి బాధ్యత వహించి కేసు నడిపించవలసి నది. దానికయ్యే వ్యయము మొత్తమును మేమే భరించగలము. మా అనంతరం కోడంగల్ మరియు సదాశివపేట మొదలగు మఠములకువస్థిరచరాస్తులకు చి॥ బసవరాజుకే అధికారముండ గలదు. నీవు నీకుటుంబయుక్తముగా మా మఠములోనుండుచు ఉచితముగా మాసేవ చేసినందుకు మాకు సంబంధించిన సదాశివ పేట మఠముయొక్క ఆస్తిని అనుభవించుటకు అర్హులవు కాగలవు. హైద్రాబాదులోనున్న ఇల్లు కిరాయ వసూలు, రిపేరి

దావా జవాబుదేహి సంస్థానముయొక్క జవాబు దేహివ ఇతర కార్యములకొరకు ముఖ్త్యార్ ఆం నీకు వ్రాసి ఇవ్వగలను.

కోడంగల్ మరియు సదాశివపేట మొదలగు మఠముల యొక్క పర్యవేక్షణాధికారము శ్రీ॥మ॥ని॥ప్ర॥ శంకరస్వాముల వారు ఆలంపల్లిగార్కి ఇవ్వబడుచున్నది. సదరు స్వాములవారి సలహా ప్రకారము నీవు ఈ సంస్థలను నిర్వహించవలయును.

సదరు చి॥ బసవరాజు చదివి పండితుడు మరియు యోగ్యుడు కాకపోయిన ఎడల ఇతని స్థానములో యోగ్యుడైన పండితుని సంస్థానముయొక్క అధికారినిగా ఏర్పరచుటకు మీ ఉభయులకు (శ్రీ॥మ॥ని॥ప్ర॥ శంకరస్వామి చి॥ రాచవీరదేవరు) అధికారముండగలదు. ఇది మా సంతోషపూర్వకముగా వ్రాసి ఇచ్చిన వసీయతునామసహి--

దస్తూరి—శ్రీ శంకరస్వామి
ఆలంపల్లి

సంతకము
శ్రీ స్వామి విరూపాక్షానంద

సాక్షులు
శెట్టి రేవప్ప 2-7-1967

విరుపాక్షయ్యా పళగావు
ధనుడ జి. బీదర్
చేర్‌మన్ అప్‌కాప్ కమేటి

సం॥ శ్రీనివాసరావు.
మదనూర్‌కర్

సం॥ డి. బసవరాజు

సం॥ కస్సెట్టి విశ్వనాథం

సం॥ శివ నాగప్ప
2-7-67.





జోగిపేట పెద్దమఠములో శ్రావణమాసదీక్షా సమాప్తి సమయమందు స్థానిక భక్తులు వే॥ పం॥ శ్రీ పెద్దమఠం రాచవీర దేవరగారికి పాదార్చన గావించుచున్న చిత్రము



ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ పరిషత్తుకు మొట్టమొదటిసారి వి. వి. హాస్టలులో పరిషత్తు సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నుకొనిన దృశ్యం



ఆం. ఉ. పం. పరిషత్తు రజతోత్సవమున షం॥ రాచవీరదేవరగారి
అధ్యక్షతన డా॥ సి. నారాయణరెడ్డిగారు ఉపన్యసిస్తున్నారు



మనుమరాలు ఉమారాణికి అక్షరాలు దిద్దిస్తున్న వే॥ రాచవీరదేవ



వీరమహేశ్వర (జంగమ) మహాసభ పక్షమున విహారయాత్రకై
బోడబండ ఈశ్వరాలయమునకు వెళ్ళిన మహాసభ్యులు



వే॥ పం॥ రాచవీరదేవరగారు జగద్గురు రేణుకాచార్యులవారి
పురాణ ప్రవచనము గావించినపుడు విచ్చేసిన మహిళా భక్తులు



వి. వి. హాస్టలు బాగ్ లింగంపల్లిలో జరిగిన జ॥ రేణుకాచార్యుల వారి జయంత్యుత్సవ సందర్భమున అక్కన బళగ అనే నామకరణముతో నేర్పరచిన మహిళా సంఘ సభ్యులు



1991 స|| శ్రీ బసవేశ్వర జయంతి సందర్భమున వి. వి. హాస్టలులో
నందీ ధ్వజారోహణానంతరము షట్స్థల పతాకమును గురించి
పం|| రాచవీరదేవరగారు ఉపన్యసించుచున్నారు.



బసవేశ్వర జయంత్యుత్సవ సందర్భమున వి. వి. హాస్టలు ఆవర
ణలో సామూహికముగా దిగిన చిత్రము



వి. వి. హాస్టలులో శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవ సందర్భమున
శ్రీ రాచవీరదేవరగారు ఉపన్యసించుటకు సిద్ధపడుతున్న దృశ్యం




వి. వి. హాస్టలు బాగ్ లింగంపల్లిలో శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవసందర్భము
వే॥ పం॥ రాచవీరదేవరగారు నంది ధ్వజారోహణము గావించుచున్న దృశ్యము

# 2 Rupees Stamp

**S.No. 460 datəd 4-7-67** **S.V. No. 100**
**A.P. Court**

"ఓం"

## వసీయతునామ

స్వస్తిశ్రీమన్నృప శాలివాహనశక ౧౮౮౯ ప్లవంగనామ సం॥ జ్యేష్ఠ బ॥ ౧౩ బుధవారం తేది 5 జులై 1967 నాడు శ్రీమన్మహారాజ నిరంజన జగద్గురు శ్రీ శ్రీ బసవలింగమహా స్వాములవారు సంస్థానమఠం కొడంగల్ గారి కరకంజాత సంజని తులైన న్యాయ,సాంఖ్య,మీమాంసాదిశాస్త్ర పట్టభద్రులు, 'విద్యారణ్య' బిరుదాంకితులు అగు శ్రీమన్నిరంజన ప్రణవస్వరూపులగు జగద్గురు శ్రీ శ్రీ విరూపాక్షానంద మహాస్వాములవారు సంస్థాన మఠం కొడంగల్ హాలు మొకాం సదాశివపేట గారు వ్రాయిచిన వసీయతునామమేమనగా మాకు వృద్ధాప్యము. దినదినము ఆరోగ్యము క్షీణించుచున్నది. ఇంతవరకు మా ఉత్తరాధికారమునకు శిష్యుణ్ణి ఎవ్వరినికూడా అంగీకరించలేదు. కనుక మాసంస్థానాభ్యున్నతికై మా గృహస్థశిష్యుడగుటచే పెద్దమఠం జోగిపేట వే॥పం॥ రాచవీరదేవరు 'కావ్యతీర్థ' భాషాప్రవీణ, తెలుగు **M.O.L.** సాహిత్యవిశారద, కన్నడజాణ, హిందీభూషణ, పట్టభద్రులు, ప్రభుత్వోన్నత పాఠశాల సీనియర్ గ్రేడు 1 పండితులుగారి జ్యేష్ఠ

పుత్రుడు చి॥ బసవరాజును సంస్థానమఠం, కొడంగల్ సదాశివ పేట, జోగిపేట, తదితరములైన సమస్త, శాఖామఠములకు మా ఉత్తరాధికారునిగా నిర్ణయించి స్వీకరించినాము. చి॥ బసవ రాజు చిన్నవయసుగలవాడు కావున తండ్రియైన రాచవీర దేవరు పిల్లవానిని పోషించుచు, చక్కగా చదివించి, పండితునిగా జేసి, మమ్ములను కూడా మా జీవిత పర్యంతం సేవ జేయుచు, కుటుంబ యుక్తముగా సదాశివపేటలోనేయుండి మఠముయొక్క స్థిరచరాస్తులను అనుభవించగలరు.

సంస్కృతము మరియు శివానుభవశాస్త్ర ప్రచారమునకై "శ్రీమజ్జగద్గురు విరూపాక్షానంద సంస్కృత శివానుభవ పాఠ శాల" యను పేరుతో నొక పాఠశాలను స్థాపించవలయును. ఏ తత్ పాఠశాల వ్యయమునకై హైదిరాబాదులో నున్న మా స్వంత యిల్లు "జగదాదిదేశిక నికేతనము" యింటి నెంబరు 4-8-163-164 గౌలిగూడా రామమందిరము వెనుక ఉండబడిన దాని యొక్క కిరాయాదాయమునుండి (ఇల్లు రిపేరి ధావాలు మొదలగు ఖర్చులు మినహాయించి మిగిలిన దానినుండి) నడిపించగలరు. దానికైయ్యే ఖర్చులను మేమే భరించగలము. ప్రస్తుతం సంస్థాన మఠము కోడంగల్, అన్యాక్రాంతమైనందున దానిని విడిపించుకొనుటకు మరియు వ్యవస్థ చేయుటకు పండిత రాచవీరదేవరకు ముఖ్త్యార్‌ఆం ఇచ్చుచున్నాము. కార్వాయికి తగిలే ఖర్చులను మొత్తం మేమే భరించగలము. మరియు

పం॥ రాచవీరదేవరు "శ్రీ జగద్గురు విరూపాక్షానంద సంస్కృత-శివానుభవ పాఠశాల"లో సంస్కృతమును మరియు శివానుభవ మును ఉచితముగా బోధించవలయును. సంస్థాన మఠం కోడంగల్ మరియు సదాశివపేట తదితర శాఖామఠముల యొక్క అభివృద్ధిని గురించి శివానుభవ పాఠశాలను గురించి శ్రీ మ॥ని॥ప్ర॥ శంకరస్వాములవారు ఆలంపల్లి గారి అభిప్రాయానుసారముగా పనులను నెరవేర్చుడనగలరు. సదరు చి॥ బసవరాజు చదివి పండితుడు యోగ్యుడుగాని యెడల ఇతని స్థానములో యోగ్యుడైన పండితుని సంస్థానము యొక్క అధికారునిగా నియమించుటకు మీ యుభయులు (శ్రీ మ॥ని॥ప్ర॥ శంకరస్వాములవారు ఆలంపల్లి, పం॥ రాచవీరదేవరు) సధాశివపేట-కోడంగల్ భక్తమండలికి అధికారముండగలదు. ఇది మా స్వంత జ్ఞాన పూర్వకముగా మరియు సంతోష పూర్వకముగా వ్రాయించిన వసీయతునామ సహి.

దస్తూరి-శ్రీ శంకరస్వామి

శ్రీ స్వామి శ్రీ విరూపాక్షానంద ఆలంపల్లి మఠము

శివనాగప్ప, మొ॥మాలి

సాక్షులు :- 1. సం॥ శ్రీనివాసరావు మదనూరుకర్

2. సం॥ శెట్టి రేవప్ప

3. సం॥ ముడుపతి బ్రహ్మయ్య

4. సం॥ సంగప్ప, శివారెడ్డిపేట.

గమనిక :- ఇది సదాశివపేట పెద్దమఠమునకు సంబంధించిన
ప్రకరణము. మెదకు జిల్లా.

TELEGRAM 149

SRC RPT SRC YAKUTPURA
23 — VRIOPAKSHANAND AS ERE

0 1500 A 4 SADASHIVPET 22 21 P RACHU
VEERA DEVARA M O L H NO. 76/ SRT
YAKUTPURA COLONY HYDERABAD 23

— START MOST URGENT SADASHIVAPET

VIROPAKSHANAND —

- LN 155 A 4 P RACHU VEERA DEVR
DEVARARA M O L H NO 76 SIT

# One Rupee Stamp

| సంఖ్య | తేది | వెల |
| --- | --- | --- |
| 4782 | 24-3-72 | (1.00) |

ఓం

శ్రీ గురు బసవలింగాయ నమః

స్వస్తిశ్రీ పరీధావి నామ సంవత్సర చైత్ర శుద్ధ॥ ౧౦ శుక్రవారము తేది 24-3-1972 నాడు శ్రీశ్రీస్వామీ వీరభద్ర శివాచార్యులు బృహన్మఠ హల్గూరు మలవళ్ళి తాలూకా మండ్య జిల్లా మైసూరు స్టేట్‌గారి పుణ్యకర కమలములతో శ్రీ పెద్దమఠం రాచవీరదేవరగారి పుత్రులు చి॥ పెద్దమఠం బసవరాజదేవర మరియు పెద్దమఠం ప్రభులింగదేవర వీరిద్దరికి మెదక్ జిల్లా, తా॥ సంగారెడ్డి, సదాశివపేట, పెద్దమఠంలో వీర శైవాగమోక్త రీత్యా కారణములు జరుపబడినవి.

ఈ కార్యమునందు స్థానిక మహత్తు దైవము నావెల్లిలు పాల్గొనియుండిరి. ఇట్టి కారణములు శ్రీ మన్నిరంజన ప్రణవ స్వరూపులైన శ్రీ స్వామీ విరూపాక్షానంద మహాస్వాములవారు సంస్థాన మఠము కొడంగల్‌గారి పర్యవేక్షణలో జరిగినవి. ఇది నిజము మరియు శ్రీ వారి పాదము క్రిందికి చి॥ బసవరాజ దేవరను శిష్యునిగా స్వీకరించనైనది.

ఇట్లు
శ్రీ శ్రీస్వామి వీరభద్ర శివాచార్య
బృహన్మఠ హల్గూర్ మండ్య జిల్లా
మైసూర్ స్టేటు 24-3-72

పంతకాలు :

శ్రీ చంద్రశేఖరస్వామి, పాపన్నపేట డి. బసవరాజు 24-3-72

శ్రీ నీలకంఠస్వామిగళు — శెట్టి రేవప్ప

దస్తూరి కె. శివరాములు — శివనాగప్ప 24-3-72

ద॥ తేర్దెల్లి బక్కప్ప — సిందోలు వీరప్ప

నాగ్‌సంగప్ప మొ॥మాలి

బరహన్‌డిబ్బ.

శ్రీ షడక్షర దేశికేంద్రస్వామి గళు
వీర సింహాసన మఠం, ధనగూరు
సుబ్బన్న, రి.స్తు.ను. హాలుగూరు.
మడుపతి అడివయ్యస్వామి
మటం రేవయ్యస్వామి మాయికోడ్
మఠం శిద్ధరామయ్య గడిపెద్దపురం.

వేలిముద్ర

ఈ ఇంప్రేషన్ శ్రీమన్ నిరంజన ప్రణవ స్వరూప జ॥ స్వామి విరూపాక్షానంద సంస్థాన మఠం కోడంగల్ శాఖా మఠం సదాశివపేట గారిది.

# శ్రీ శివానుభవ సంస్థ-వీరశైవ సంస్కృత పాఠశాల స్థాపనము మరియు మహేశ్వర దీక్షా సంస్కారములు

## ఆహ్వాన పత్రిక

శ్రీ మన్నిరంజన ప్రణవస్వరూప 770 జ॥ శ్రీ విరూపాక్షానంద మహాస్వాములవారి ఆశీర్వాదముతో మరియు వారి దివ్య పర్యవేక్షణలో ఈ దిగువ శుభ కార్యములు జరుగును.

అఖిల భారత శివానుభవ సంస్థ శాఖా ఆంధ్రప్రదేశ్ సదాశివపేటలో స్థాపన మరియు వీరశైవ సంస్కృత పాఠశాల స్థాపన మరియు శ్రీ పండిత రాచవీరదేవరగారి సుపుత్రుల యొక్క దీక్షా సంస్కారములు స్వస్తిశ్రీ పరీధావినామ సంవత్సర చైత్ర శు॥ ౧౦ తేది 24-3-1972 శుక్రవారంనాడు పెద్ద మఠంలో ఈ దిగువ కార్యక్రమములు జరుపబడును.

1. ఉదయం 8 గం॥లకు వీరశైవ షట్స్థల ధ్వజారోహణము శ్రీ మ.న్ని.ప్ర. శ్రీ నీలకంఠ స్వాములవారి కరకమలముచే జరుగును.

2. ఉదయం 9 గం॥లకు శ్రీ శ్రీ స్వామి వీరభద్ర శివాచార్యులు బృహన్మఠ హలూరు

మైసూర్ రాష్ట్రము గారి దివ్య కర కమలముచే మాహేశ్వర దీక్షా సంస్కారములు జరుపబడును.

3. మధ్యాహ్నం 12 గం॥లకు గణారాధన

4. సాయంకాలం 5 గం॥లకు వీరశైవ శివానుభవ సంస్థా ఆంధ్రప్రదేశము యొక్క శాఖా శ్రీ మ.న్ని.ప్ర. విరూపాక్షానంద స్వాములవారి దివ్య కరకమలములచే మరియు వీరశైవ సంస్కృత పాఠశాల గూడా శ్రీవారిచే స్థాపింపబడును.

శ్రీమన్నిరంజన ప్రణవస్వరూప శ్రీచంద్రశేఖర మహాస్వాములవారిచే 'నేనేవరు?" అనుగ్రంధావిష్కరణము జరుగును.

5. సాయంకాలం 6 గం॥లకు శ్రీ మ.న్ని.ప్ర. విరూపాక్షానంద స్వాములవారి అధ్యక్షతలో శివానుభవ గోష్ఠి మరియు దివ్యోపదేశములు జరుగును.



శ్రీ రుద్రముని రాజదేశి కేంద్ర శివాచార్యులవారు వే॥ పం॥ రాచవీర దేవరవారి కుటుంబ సభ్యులతో



వే॥పం॥ రాచవీరదేవరగారి పుత్రద్వయము బాల్యములోని చిత్రం

ఉపన్యాసకులు :-

శ్రీమన్నిరంజన ప్రణవస్వరూప శ్రీ శంకరస్వాములు, ఆలంపల్లి, మఠాధ్యక్షులు. సాహిత్య శిరోమణి శ్రీ యస్. సోమశేఖర శర్మ, ఎం.ఏ.యల్.యల్.బి., అడ్వొకేట్‌గారు ఆంధ్ర వీర శైవ సంఘాధ్యక్షులు, గుంటూరు.

శ్రీ పండిత రాచవీరదేవరగారు, ఎం.ఓ.యల్., తీర్థ.

శ్రీ శెట్టి రేవప్పగారు, సదాశివపేట.

రాగోరువారు,

**శ్రీ పండిత రాచవీర దేవర** ఎం.ఓ.యల్.

కార్యానిర్వాహకులు :-

శ్రీ శెట్టి రేవప్పగారు

శ్రీ శిందోలు వీరప్పగారు

శ్రీ గండ్గి శ్రీరామప్పగారు

శ్రీ తోట సదాశివుడుగారు, మొ॥ పోలీస్

శ్రీ తోట శివనాగప్పగారు, వకీల్, మొ॥ మాలి

**స్థలము : సదాశివపేట పెద్దమఠం**

తా॥ సంగారెడ్డి, జి॥ మెదక్, ఆంధ్రప్రదేశ్

3. అఖిలభారత శివానుభవ సంస్థశాఖ, శివానుభవ సంస్థపాఠ్య ప్రచారమును నడిపించవలెననిన; మరియు వీరశైవ పాఠశాల నడిపింపవలెననిన; అందును బీద విద్యార్థుల భోజనపు ఖర్చు మరియు నితరమైన యత్యవసరమైన ఖర్చులకు మా సొంత భూమియగు సర్వేనం (283) ఎకరాలు (7-2 రూ, 16) సదాశివపేటలో నున్న రేగడిభూమి మరియు నా సొంత ఇల్లు నం. (4-8-163) హైదరాబాదులో నున్న "జగదాది దేశికనికేతము" దాని మొత్తము కిరాయ నెలనెలకెంత వచ్చినను పాఠశాల ఖర్చుకు మరియు సదాశివపేట రేగడి భూమిలోని యాదాయమెంత వచ్చినను శివానుభవ సంస్థను నడిపించుటకై యిచ్చి యున్నాను.

4. శ్రీ పండిత రాచవీరదేవరు. శివానుభవ సంస్థను నడిపించుటకై మరియు పాఠశాలయందు విద్యార్థులకు, పాఠముల గఱపుటకు, మరియు దాని నిర్వహణమునకై వారు హైదరాబాదునుండి ట్రాన్స్ఫర్ సదాశివపేట కాలేజునకు జేయించుకొని సదాశివపేటలో స్థిరనివాస మేర్పఱచుకొనవలెను. శ్రీ పండిత రాచవీరదేవర స్థిరనివాసమునకై మా సొంత ఇల్లు మఠము ఎదుట నున్నది ఇంటినం. (4-3-88) వారికిచ్చి యున్నాను. వారు సదా ఆ యింటి యందు తమ కుటుంబ యుక్తముగానుండి పైన వ్రాయఁబడినయన్ని కార్యములను సమర్థవంతముగా నడిపింపఁవలెను.

**5.** ఈ వీరశైవ పాఠశాల మరియు శివానుభవ సంస్థను నడిపించుటకై దేశమంతట సంచరించి శ్రీ నీలకంఠ స్వామి మరియు శ్రీ పండిత రాచవీరదేవరు వీరుభయులు కల్సి మెలసిభిక్షాటన యొనర్చి ఖర్చుబెట్టవలెనని మాముఖ్యోద్దేశము.

6. శ్రీ పండితరాచవీరదేవరు వారియుద్యోగమున్నంత వరకు దమ కుటుంబ పోషణమును వారేభరించుకొనవలెను. ఉద్యోగము స్తంభించడముతో వారి కుటుంబ పోషణముయొక్క భారము మా శిష్యులైన శ్రీనీలకంఠస్వామి సంపూర్ణముగా వహించవలెనని వారి నాదేశించియున్నాను.

ఈ వ్హీల్‌నామ మాయొక్క సంపూర్ణమైన కోరికతో వ్రాయించియున్నది నిజము.

శ్రీవిరోధి ఫాల్గుణ శు॥ ౧౦, తా॥ ౨౭ ఫిబ్రువరి ౧౯-౭౨
వ్రాసినవారు శెట్టి రేవప్ప. వేలిముద్ర

ఈ ఇంప్రేషన్ శ్రీమన్ నిరంజన ప్రణవ స్వరూప జ॥ స్వామి విరూపాక్షానంద సంస్థాన మఠం కోడంగల్ శాఖా మఠం సదాశివపేట గారిది.

సాక్షులు

౧ శ్రీనీలకంఠస్వామిగళు
౧ పి. రాచవీరదేవర. **M.O.L.**
౧ శిందోలు వీరప్ప.

శ్రీయుత పట్వారిగారికి తేది. 1-5-1974
సదాశివపేట జిల్లా మెదక్

విషయము:- సదాశివపేట పెద్దమఠంకుసంభందించిన సర్వే నం॥ 283, 501, 941 & 956-పట్టా గురించినయినాములు.

అయ్యా.

స్థానిక పెద్దమఠమునకు నంబంధించిన స్థిరఆస్థి పై సర్వే నంబర్లు శ్రీ పెద్దమఠం గౌళ్యాళప్పగారికి సంబంధించినవి, వారి వారసుడనైననేను బాల్యములో విద్య నభ్యసించుటకు పోయిన సమయమందు శ్రీ వీరుపాక్షస్వామిగారు ముత్సద్దిగిరిగా నియమింపబడుటచేత మఠమునకు సంబంధించిన వ్యవహారములన్నియు ఆతడే చూచుకొనుచుండెను. ఆతని మరణానంతరము శ్రీ నీలకంఠస్వామి మఠమునకు సంబంధించిన సంబర్లుగల భూములను తమపేర పట్టావిరాసతు చేయించుకొనుటకు యత్నములుజరుపుచున్నట్లు తెలియవచ్చినది. కావున అసలుదారునగు నేను అతనిపై ఎండోమెంటులో కారువాయి పెట్టి ఉన్నాను. గనుక అది పరిష్కారమగువరకు అతని పేరిట జమాబందిలో ఆమలువరచకుండ ఆపి యుంచవలసినదిగా కోరుచున్నాను.

ఈ విషయములో సదాశివపేట వీరశైవ పురప్రముఖులు కొందరు నీలకంఠస్వామిపై అవిశ్వాసమును ప్రకటించియున్న వినతిపత్రముయొక్క ప్రతిని దీనితో జతపరుచనైనది.

ప్రతులు.
1. శ్రీ శివునాగప్ప మాలిపటేల్ గారికి
2. తహసీల్దార్ సంగారెడ్డిగారికి
తగు పరిష్కారముకొరకు ఇవ్వనైనవి. ఇట్లు
(సం॥) పం॥ రాచవీర దేవర

卐卐

సదాశివపేట పెద్దమఠము శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారి పేరిట పట్టెదారుగా ప్రభుత్వమునుండి అమలైన భూముల

**వివరాలు :**

సర్వేనెం. సేతువారితక్త శ్రీ మటంమాడయ్య ఫవుతు వారిసు దారు గొల్లాళప్ప సదాశివపేట సన్ ౧౩౩౩ ఫసలి

283 మాఫిఇనాం కుల్లు 2-౩ ఎకరాలు-గుంటలు ౦౬-౦ ఆకార్ పన్ను ౨ ఉబచెఋపుపద్ద ఖుష్కి

**ఎల్లల వివరములు :**

286 సిద్ధాపురంతోపకు, ఉప్పరి-గడ్డపట్టా 1 శ్రీ హుణయ్య తండ్రి శివయ్య హిస్సెదార్ 2 బాలమ్మ జె॥ ఎల్లయ్య పట్టేదార్

284 సిద్ధాపురం దోవకు శ్రీ బొంగకాయల హుస్సేన్ తండ్రి కాసింసాబు పట్టెదార్.

## మటం మాదయ్య ఫవుతుహాలు గొల్లాళప్ప
## ఖుష్కి-పట్టా

సర్వేనెం.

501 చౌకిలో ఇనాం కుట్లు ౬°౦, ఎకరాలుకుల్లు ౩°౩
ఎకరాలు ౧°౦౯ పన్ను ౩°౧ ఆకార్.

ఎల్లలు-వాటి వివరాలు

502 చెన్నబసప్ప పట్టెదార్

503 అ॥ హనుమాన్ వ॥ లక్ష్మినారాయణ, ఆ. వీరుసంగప్ప.

506 సడకు బందుకు, పట్టామాడిశెట్టి రాచయ్య వ॥ ఏరయ్య

508 సడకు బందుకు, కలుబుడిగి వీరప్ప వ॥ మందప్ప

496 గుండం వద్ద శంకరమ్మ జె॥ వీరప్పజ్యోతి, పట్టెదార్

497 గుండంవద్ద చంద్రయ వ॥ చన్నబసప్ప పట్టెదార్,
మటంమాదయ్య ఫవుతుహాలు వారిసు గొల్లాళప్ప

941 ఎలుగుదొయ్యపట్ట మాఫిఇనాం. 0°39. కుల్లు ఎకరాలు
గుంటలు-0°2 (0°32 ఎకరాలు)
ధారా ౧౯°౧౦. ఆకార్ ౧౮°౦ ఎకురాలు ౦°32
ఆకార్ ౧౮°=౧°౭-౧°౪ చెర్వు.



హైదరాబాదు మలక్‌పేట బి. కాలనీ, శ్రీ నాగలింగేశ్వర దేవా
లయము ప్రాంగణములో వీరమహేశ్వర (జంగమ) మహాసభ
పక్షాన జరిపిన శ్రీ బసవ జయంత్యుత్సవ సందర్భమున శ్రీ
మాడపు బొంతప్పగారు, శ్రీమతి ఎ. స్వర్ణలతగారుపన్యా
సిస్తున్నారు వే॥ పం॥ రాచవీరదేవరగారి అధ్యక్షతలో

సర్వేనెం.

908 సడకు బందుకు పట్టామల్లన్న వ॥ పాపన్న హిస్సేదార్.
వగైరా చిల్వారా గొల్ల.

909 ఎల్లమ్మ దొయ్యపట్టా. బద్రప్ప మరెల్లి.

938 ఎలుగు దొయ్య శివరెడ్డి వ॥ రాంరెడ్డి బొందలగడ్డ

939 ఎలుగు దొయ్య బాలరాజ వ॥ పాపయ్య ఖరీద్దారుబాపతు.

940 ఎలుగు దొయ్య, సదాశివుడు వ॥ మల్లప్పతోట.
పట్టెదార్.

942 ఎలుగు దొయ్య పట్టా సిరుబసప్ప ఖరీద్దారు.

971 హనుమాండ్ల వద్ద పట్టా నిజాంగారి సిరాజోదీన్
వ॥ ఇబ్రాహింసాబు.

మటం మాదయ్య ఫపుతుహాలు వారిసుగొల్లాళప్ప

956 మాఫి ఇనాం ౧౪ కుల్లువి - ౦౩ ౧౧ - ఎకర్ - ౧౯౦
౧౯౦ తరి - ౧౧ - ఎకర౧౯౦ - ఆకార్ - ౧౭ -
ధారా ౧౮- చె.ర్యు.

954 ఎలుగు దొయ్య పట్టా. వెంకప్ప వ॥ సాయన్న కాసాల
షిక్మిదార్.

955 ఎలుగు దొయ్య పట్టా అబ్దుర్ ఖాదర్ వ॥ కుద్దై గారి హిస్సాగారు.

957 ఎలుగు దొయ్య సంగమ్మ వ॥ బాలయ్య కుష్కీగడము.

958 ఎలుగు దొయ్య పట్టా అడివప్ప వ॥ సంగన్న చీలె.

959 ఎలుగు దొయ్య పట్టా సంగప్ప వ॥ ఆడివప్ప చీలె.

963 గోరీల వద్ద పట్టా ఖైరాతి సిద్దివాలె పట్టేదార్ తరీ

964 గోరీల వద్ద పట్టా నిజాంగారి మీరాన్‌సాబు.

970 హనుమాండ్ల వద్ద పట్టా నాగులపల్లి రామన్న వ॥ లింగన్న.

హోలు గొల్లాళప్ప

శై :- మాఫీ ఇనాం ౩౩౮ ఎకర్ ౧౦౬ ఉళ్ళ ధారా (రకం) ౩౩౮ ఎకర్ ౫౪.



## వినతి పత్రము

శ్రీమాన్ ఆంధ్రప్రదేశ్ దేవాదాయ
ధర్మాదాయశాఖా కమీష్నరు
హైదరాబాదుగారి దివ్యసన్నిధిలోకి
సవినయ విజ్ఞప్తి.

విషయము:-సదాశివపేట పెద్ద మఠము యాజమాన్యము
(వారసత్వం)ను గురించి,

ఆర్యా :

మెదకు జిల్లా తాలూకా సదాశివపేట నగరమునగల పెద్ద మఠమునకు అధిపతియైన శ్రీ మాచయ్యగారి శిష్యుడు శ్రీ గొల్లా ళప్పగారు వీరు జోగిపేట మరియు సదాశివపేట యీ రెండు పెద్దమఠాలకు ఒక్కరే పీఠాధిపతులుగా యుండిరి. (ఫసలి 1333స) వీరు సదాశివపేటలో మొదట పెంకుటిల్లుగానున్న పెద్దమఠమును గచ్చుమఠముగా గట్టించి తన్మఠాభివృద్ధికై మిక్కిలి కృషిచేసిరి.

వీరు బ్రతికియున్నప్పుడే తన కనిష్ఠసోదరుడైన శ్రీ వీరయ్యగారి జ్యేష్ఠపుత్రుడైన చి॥ రాచయ్య (రాచవీరదేవర)ను కారణాది దీక్షాసంస్కారముగా చేసి చిదనకు ఉత్తరాధికారిగా స్వీకరించిరి. (రక్తాక్షినామ సం.మున) శ్రీ గొల్లాళప్పగారు

కలరావ్యాధి గ్రస్తులై హాటాత్తుగా మరణించిరి. అప్పటికి చి॥ రాచయ్య మైనరు కావున మఠములో నున్న నిరంజనస్వామి సమాధిపూజ యొనర్చుటకు మరియు మఠము శుభ్రత నిమిత్తమై శ్రీ విరూపాక్షస్వామిని మెదక్‌జిల్లా సంగారెడ్డి తహసిల్దారుగారు ముతస్సద్దిగా తాత్కాలికముగా నియమించి యుండిరి. శ్రీ రాచయ్య (రాచవీరదేవర) సంస్కృతాధ్యయనముజేయచు మఠమును సంధర్శించుచునే యుండిరి.

ఇట్టినిగరాన్ కారు (తాత్కాలికముగా నియక్తుడై న విరూపాక్షస్వామి తన అంత్యసమయములో అసలు ఉత్తరాధి కారికి దెలియకుండ మరో వ్యక్తికి నీలకంఠస్వామికి పెద్ద మఠముయొక్క ఆస్తికి అధికారిగా వ్రాయించి యిచ్చి మరణించి యున్నాడు. ఇక్కడ ప్రభుత్వాధికారులు ఒకటి ఆలోచింపవలసి యున్నధి. యేమనగా విరూపాక్షస్వామి అసలుదారుగానప్పుడు వీలునామ వ్రాయించి యిచ్చిన నీలకంఠస్వామి యెట్లు అధికారి కాగలడనునది.

ఇప్పుడీ నీలకంఠస్వామి ఆ పెద్ద మఠమునకు సంబంధించిన హైదరాబాదులోని ఇం. నెం. 4-8-163+164 రెండంతస్తుల బిల్డింగును రూ. 24-000 విక్రయించియున్నాడు. మరియు చిన్నూరులోని కొన్ని భూములను గూడ విక్రయించియున్నాడని నా వద్ద ఆ గ్రామమువారు వ్రాసిన లేఖ యున్నది. ఇట్లే ఇంకను కొన్నింటిని అమ్ముటకు ప్రయత్నించుచున్నాడు.

అట్టి స్థిరచరాస్థి మా వంశమునకు సంబంధించియున్నది, కావున యిట్టి బాధ్యతారహితమైన వ్యక్తిని వెంటనే దొలగించి మా అనువంశపు ఆస్తిని మా సంతానమునకు సంక్రమింపచేయ గలరని నేను మనవి చేయుచున్నాను.

ఈ వాస్తవ విషయములకు సంబంధించిన పత్రములు గూడ నా వద్ద నున్నవి. కనుక పెద్దలైన మీరు వాటిని సమగ్రముగా బరిశీలించి నాకు న్యాయమును జేకూర్చగలరని నా విశ్వసనీయమైన ప్రార్థన

సంతకం.
**పెద్ద మఠము రాచవీరదేవర.**
ఇ.నెం.76/యన్.ఆర్.టి.యాకుత్పురకాలనీ.
హైదరాబాదు, (శివనిలయము)

卐卐

"వందేమాతరమ్" తే॥ 9-1-49

గోలకోండ పత్రికా సంపాదకులుగార్కి!

మహాశయ! వృత్తి వస్తు విషయమై..........
పత్రికలో చర్చించిన విషయము చాలా మంచిది, ఎందుకనగా

విషయములు నేను కొన్ని గ్రామాలను పర్యటించినప్పుడు ఈ లోకల్ ఫండు విషయంలో సర్కారు ఇంతవరకు ఎంత మట్టుకు ప్రజలకు మేలొనర్చినట్లు తెల్సినది. దాదాపు నేను తిరుగిన పల్లెలు 1 "చెవేళ్ల 2 మేడుకుంచ 3 దుద్దాల 4 గొర్రెకల్ 5 ప్యారారం 6 బాజెనపల్లి 7 రాంపురం 8 జెగిరాల 9 కొండాపురం 10 సీలకంతిపల్లె 11 కాయిదంపల్లి 12 వెంకట్రావుపేట 13 రెడ్డిపల్లి 14 అప్పాజిపల్లి 15 ఆరె ఇటికాల 16 వట్టిపల్లి ఇవె మొదలైన సు॥ 20-24 పల్లెలను సంచరించగా అక్కడి ప్రజలు తమకున్న కష్టములను చెప్పుకునిరి, గ్రామాల్లో ప్రజలకు సరియైన నీటి సప్లయికై బావులు, ఆరోగ్యానికై వైద్య సహాయ్యము, జ్ఞానాభివృద్ధికై బడులు, వుండడానికి వసతులు, భూవసతియున్నను కొన్నిచోట్ల చెరువులు' కుంటలు, అలుగులు, కాలువలు, మంచిగ లేక ప్రజలు చాలా నష్టపడుతూ ఉన్నారు. కొన్ని గ్రామాల్లో అనవసరంగా విద్యార్థులు లేనిచోట ఒక్కొక్క బడిలో-౪-౫ -గురు ఉపాధ్యాయులున్నారు. లేనిచోట లేనేలేరు. వీరు వృధా సర్కారు జీతమును అనుభవించుచు కాలము గడపుచున్నది చూచిన చాలా విషాదకరమైన సంగతి. కావున ఇట్టి సంకష్టములను ప్రథమంలో దూరగించు ప్రభుత్వముయొక్క ఆద్యకర్తవ్యము. ఈ విషయంలో జిల్లా కాంగ్రెస్సు నాయకులు అవశ్యముగా జోక్యము కల్గించుకునగలరని నా ప్రార్థనా.

ఇట్లు
అల్లాదుర్గం - పట్టికమిటి అధ్యక్షులు
పం.రాచవర దేవర, పెద్దమఠం
జోగిపేట, జి॥ మెదక్ (ఆం.ప్ర)



అల్లాదుర్గము  తేది. ౨౪-౧౧-౪౯

తేది 24-11-49 రోజు సాయంత్రం ఘం॥8॥కు ఆంధ్ర గ్రంధాలయములో యువజన విద్యార్థులు సమావేశమై ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనకై మరియు కేంద్ర స్థాపనకై అధ్యక్షులు శ్రీ మోటూరి లక్ష్మయ్యగార్ని, కార్యదర్శిగా, శ్రీ మజ్జిగెలింగయ్యగార్ని, కేంద్ర వ్యవస్థాపకులుగాను, శ్రీ పం॥రాచవీర దేవరు, హిరేమఠ ఉపాధ్యాయులుగాను ఎన్నుకోబడినారు.

మరిన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తు పరీక్షలు జరుగడానికై కేంద్రమును స్థాపించనైనది. కాబట్టి పరీక్షల నివ్వదలంచిన విద్యార్థులు సమీప గ్రామస్థులు ఈ కేంద్రమునందు పాల్గొని తమతమ లాభములను పొంది కేంద్రమును విజయవంతముగా జేయగలరనికోరిక.

ఇట్లు
అల్లాదుర్గము కాంగ్రెస్ కమిటీ

## వీడ్కోలు ఎన్నికలు

జోగిపేట, అక్టోబరు 25

23-10-53 శుక్రవారము రాత్రి 8 గంటలకు స్థానిక పెద్దా మఠమున వీరశైవు లెల్లరు, ప్రభుత్వాధికారులు, పుర ప్రముఖులు సమావేశమై శ్రీపత్‌రావు వకీలుగారి అధ్యక్షతలో అందోలు తాలూకా మెడికల్ ఆఫీసరు శ్రీ డా॥ అమృత నారాయణగారికి అల్పాహారవిందుతో వీరశైవసమాజం పక్ష మున వీడ్కోలు జరుపనైనది. శ్రీ పం॥రాచవీరదేవరగారు, శ్రీ శెట్టిశివరావు వకీలుగారు, శ్రీ గంగాధరరావు స్థానిక హాయి స్కూలు హెడ్మాస్టరుగార్లు ఉపన్యసించిరి.

తరువాత 10 గంటలకు వీరశైవ సమాజముయొక్క ఆదాయ వ్యయముల పట్టికను పరిశీలించి పునః ఈ దిగువ పేర్కొనబడిన నూతన కార్యకర్తలు ఏకగ్రీవముగా ఎన్ను కొనబడినారు.

అధ్యక్షులు శ్రీ జామ్మిబొంతప్ప, ఉప, అధ్యక్షులు శ్రీ నెలిగెరామప్ప కార్యదర్శి శ్రీ నడిగే ఆగప్ప, సహాయ కార్యదర్శి శ్రీ దేశముఖ్ సోమప్ప, కోశాధ్యక్షులు శ్రీ అంబిళిగె ఈశ్వరప్ప.



జోగిపేట పెద్దమఠము మహాద్వారమునెదుట దసరా పర్వదినమున నంది ధ్వజారోహణము గావించిన
పం॥ రాచవీరదేవరగారు స్థానిక వీరశైవ సమాజముయొక్క అధ్యక్షులు శ్రీ బి.ఎం. విశ్వనాధముగారు డాకూరు

సభ్యులు :-

తడ్గూరి రుద్రప్పవకీలు, శెట్టి శివరావు వకీలు, అంబిళిగె వీరబసప్ప, ఇంజాల అడివప్ప, మడుపతి శిద్రామయ్య, అడాల శంకరప్ప.

## ఓం పతాక ఊరేగింపు

జోగిపేట, అక్టోబరు 19

స్థానిక వీరశైవ సమాజము పక్షమున సంప్రదాయాను సారముగా వీరశైవ "ఓం" పతాక ఊరేగింపు జరిగినది.

శనివారమునాడు ఈశ్వరాలయములో రుద్రాభిషేకము నెరవేరినది. శ్రీ మాన్ అంబలిగె ఈశ్వరప్ప (కోశాధ్యక్షులు)చే పెద్దమఠం ఎదుట పతాకము ఎగురవేయబడినది. శ్రీమాన్ సడిగె ఆగప్ప (ఉపాధ్యక్షులు) ఉపన్యసించిరి.

తరువాత పండిత రాచవీరదేవరగారు వీరశైవపతాకమును చేతగొని ఆశ్వముపై ఊరేగిరి, శమీవృక్షపూజ, ఈశ్వర సందర్శనము, శాంతిపాఠముల అనంతరము, శ్రీ రాచవీర దేవరగారి వీరశైవ సమాజము భావి కార్యక్రమోపన్యాసముతో కార్యక్రమము ముగిసినది.

ప్రకటన:- గోలకొండ పత్రిక ది. 22-10-1953

# జోగిపేటలో సారస్వత సభలు

22-1-52 తేదీన జోగిపేట పెద్దమఠంలో సదాశివ శర్మ టేకుమాలుగారి ఆధ్యక్షతలో ఆంధ్ర సారస్వత సమావేశము అత్యంత వైభవముగా, ఉత్సాహభరితులయిన నవయువకులతోబాటు ఆంధ్రసారస్వతపరిషత్తు వారి మాతృభాషకై సల్పిన అపార కృషి ఫలితమును ప్రస్తుత ప్రభుత్వము యెంత మట్టుకు గ్రహించినదనియు, జిల్లా (D.E.O.) మొహతమీంగారి తాత్సారమున్యాయదూరమయిన ప్రవర్తనను తీక్ష్ణంగా విమర్శించి ఆంధ్రసారస్వత పరిషత్తు అభివృద్ధి ప్రణాళికను నిర్ణయించి చివరకు ఏకగ్రీవముగా అంగీకరించిన దాని ప్రతులను జిల్లా సదరు (D.E.O.) మొహతమీంగారికి, విద్యామాత్యుల వారికి, పరిషత్తు వారికి పంపనయినవి.

రాత్రి 8-30 ఘ॥ నుండి 12 ఘం॥ వరకు సభా కార్యక్రమములు జరిగెను. సభలోని తీర్మానములు.

1. ప్రజాస్వామ్య ప్రభుత్వకాలమున ప్రతి గ్రామమున-విద్యాభివృద్ధి జరుగవలయును. ప్రాంతీయ భాషకు అనగా మాతృభాషకు ప్రాముఖ్యత గల ఈ రోజుల్లో ప్రాథమిక పాఠశాలలకు తగినంత ఉపాధ్యాయుల సంఖ్య హెచ్చు కావలసి యుండును. కావున ప్రభుత్వమువారు విద్యాభివృద్ధికిగాను బాల

బాలికల పాఠశాలలకు ఆంధ్ర సారస్వత మాధ్యమిక, ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులయిన అభ్యర్థులను పంతుళ్ళ పదవులపై తప్పక తీసుకుందురని ప్రభుత్వమువారిని కోరుచున్నాము.

**2.** వయోజన వోటింగుపై రాజ్యనిర్మాణముగల ఈ ప్రజాస్వామ్యములో వయోజన విద్యాభివృద్ధి అవసరము. గావున వయోజన విద్యకై పాటుపడుచున్న ఆంధ్రసారస్వత పరిషత్తునకు ఆర్థిక సహాయమును ప్రభుత్వమువారు గావించవలయును. వయోజన విద్యకై పాటుపడుచున్న ఆంధ్రసారస్వత పరిషత్తు కార్యకర్తలను, అభ్యర్థులను, తగుసానుభూతి సహకారములను జిల్లా విద్యాశాఖాధికారులు చూచునట్లు విద్యాశాఖమంత్రి మండలి నుండి తగు అజ్ఞాపత్రములు ప్రతిజిల్లాకు పంపునట్లు ఆర్థికసహాయము వయోజన విద్యకు గావించ వలయునని, ఈ సభవారు తీర్మానిస్తు ప్రభుత్వమువారిని గోరుచున్నారు.

**3.** మెదకు జిల్లా విద్యాధికారియగు శ్రీ జగన్నాధము (D.E.O.) మొహతమిముగారు జిల్లావిద్యావిషయమున తగినంత శ్రద్ధ చూపెట్టక పాఠశాలల అభివృద్ధి విషయమున, ప్రాంతీయ విద్యావిషయమున, ఉపాధ్యాయుల నియామకముల విషయమున, అన్యాయము గావించినందుకు వీరి మార్పు వెంటనే జరుగ వలయునని ప్రభుత్వము వారిని కోరుచు యీ సభవారు తీర్మానించుచున్నారు.

**4.** ఆంధ్ర సారస్వత విశారద పాఠ్యప్రణాళికలోని పాఠ్య గ్రంథములు సౌలభ్యమయినవి కానందున, సులభముగా దొరుకు గ్రంథములను పాఠ్యగ్రంథములుగా నేర్పాటు గావింతురని విశారద పరీక్ష అభ్యర్థులకు గల ప్రయాసను తొలగింతురని కోరుచున్నారు.

**5.** మెదకు జిల్లాలో సారస్వత పరిషత్తుశాఖ కేంద్రములువిరివిగా నెలకొల్పుటకు గాను, తగుకృషి జరుపగలందుకు సారస్వత పరిషత్తు కేంద్రమువారు శ్రద్ధ గైకొందురని యీ సభవారు తీర్మానిస్తున్నారు.

## గ్రామ పరిశుభ్రతపట్ల
## ప్రభుత్వపు అశ్రద్ధ

జోగిపేట, **25-10-51**

పండితరాచవీరదేవరు గారిట్లు తెలుపుచున్నారు.

జోగిపేట గ్రామంలో నలువైపుల చౌబారు సడకుల మీద తప్ప తదితర వీధుల్లో కసు ఊడిపించడము లేదు. అక్కడక్కడ ఇండ్లప్రక్కనో, ఇండ్లఎదుటనో లేక ఇండ్లలోనో, గొప్పగొప్ప పెంట బొందలు, శవుచాది క్రియలకు పాయఖానలు లేక జనులు అక్కడక్కడ పాతగోడల్లో మలమూత్ర విసర్జనములు చేయడమునుండి మురికిలేచి పోవడము, వర్షా

కాలములో నీళ్ళు ఎక్కడివక్కడనే ఆగిపోవడముతో అసాధ్యమైన మురికి వాననలు (దుర్గంధము) వ్యాపించును. వరదనీరు ఎక్కడను నిలబడనట్లుగా జర్రున జారిపోయేలాగున వీదుల్లో రెండు ప్రక్కలకు కాల్వాలు తీయడములేదు. ఆ కారణమున ఒకరిజారాటినీరు. మరి వరదనీరు మరియొకరు తమవాకిట్లో నుండి పోనివ్వ కుండుటచే తమలో తమకు (ప్రజలల్లో) తగవు లేర్పడి గ్రుద్దులాడుకొనుట గూడ అనేకములు జరుగుట గలదు. ప్రభుత్వ పక్షమున కాల్వాలు తీయించిన ఏ తగువులు ఏర్పడకుండెను.

అక్కడక్కడ నిలుచుచున్ననీటిలో క్రిములుద్భవించుట చేమురిగి దుర్గంధము లేర్పడి రాత్రి దోమలబాధలచే నిద్ర మొదలైనవి మానవులకు లేక మలేరియా మొదలైన అజీర్ణాది దోషములచే, రోగము లుద్భవించుచున్నవి. వర్షా కాలములో బహిరంగణమున గుమిగూడిన మురికి నీరు ఒక్కొకపుడు పునః జారాటి కాల్వాల గుంట గృహాల్లోకి ప్రవేశించి ఆగిపోవుట గలదు.

ఏ ప్రభుత్వాధికారులు ఈ గ్రామమునకు విచ్చేసినచో (తనఖీకైవచ్చినను) వారు తమ కారులో హాయిగా కూర్చొని గ్రామ మధ్యనున్న గ్లాక్టవర్ చుట్టు నలువైపుల తిరిగి చూచి పోవడమే కాని మధ్యవీధుల్లో వెళ్ళి ఈదుస్థితిని గాంచి, ఈ నరక యాతననుండి ప్రజలను విముక్తి చేసే మహానుభావులెవ్వరు రాలేదు.

ఘర్‌పట్టీ, రోషన్ పట్టీలను తప్పకుండ వసూబు చేయ డమేకాని అక్కడక్కడ దీపముల వ్యవస్థకూడ సరియైన మార్గ ములలో లేవు. ఏమూడునాల్గు లైట్లున్నను క్లాక్‌టవర్‌నుండి బస్‌స్టెజివరకే ఉన్నివి. కాని ముఖ్యమైన వీదుల్లో లేవు. కావున దయచేపి పైయధికారులు ఈ విషయమై తగుచర్య గైకొని ఈ గ్రామవీదుల్లోని మురికి కాల్వలను, పెంటలను, దూరగించి ప్రతిరోజు పరిశుద్ధి జేయించి దీపములను అక్కడక్కడ వెలి గించే వ్యవస్థలను సక్రమముగా జేయించి ఈ లోటును సరిదిద్ద గలరు.

**27-11-51** గోలకొండ పత్రికా

## కర్ణాటక సాహిత్య సమ్మేళనం

హైదరాబాద్, మే 1953

"శ్రీరాముడు భారతదేశానికంతటికీ జాతీయవీరుడు. బసవేశ్వరుడు కర్ణాటకానికి జాతీయవీరుడు" అని స్థానిక స్వపరిపాలనామంత్రి శ్రీ జి. అన్నారావు గణముఖి కర్ణాటక సాహిత్య మందిరం అధ్వర్యంలో జరిగిన బసవ జయంతి ఉత్సవాలకు అధ్యక్షత వహిస్తూ పేర్కొన్నారు.

బసవేశ్వరుడు 12వ శతాబ్దంలో ఘనతకెక్కినవాడు. మతంపేరుతో సంఘానికి హాని కలిగించే ఆచారాలనునిర్మూలిం చడంలో అవిరళ కృషి చేశాడు. యితడు మంచి సంఘసంమర్త.

21-5-1953 గోలకొండ పత్రిక

## సారస్వత ప్రచారక సభలు

సంగారెడ్డి, 20-7-50

15వ తేది అల్లాదుర్గంలో రాత్రి 8 గంటలకు సారస్వత పరిషత్తు పక్షాన సమావేశం ఏర్పాటు చేయబడినది. స్థానికం లోని పరిషత్తు పరీక్షార్థులు; పురప్రముఖులు ఉత్సాహంతో సమావేశంలో పాల్గొన్నారు. కార్యదర్శి పండిత రాచవీరదేవర గారు సభికులకు ప్రధానోపన్యాసకులు శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారిని గురించి పరిచయంచేసి పరిషత్తు ఆశయము లను విపులీకరించినారు.

శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారు ప్రసంగిస్తూ మన ప్రాచీన సంస్కృతి సభ్యత అనంతములు చిరంజీవములని పెక్కు గాథలు, ఉదాహరణములిస్తుఉన్నవి. వారి వారసులమైన మనం ఆ సంపదను, కష్టార్జితమైన ఆస్తి నిరుపయోగంకాకుండా వృద్ధ రించాలిసిన భారము మనపై వున్నదంటూ, ఆంధ్ర సారస్వత పరిషత్తు యీ లక్ష్యసిద్ధికై నిరక్షరాస్యతా నిర్మూలనంతో కృషి ఆరంభించినదని, ప్రతి ఆంధ్రుడునూ తమ మాతృదేవతారాధ నకై కంకణంకట్టిన ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యక్రమం నిర్విఘ్నంగా. జయప్రదంగా, కొనసాగుటకు పరిపూర్ణ సహ కారం గావించాలని అభ్యర్థించారు.

కార్యదర్శిగారి అభివందనాలతో రాత్రి 10 గంటలకు సమావేశం జయప్రదంగా సమాప్తమైనది.

17-7-50 తేది రాత్రి డాకూరులో పండిత రాచవీర దేవరగారి అధ్యక్షతలో సారస్వత సమావేశం జరిగినది. స్థానిక శాఖ ఉపాధ్యక్షులు మఠం సద్దివీరయ్యగారు సభికులకు అభ్యర్థులకు శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారిని పరిచయంచేశారు. దైవ ప్రార్థనతో సమావేశం అరంభమైనది.

స్థానిక పరిషత్తు పరీక్షాభ్యర్థులు శ్రీ మొగులయ్య, శ్రీ పాపిరెడ్డి, శ్రీ నాగయ్య, సన్నిధానం విశ్వనాథశర్మ జోగిపేట, శ్రీ మఠంసిద్ది వీరయ్యగారలు ఆంధ్ర సాహిత్య అభివృద్ధికై పాటుబడుచున్న ఆంధ్ర సారస్వత పరిషత్తు కృషిని అభినందిస్తూ యువకులు, భాషాభిమానులందరూ సంపూర్ణ సహాయంచేసి పరిషత్తును వృద్ధిపరచాలన్నారు.

శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారు పరిషత్తు కృషి, పరిషత్తు ఆశయములు మొదలైన కార్యక్రమముల గురించి విపులంగా ప్రసంగిస్తు భారదేశంలోని యే ప్రాంతియుడు కూడ మాతృభాషను మరువలేదన్నాను. ఆంధ్రులు యిందులోనినిగూఢ సత్యాన్నిస్థూలంగా గ్రహించాలనీ, అభ్యర్థించి, పరిషత్తు పరీక్షాభ్యర్థులు కేవలం మార్కులకై చదివితే, పరిషత్తులక్ష్యం సిద్ధిం



వి. పి. హాస్టలులో ఎన్నికలు జరిగిన తరువాత సభ్యులందరు సామూహికముగా తీయించుకున్న చిత్రము



[illegible] సన్న్యాస పత్రమును సమర్పించుట

చదనీ, పరిషత్తు ప్రచారానికి కావలసిన సాహిత్య సామగ్రిని అభ్యర్థులందరూ ఆర్జించాలనీ అభ్యర్థించారు.

శ్రీ రాచవీరదేవరగారి అధ్యక్షోపన్యాసంలో భాషారాధన ప్రాశస్త్యంను వివరించబడింది. శ్రీ మఠం శిద్ధివీరయ్యగారి అభివందనాలతో సమావేశం జయప్రదంగా ముగిసినది.

17-7-50 తేది వుదయం 10 గంటలకు జోగిపేటలోని గ్రంధాలయంలో సారస్వత సమావేశం జరిగినది. శ్రీ మఠం శిద్దివీరయ్య (డాకూరు)గారు అధ్యక్షత వహించారు. ప్రార్థనతో సమావేశం ఆరంభమైనది.

శ్రీ రాచవీరదేవర, శ్రీ సెట్టి శివరావు. శ్రీ బసవ మాణయ్య, శ్రీ శ్రీ పతిరావు, శ్రీ బలభీమరావు, శ్రీ సంగ మేశ్వరరావుగారలు పరిషత్తు పరీక్షలను ప్రభుత్వమింకా అంగీ కరించనందుకు విచారం వెలిబుచ్చారు. 5) అభ్యర్థులున్ననే కేంద్రం వుంటుదన్న నిర్ణయం అతి కఠినమనీ, పరిషత్తువారు యీ నిర్ణయాన్ని పునరాలోచించవలెనని అభ్యర్థించారు, తమ ఉపన్యాసాల్లో.

శ్రీ గొట్టిముక్కుల కృష్ణమూర్తిగార్లు తమప్రసంగంలో ఆక్షేపణలకుజవాబిస్తు ప్రభుత్వం అంగీకారంపైననే ఆధారపడడం స్వతంత్రపౌరుని లక్ష్యంకాదని, పరిషత్తు పరీక్షల ఉత్కృష్ఠత,

ప్రజలకున్న, అభిమానం ప్రభుత్వానికి తెలియపరచడం ప్రజల బాధ్యత అన్నారు. ఏ పరీక్షా సంస్థలునూ, అభ్యర్థులు లేనిచోట కేంద్రాలు పెట్టడంలేదని, ఆంధ్ర సారస్వత పరిషత్తునకు కూడ అంత ఆర్థిక స్థోమతను కల్గించడం మన ధనవంతుల బాధ్యత అని చెప్పినారు.

అధ్యక్షులు భాషా ప్రాముఖ్యాన్ని గంభీర శైలిలో విశదీకరించారు. కార్యదర్శి అభినందనాలతో 12-30 గంటలకు సమావేశం జయప్రదంగా ముగిసినది.

21-7-1950 గోలకొండ పత్రిక



**సంతాప సభ**

జోగిపేట, డిశంబరు 17 :

తేదీ 13-12-52 రోజు సాయంకాలము జోగిపేట పెద్ద మఠములో వీర శైవులెల్లరు సమావేశమై 11వ తేదీన లింగైక్యులయిన నిజాం ప్రాంతీయ వీరశైవ పరిషత్తు (కార్యదర్శి) యొక్క మోతమద్ మరియు విద్యావర్ధక సంఘముయొక్క (కార్యదర్శి) మోతెమద్‌గానుండి అనన్య సేవను సలిపిన శ్రీ బసప్ప మండిగె బి.ఎ.ఎల్ ఎల్.బి. వకీలుగారి మరణం

పట్ల సంతాపమును వెలిబుచ్చి వారి ఆత్మకు, వారి కుటుంబము నకు చిరశాంతియును ఈశ్వరుడు ఆశీర్వదించాలని ప్రార్థించిరి.

శ్రీ బసప్ప మండిగె వకీలుగారి జన్మభూమి మహారాష్ట్రము. ఒక బీద కుటుంబమునందు జన్మించి, విద్యావర్ధక ఫండునుండి ఉన్నతవిద్యనుబడసి. సమాజ సేవజేయుచు, బీదల కేసులను ఉచితముగానే జేయుచు, తమ యశోచంద్రికను మహారాష్ట్ర, కర్ణాటక, తెలంగాణములందు వ్యాపింపజేసిరి. ప్రాంతీయ భేద భావములీతనియందు లేవనుటకు మూడు ప్రాంతాలలో వారొనర్చిన సేవయే ఆదర్శము. నేడు వీరి అస్తమయము అఖిల వీరశైవ సమాజమునకే తీరనిలోటు అని యుపన్యసించిరి.

ఆర్గనైజర్, పం. రాచవీరదేవర మెదక్ జిల్లా ధర్మప్రచారకులు.

17-12-52 గోలకొండ పత్రికా

卐卐

17-3-52

జోగిపేట ఆంధ్ర సారస్వత పరిషత్తు

జోగిపేట, మార్చి 14

ఈ నెల 28వ తేదీన అల్లాదుర్గం ఆంధ్ర గ్రంథాలయ యములో రాత్రి 9 గంటలకు ఆంధ్ర భాషాభిమానులెల్లరు సమా

వేశమై శ్రీరాచవీరదేవర జోగిపేట పెద్ద మఠంగారి నేతృత్వ మున యీ దిగువ కార్యక్రమములు జరిపిరి.

సమష్ఠి వ్యవసాయ సంఘ స్థాపనము జేయబడినది. అందు శ్రీ ఎం.బాలయ్య జిరాయితివారు వ్యవసాయమును సాగు బడిచేయు పద్ధతిని దాని లాభనష్టములను చక్కగా తెలిపిరి.

తరువాత ఇక్కడున్నట్టి ఆంధ్ర సారస్వత పరిషత్తు పరీక్షా కేంద్రమును పునఃసరియైన మార్గమున నిర్వహించుటకు ఈ దిగువ కార్యకర్తలు ఏకగ్రీవముగా ఎన్నుకోబడిరి.

అధ్యక్షులు శ్రీ పల్లె దుర్గయ్యగారు, ఉపాధ్యక్షులు శ్రీ మజ్జిగే లింగయ్యగారు, కార్యదర్శి డి. వీరయ్యగారు, సహాకార కార్యదర్శి, కె. శివరాములుగారు, కోశాధ్యక్షులు పల్లె లక్ష్మయ్య గారు.

సభ్యులు :- శ్రీ జి. నాగయ్య, శ్రీ బి. ఆడివప్ప. శ్రీ డి. బస్వరాజు, శ్రీ అనంతయ్య, శ్రీ మంకెన సంగయ్య.

ఈ సమావేశమువారు ఆంధ్ర సారస్వత పరిషత్తు పరీక్షలలో తీసుకోవడానికై గడచిన నిర్ణీతమయిన 1951 సం॥ కాక ప్రతిసంవత్సరం బళ్ళలో షరీకు అయ్యే మెట్రికు, మిడిలు విద్యార్థులతో పాటు, పరిషత్తు పరీక్షల నొసగిన వారిని ప్రభుత్వ

కోర్సు విద్యార్థుల 100-3-25 వంతుననైన విద్యాధికారులు ఉద్యోగముల నొసగునట్లు సమయమును పొడిగింప జేయుటకు ప్రయత్నించవలెనని పరిషత్తు వారిని కోరనైనది.

సుమారు (20) యిరువైమంది విద్యార్థులున్నచోట పరిషత్ కేంద్రమును ఇవ్వగలరని కోరుచున్నారు.



## హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తు

హైదరాబాద్, ఆగస్టు 14 :

మెదకు జిల్లాలోని అల్లాదుర్గము గ్రామములో ఈ నెల 8వ తేదీన స్థానిక సారస్వత పరిషత్తు విద్యార్థులు ఆంధ్ర గ్రంథాలయ భవనములో సమావేశమై వయోజన పాఠశాలకు ప్రారంభోత్సవము చేశారు. పాఠశాల నిర్వహణకై యీ క్రింది నలుగురు సభ్యులతో కూడిన ఒక ఉపసమితిని నియమించారు. పండిత రాచవీరదేవరు, మంకెన సంగయ్య, అగ్గె సదానందము, కొంత శివరాములుగారలు.

## వీరశైవ సమాజశాఖల స్థాపనము

జోగిపేట, 27-8-51

హయిదరాబాదు ప్రాంతీయ వీరశైవ పరిషత్తు ప్రచారకులగు పం॥ శ్రీ రాచవీరదేవరు, పెద్దమఠం జోగిపేటగారు. ఆందోలు తాలూకాంతర్గతమైన 1. అల్లాదుర్గము 2. రేగోడు 3. మరవెల్లి 4. పోతులగోడ 5. చేవెళ్ళ 6. ఆరెఅటికాల 7. నేరడగుంట 8. వెంకట్రావుపేట 9. బహిరన్‌దిబ్బ 10. దుద్దాల ఇత్యాది గ్రామాల్లో ధర్మ ప్రచారము జేయుచు శాఖలను స్థాపించారు.

అసలు వీరి వుద్దేశమేమిటి యనిన సాంఘికముగా, రాజకీయముగా, విజ్ఞానికముగా, సంకుచిత భావములచే వెనుకబడియున్న జనులను జ్ఞానవంతులుగా జేసి వీరిలో కల్గిన చీలికలను నిర్మూలింపజేసి, రాజకీయమునకు సహకరింపజేయుట.

ఇందుకు తాలూక ఆందోలు జోగిపేటలో సెప్టెంబరు 22 తేదీ జనరల్ బాడి మీటింగు యేర్పరచినారు.

29-8-1951 గోలకొండ పత్రికా



## ఆందోల్ తాలూకా న్యాయాధికారిగార్కి వీడ్కోలు

జోగిపేట, జూన్ 22:

స్వస్తి శ్రీ సందన జ్యేష్ఠ బ॥ 13 శుక్రవారము వీర శైవసమాజ, పక్షమున శ్రీ మీర్ హుసేవలీఖాన్ బి.ఎ.ఎల్. ఎల్.బి. మున్సిఫ్ తాలూకా అందోల్‌గారు సుల్తానాబాద్ (కరీంనగర్‌జిల్లా)కు తబాదిలాఅయినందున పెద్దమఠమునందు 6 గంటలు సాయంకాలముపహారవిందు జరిగినది. సమావేశము నకు శ్రీ ఖుష్‌హాల్‌రాయ్ బి.ఏ. తహసీల్దారు అందోలు అధ్య క్షత వహించిరి. స్థానిక ఉద్యోగులు, అధికారులు పాల్గొనిరి. మున్సిఫ్ సా॥ గారిని పుష్పమాలాలంకృతులుగా నొనరించిన పిదప శ్రీ మఠం సిద్దివీరయ్యగారు ఉపాధ్యాయులు మున్సిఫ్ సా॥గారి గుణగణములను వర్ణించి చెప్పిరి. వారిశాంత సౌజన్య ధర్మనిర్వహణమును గురించి పద్యరూపమున శ్లాఘించిరి. సభ గం. 9-30 నిముషములకు ముగింపబడినది.

9-6-1956 ఆంధ్ర జనత



# వీరశైవ సమాజ కేంద్రం స్థాపన

చౌదరపల్లి, జూన్ 8 :

ఇటీవల కల్వకుకుర్తి తాలూకా ఎందల చౌదరపల్లిలో శ్రీ గూడ బస్వలింగప్పగారిచే నిర్మింపబడిన శివాలయములో శ్రీ బసవేశ్వర లింగప్రతిష్ఠాపన ఇత్యాధి కార్యక్రమం వీర శైవ బ్రాహ్మణోత్తములచే శాస్త్రోక్తముగ జరుపబడెను. సాయంత్రము మహేశ్వరుని ధర్మలగ్నముకూడ జరిగెను. అదే సందర్భమున హైదరాబాదునగర అఖిలాంధ్ర వీరశైవ సమాజము పక్షమున అరుదెంచిన శ్రీమాన్ ఎస్. బసనరాజు, బి. ఎ. కార్యదర్శిగారు, శ్రీ పండిత్ రాచవీరదేవరుగారు, శ్రీ జగదీశ్వరరావుగారు, శ్రీ దెమ్మవీర బద్రప్పగారు, వీరశైవ ధర్మములను గురించి ఉపన్యసించిరి.

జూన్ 1వ తేదీన ఉదయము 10 గంటలకు శ్రీగూడ బస్వలింగప్పగారి గృహమున స్థానిక మరియు పరిసర గ్రామాదుల వీరశైవులు ఎల్లరు శ్రీ పూజ్యునిడుమామిడి మఠం కరిబసవ స్వాములవారి అధ్యక్షతన సమావేశమైన పిదవ పండిత రాచ వీరదేవరు· శ్రీ జగదీశ్వరరావుగారు, శ్రీ ఎస్. బసవరాజుగారు అఖిలాంధ్ర వీరశైవ సమాజమువారు వీరశైవ మతోద్ధరణ విషయమై అతి విపులముగ ముందు సమాజము చేయవలసిన కార్యక్రమములను గురించి ఉపన్యసించిరి.



యౌవ్వన దశలో
వే॥ పం॥ రాచవీరదేవరగారు



విజయదశమి పర్వదిన సందర్భములో పెద్దమఠము నుండి ఊరేగింపుగా బయలుదేరిన అశ్వారూఢులైన అంబళగే వీరబసప్పగారు

పిదప సమాజనిర్వాహణమునకై ఈదిగువ నుదహరించిన కార్యవర్గం కమిటీ ఏకగ్రీవముగ ఎన్నుకొనబడినది.

అధ్యక్షులు:-శ్రీ గూడ బస్వలింగప్పగారు, ఉపాధ్యక్షులు:-శ్రీ నాణెంకల సాదప్పగారు, సహాయ కార్యదర్శి:-శ్రీ గూడ మల్లప్పగారు, కోశాధిపతి :- శ్రీ మొండెగుత్తల భద్రప్పగారు.



**తా॥ వీరశైవ జనరల్‌బాడి మీటింగు జోగిపేట**

"నవీరశైవ సదృశం మత మస్తిజగత్రయె !"

శ్లో॥ సర్వంలింగమయమ్ జగత్-త్రైలోక్యం సచరాచరం ।
లింగ బాహ్యాత్పరన్నాస్తి-తస్మాల్లింగం ప్రపూజయత్॥

ఖరనామసం॥ము భాద్రపద బ॥౨ శనివారము తే,౨౨ సెప్టెంబరు 1951 తాలూకా అందోలు జోగిపేట పెద్దమఠంలో రాత్రి ౮ గంటలకు జనరల్‌బాడి మీటింగుజరుగును. ఈ సందర్భములో మనశాఖ మరియు కేంద్రకార్యకర్త లెల్లరు పాల్గొని రాజకీయము, సాంఘికము, విజ్ఞానములనుండియు వెనుకబడియున్న మన ధర్మాభివృద్ధికర కార్యక్రమములను గురించి విచారించబడును. మరియు తాలూకా కార్యకర్తల ఎన్నికలుగూడ

జరుగును. ఈ సమయమునకు హైదరాబాదు. ఉద్గీరు, సదాశివ పేటనుండి మన ప్రముఖనాయకులు వచ్చి మనకు ఉచిత సందేశములను బోధించి, భావి మన కార్యక్రమములలో తోడ్పడగలరు.

కావున ఇట్టి సదవకాశమున వీరశైవులు అభిమానముతో సకాలమునకు విచ్చేసి, మీటింగులో పాల్గొనగలరని కోరు చున్నాము.

| | |
|---|---|
| వ్యవస్థాపకులు:- | ఇట్లు రాగోరువారు |
| వీరశైవసమాజము | పం॥ రాచవీరదేవరు, పెద్దమఠం |
| జోగిపేట | హై. ప్రా. వీ. ప్రచారక్. |



## వయోజన పాఠశాల స్థాపన

హైదరాబాద్, ఆగస్టు 11 :

మెదకుజిల్లాలోని అల్లాదుర్గము గ్రామములో ఆగస్టు 3వ తేదీ సాయంత్రం 6 గంటలకు స్థానిక సారస్వత పరిషత్తు విద్యార్థులు ఆంధ్ర గ్రంథాలయ భవనములో సమావేశమై వయోజన పాఠశాల ప్రారంభోత్సవము చేశారు. పాఠశాల నిర్వహణమునకై నలుగురు సభ్యులతో ఒక ఉపసమితిని నియమించిరి.

1. పండిత రాచవీరదేవరుగారు. అల్లాదుర్గము.
2. మంకెన సంగయ్యగారు. ,,
3. అగ్గె సదానందముగారు, వెంకటరావుపేట.
4. కొంక శివరాములుగారు, అల్లాదుర్గం.

**12-8-1950** గోలకొండ పత్రిక

బాధ్యత విస్మరించిన రాజకీయనాయకులకు గుణపాఠం :

**విద్యార్థులను చూసి నేర్చుకోవటం మంచిది.**

పేర్మాల్ విద్యార్థుల నిర్మాణకృషి :

శ్రీయుత సత్యయ్య ప్రధానోపాధ్యాయుల వారి నాయకత్వమున ఇచటి విద్యార్థులు బడి బావి కొరతను దీర్చుటకు తేది 4-2-55 శుక్రవారంనుండి పం॥రాచవీరదేవర స॥ ఉపాధ్యాయుల సహకార ప్రోత్సాహములతో **15-2-55** మంగళవారం వరకు అత్యంత పట్టుదలతో-కృషి చేసి చివరికి ఫలితమును పూర్తిగావించినారు. ఈ కృషి విషయమై వీరినెంత వర్ణించి సను చాలదు, అదృష్టవశమున అందు మంచితీర్థమే పడినది. ప్రతిదినము బడి ముగియగానే **1** గంట ఈ కృషికి బూనుకొనుచుండిరి.

ఉపాధ్యాయులుగూడా ఒక ఆదివారము మాత్రము వారిని ప్రోత్సహించుటకు సోషల్‌వర్కుగా ఆ కృషి యందు పాల్గొన్నారు.

మొత్తము **12** రోజులలో ఈ నూతిని తోడినారు. కొద్ది రోజులలో ఈ ఘనకార్యము కొనసాగించారంటె వీరి కృషి ఎంతయో స్తవనీయమైనదే.

పనిముట్లు పరికరములు స్థానిక పంచాయితి కమేటివారు. ఒసగి సహకరించినారు. పట్టుదలతో చివరి వరకు పనిచేసిన వారిపేర్లు:- శ్రీ పి. రాచవీరదేవర, స॥ఉ, విద్యార్థులు : శ్రీ పి. గోపాల్‌రెడ్డి, శ్రీ యం. అంజరెడ్డి, వి,సంఘ సహాయ్యకార్యదర్శి, శ్రీ యన్. మల్లయ్య, శ్రీ మొగలయ్య, శ్రీ విఠల్‌రెడ్డి, శ్రీ కె. బాగారెడ్డి, శ్రీ ఎం.సంగయ్య, శ్రీ వర్ధాచారి, కె. అగమయ్య, వి. సం. అధ్యక్షులు, శ్రీ వి. లక్ష్మయ్య, టి వెంకయ్య, శ్రీ డి. శంకరయ్య, యస్. శంకరయ్య, శ్రీ డి. కిషన్, డి. రఘు రాములు.

మిగతా విద్యార్థులు కొందరు మాత్రం పై పనికి కొద్ది కొద్ది సదుపాయములందు తోడ్పడినారు.

ఇకముందు ఈ నూతి పూర్తి నిర్మాణమునకు ప్రభుత్వము వారు వెంటనే ఈ విషయమైజోక్యము కలిగించుకొని ఆర్థిక ముగా తోడ్పడిన బాగుండునని మా యొక్క ప్రార్థన.

ఇక్కడ నూతిలేనందున ఇతర గ్రామముల విద్యార్థులు సద్దులు తెచ్చుకొని బడికి దూరముననున్న చెఱువు, బావులకు వెళ్ళుటకు చాలా బాధపడుచుండిరి. సద్యః ఈ బాధ తొలగినది.

వికృతి (సం॥ అధికాషాఢ ॥బ॥౧౨ మంగళవారము
11-7-1950 గోలకొండ పత్రిక

**లేఖావళి**

ఆంధ్ర సారస్వత పరిషత్తు పరీక్షలు

శ్రీ గోలకొండ సంపాదకులకు

అర్యా!

మన హైదరాబాదు రాష్ట్రమునందు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు, మాతృభాషను ప్రాంతీయభాషగా మార్చవలెనని అపారకృషిని నిరంతరముగా సాగిస్తున్నారు. వారి ప్రయత్న ఫలితమై ఈనాడు హైదరాబాదు రాష్ట్ర ప్రజలు జాగ్రతులై అభిమానోత్సాహోపేతులై తల్లి భాషను గుర్తించి ప్రేమించి ఆదరించుచున్నారు. శిక్షణ బడయగోరుచున్నారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు నిర్ణయించిన పరీక్షలలో పాల్గొంటూన్న జనసంఖ్య దినదినము అభివృద్ధి నొందుచున్నదని పరిషత్తు వారి నివేదికవల్లను, ప్రజల యందున్న ఉత్సాహంవల్లను, తెలియుచున్నది. సద్యః తమ యధికారము నుండి విరమించుచున్నట్టి ప్రభుత్వము నాటి కాలములో తమ మాతృభాషను పెంపొందించుటకై మున్షీ, ఫాజల్, లాంటి పరీక్షలను తీసి వాటిలో ఉత్తీర్ణులైన వారికి ప్రభుత్వోద్యోగములను ప్రసాదించిరి. అదేమాదిరిగా మనపరిషత్తువారుగూడ నిర్ణయించిన

పరీక్షలను ప్రస్తుత ప్రభుత్వమువారు మాతృభాషాభిమానులైన నూతనమంత్రివర్గమువారు తీవ్రముగా జోక్యము కలగించుకొని ఆంగీకరింపజేయుటకు ప్రయత్నించుట అవసరము. తర్వాత మిగత విషయాలు. ఎందుకనగా వారు నిర్ణయించిన ఖానూను లను విద్యాగంధములేని నిరక్షర కుక్షులైన పల్లెటూరి ప్రజలను గుర్తించి అభిప్రాయములను తెలుసుకొనుట దుర్లభము. కావున పరిషత్తు వారు నిర్వహించుచున్న, పరీక్షలను ప్రభుత్వమువారు ఒప్పుకునక తీరదని నా సూచన, వాటిని పూర్తిగ ఒప్పుకున్న ప్పుడే రాజునుండి రైతువరకు సుఖము లభించును. పల్లెటూరి ప్రజలు మాతృభాషను ఆంతో ఇంతో గుర్తించియున్నారు. ఈ మాతృభాషా పరీక్షలను ప్రభుత్వము ఒప్పుకొని ప్రతిపల్లెకు విద్యా ప్రచారమునకై తన సౌకర్యముల నేర్పాటుచేసిన చాలా శ్రేయస్కరము. అప్పుడు వయోజనులకుగూడ అమితోత్సాహము గలుగును. అప్పుడే మనదేశము బాగుపడును. పల్లె ప్రజలు గూడ ఓటుయొక్క యోగ్యతను గుర్తింతురు.

మరిన్ని పరిషత్తు వారు నిర్ణయించిన ప్రాథమిక మాధ్య మిక, ప్రవేశిక. పరీక్షలలో మాధ్యమికను. మిడిల్‌తో సమానము. ప్రవేశికనుమాట్రిక్‌తో సమానముగా ఒప్పుకొనవలసినదే. ఈ పరీక్షలు ఒకలెక్కలు విడిచిమిగతా సర్వవిషయాలలోనుసమాన జ్ఞానము గలవై యున్నవి. కావున ప్రభుత్వమువారు ఈ పరీ

క్షలనంగీకరించి పరిషత్తువారు చేయుచున్నకృషిని ఫలవంతముగా జేయుదురని ప్రార్థన ?

పం॥ రాచవీరదేవరు హిరేమఠ అధ్యాపకులు అల్లా దుర్గము.



## ఆదర్శమూర్తి శ్రీ బసవణ్ణ

రచయిత :-
పం॥ రాచవీరదేవరు

నైజాం రాష్ట్రాంతర్గతమైన కల్యాణి పట్టణమునకు ప్రభువైన బిజ్జల భూపాలునకు సచివాగ్రేసరుండై. ఒక మతము ననేగాక రాజకీయ, ధార్మిక, సామాజిక, సాంఘిక, నైతిక, విద్యలలో అతిరేతి, నూతన మార్గమున న్వేషించి పర మతముల వారికి మార్గదర్శకుడైన మహాత్మ శ్రీ బసవణ్ణగారి పవిత్ర చరిత్రమును గూర్చిన సరియైన వివరాలు ఇంతవరకు సేకరింప బడలేదు. చరిత్రలో ఈ పుణ్యాత్ముని గురించి ఇంతవరకు యేమీయును ఉల్లేఖింపబడక పోవుట ఆశ్చర్య కరమైన సంగతి.

తెలుగునాడులో ఆతని విషయమై సమగ్రముగా తెలియక పోయినప్పటికిని ఈనాడు కర్ణాటక మహారాష్ట్ర ప్రాంతములవారు ఆయనను దివ్యజ్యోతిగా భావించ ఆత్యాదరముతోచూచుటయేగాక ఈ మహానుభావుని పథమునే అవలంబించుచున్నారు. ఈ మహాత్ముని దివ్యచరిత్రను మన యాంధ్రకవులలో ప్రాచీన కవియైన శ్రీ పాల్కురికి సోమనాథుల వారు అతిమనోహరముగా వర్ణించినారు. కర్ణాటకములో సుప్రసిద్ధకవియైన విజయనగర పుణ్యహంపీ క్షేత్రనివాసి శ్రీ హరిహర కవీశ్వరుడు ద్విపదలో ఈయననుగూర్చి భక్తిరసపూరితమైన కావ్యమును రచించినాడు. ప్రాచీన కవియైన భీమకవిగూడ ఈతని విషయమై కర్ణాటక భాషలో గొప్ప పురాణముగా వ్రాసినాడు.

ఆధునిక కాలమున బిజాపూరులోని రావుబహద్దురు మరియు వచన పితామహాయను బిరుదాంకితులు శ్రీ పి. జి. హాళకట్టిగారు. శ్రీ ధారవాడ లింగాయత హైస్కూల్ ప్రొఫెసరులైన సి. సి. బసవనాళగారు, మైసూరులో విశ్వవిద్యాలయ ప్రిన్సిపాలులైన టి. సుబ్రహ్మణ్యం మొదలయిన పండితులు రంగనాధ దివాకర, శ్రీనివాసమూర్తి పీరెల్లరు శ్రీ బసవణ్ణగారి చరిత్రనే ఆధారముగా తీసుకొని నానావిధములైన చరిత్రలను వ్యాసములను, కధానికములను, వచన వాఙ్మయములను, వ్రాసి తమ సాహిత్యమునకు మెఱుగు దెచ్చుకున్నారు. శ్రీ బస

వణ్ణగారి విషయమై వారి వచనామృత వాఙ్మయ సంబంధమైన వ్యాఖ్యానములను ఎంత వ్రాసినను తక్కువయే.

ఈతని కాలము సం॥ 1600 (12వ. శతాబ్దము)

శ్రీ బసవణ్ణగారు కర్ణాటక ప్రాంతమునకుజేరిన బాగెవాడియను గ్రామమున గొప్ప కుటుంబమున మాదిరాజ-మాదమాంబల ఉదరమునందుద్భవించి, అల్పవయస్సునందె సమస్త విద్యలనభ్యసించి కల్యాణ నగరమునకువచ్చి, యచటి ప్రజలచే ప్రధానమంత్రిగా ఎన్నుకోబడినవాడై. ఆ సమయములో ఆధోగతి పొలగుచున్న శైవమతము నవలంబించి, అందున్న స్వార్థసంకుచిత అస్పృశ్యతలను కూకటి వ్రేళ్ళతో పెకలించి వైచి, నాస్తికులను, దుర్మార్గులను, సత్యాహింసల వ్రతధారియై శాంతి భక్తిప్రభావములచే అణచివైచి, సదాచార సంపన్నులను, సద్భక్తి నిరతులను, సమయమునకు కాపాడి ఆదరించెను. గుణములకే ప్రాధాన్యత నిచ్చిన ఇతడు ఆ కాలములోను నిమ్న జాతి వారికి సరియైన శిక్షణ నొసగి, సంస్కారయుతులనుజేసి, వారికి ఉన్నత స్థానము నిచ్చెను. ఇందుకు ఫలితముగా ఇప్పటికిన్ని ఈ వీరశైవ పంథములో మాలమాదిగ మంగలి, వడ్ల, కమ్మరి, కంసాలి, సాలెవారు, మొదలగు పనిముట్ల వారెల్లరు, లింగధారులై యున్నారు, స్త్రీ పురుష భేదములేకుండా, అందరికి విద్యను నేర్పించి, సమాన హక్కులను కల్పించెను.

విద్యావ్యాప్తిని బాగుగా జేసెను. మానవసేవకై తాను ప్రప్రథమములో బద్ధకంకణుడై స్వార్థరహితులైన మహేశ్వరులను లోకసేవకై నియోగించెను. స్వదేశీ వస్త్రధారణమునకై రాట్నములను వడకుడని జనులకుద్బోధించెను. నిరుద్యోగులకు "కాయకమెకైలాసమని" చెప్పి ఉద్యోగులనుగా మార్చెను. గ్రామ పంచాయితీ తీర్పులకై ప్రతి గ్రామమునకు పంచకమేటీలను స్థాపించెను. దీని కురుహు ఈ వరకు ప్రతి గ్రామములో శెట్టి మహానాడు. అని ప్రతీతియైయున్నది.

కావునకే ఇట్టి ఇతని పవిత్ర చరిత్రను చక్కగా గ్రహించిన శ్రీ మహాత్మాగాంధిగారు సమస్త రాజకీయ రంగాలలో పాల్గొంటు వచ్చియున్న వీరశైవులను గురించి ఒకచోట "మీకు చెప్పె విషయాలు నావద్ద నేమియు విశేషముగాలేవు. మీ మతోద్ధారకుండైన శ్రీ బసవణ్ణగారి మార్గము ననుసరించిన మీకు చాలయశస్కరము" అని నొక్కి చెప్పి "విద్యానేవ విజావాతి విద్వజ్జన పరిశ్రమః" అనునట్లు మహాత్ముల సుగుణములు మహాత్ములకే గోచరించును, మరియు బసవణ్ణగారు అన్యాయమార్గావలంబియగు కలచూర్యవంశపు బిజ్జళునకు లేశమాత్రము భయపడక, తన నిర్మలమైన ఆచార ప్రవర్తన న్యాయ సమ్మతమైన అయుధముచే యతని గర్వమును అణగద్రొక్కి ప్రజా ప్రభుత్వమును స్థాపించెను. ప్రజాసుఖమే తన సుఖము. ప్రజాదుఃఖమే తనదుఃఖముగాయెంచి రాజ్యభారమును

సాగించిన మంత్రులలో ప్రథమ పురుషుడితడు. ఈ మహాత్ముని విషయమై ఎంత వ్రాసినను తీరదు. ఈతని చరిత్రకు సంబంధించిన శిలా శాసనములు తాళ పత్రములు ప్రాచీన గ్రంధములనేకములు గలవు.

శ్రీ బసవణ్ణగారు సమస్త గుణరత్నములతో ప్రకాశింపబడినట్లె ఈతడుండిన పుణ్యక్షేత్రము సహ అనేక తపోనిష్ఠా గరిష్ఠులకు నివాసయోగ్యమై పెక్కుగుహలలో గొప్ప గొప్ప తటాకారామములతో, మఠమందిరములతోను, చెక్కుచెదరని సుందరమైన దుర్గములతో, రమ్యమైన రాజభవనములతో, విశాలమైన విపణి వీధులతో, శిలా శిల్పములతో కళకళలాడుచున్నది. ఇట్టి దివ్యపురుషుని చరిత్రమును మన ప్రాచీనాంధ్ర చరిత్రలో లేదనిన అది ఒక గొప్పలోటు.

గోలకొండ వార పత్రిక 18-8-50



## ఏది యుక్తము ?

శ్రీయుతగోలకొండ సంపాదికుల సన్నిధి ??

ఆర్యా!

19-8-50 నాటి "గోలకొండపత్రిక "ఆందోలు తాలూక యనుట యుక్తము" అను శీర్షికతో (6-8-50 నాటి పత్రికలో జోగిపేట తాలూకాయని పిల్వబడాలి" అనుదానికి ఖండనగా గౌడుగారి లేఖ అయుక్తముగా నున్నది. ఏలయన ఒక పెద్దవస్తువు చిన్నదానిలో యిమిడి వుండడము ప్రకృతి విరుద్ధము అట్లే 1729 ఇండ్ల సంఖ్యగల జోగిపేట సుమారు 1200ఇండ్ల సంఖ్యగల ఆందోలునకు అంతర్భాగమెలా అయిందో అత్యాశ్చర్యంగా వుంది. "గతంగోష్టి సకర్తవ్యం" అను ఆర్యోక్తి నాధారముగా గొని వెనుకటి మాటలను మరచి ప్రస్తుత స్థితిని జూచుకుని ప్రవర్తించడము సరియైన మార్గము.

పూర్వపు మహానగరములు నేడునామమాత్రావశిష్టములై, శిధిలములై, వెలవెలబోవుచున్నవెన్నో గలవు. అందులో ఈ ఆందోలు వొకటి "ప్రాతదెన్నటికైనను మారుతుంది ? క్రొత్త దానికి తావిచ్చితీరుతుంది అన్నట్టు ఆనాటి రాజధానీ నగరమగు ఆందోలు నేడు అధోగతిపాలై జోగిపేట తేజరిల్లుటలో చోద్య మేమియులేదు.

పట్టణమునకు చిన్నచిన్న పల్లెటూర్లె జీవనాధారమైనంత మాత్రాన అవి పట్టణములనబడవు. అలాగే జోగిపేట వారివె కొందరి భూములు అందోలునకు సమీపమున నున్నందున ఆందోలునకు ఆధిక్యతవచ్చి జోగిపేటను మించజాలదు. కేవల మొక చెరువు మాత్రమున్నదని ఆందోలు తాలూకగా వుండ వలెననడము సమంజసము. అలాగైన జోగిపేటకు సమీపమున నున్న అన్నాసాగరమను చెరువు వుంది. దానిచే అన్నాసాగరము, కిచ్చనపల్లి, జోగిపేట, పోసానిపేట, మొదలగు గ్రామరైతులకు జీవనాధారముగా నున్నది. యోచించినవారి సూత్రప్రకారము అన్నాసాగరమే తాలూక యనుట యుక్తమా?

గుల్బర్గాజిల్లాయందు ఆందోలు పేరుతో ఒక తాలూకా కలదు. మెదకుజిల్లాలో అదే పేరు (ఆందోలు)తో తాలూకా వుండుట ఎంతవరకు యుక్తము? జోగిపేట యనుపేరుతో ఎక్కడ వేరే గ్రామము లేదుగా, జోగిపేట తాలూక యనుట చాలా భావ్యముగా నుండును.

ఉన్నది వున్నదనడము, లేనిది లేదనడము తమ తప్పును దిద్దుకొనుట యుక్తము. ఈ సామాన్య సూత్రప్రకారము సంగారెడ్డి తాలూకా (ముస్తఖర్) వున్నందున కల్పగూరులో యేమిలేనందుననే ప్రభుత్వము విశాల ధృష్టితో వీక్షించియె తాలూక సంగారెడ్డియని వ్యవహరించుచున్నది. అలాగే జోగి

పేట తాలూక (ముస్తఖర్) గలదు. అందోలులో ఏమియులేదు. గాన "తాలూక జోగిపేట"యనుట తగును. కావున ప్రభుత్వము తప్పకుండ "జోగిపేట తాలూక" యని వ్యవహరించిన బాగుండునని నా మనవి.

ఇట్లు
పం॥ రాచవీరదేవు, జోగిపేట.

గోలకొండపత్రిక 26-8-50



## జోగిపేట తాలూకాలో
## ఆంధ్రసారస్వత ప్రచారము

జోగిపేట, ఫిబ్రవరి 5 :

గత శుక్రవారమునాడు పోతులగోద (జోగిపేట తాలూకాలో) గ్రామమున రాత్రి సుమారు 9-30 నుండి 12 గంటలవరకు శ్రీ సంగమేశ్వర కవిగారి అధ్యక్షతన ఆంధ్ర సారస్వత సమావేశము జరిగినది. ఇందులో సుమారు 20-25 గ్రామాలనుండి మూడునాలుగు వందల ప్రజలు పాల్గొనిరి. శ్రీ పండిత రాచవీరదేవరు [ఆంధ్ర సారస్వత ప్రచారకులు]

శ్రీ శెట్టి శివరావు హైకోర్టు వకీలు మరికొందరు "విద్యయొక్క ప్రాముఖ్యము, ఆంధ్రభాష విశిష్టత, ఆంధ్ర సారస్వత పరిషత్ యొక్క కృషి మరియు అనేక విషయాలపై విపులముగా చెప్పిరి. మెదకుజిల్లా విద్యాశాఖ మొహతమీమ్‌గారు అశ్రద్ధగా తమ ఉద్యోగధర్మాన్ని నెరవేరుస్తున్నారనియు వీరి బదులు ఇంకొకరిని ఈ జిల్లాకు పంపిన విద్యాభివృద్ధికి ఇతోధికంగా తోడ్పడినవారు కాగలరని ఉపన్యాసకులు తెలిసినారు.

విద్యార్థులు దేవునూరు, పోతులగోడ, మొదలగుచోట్ల పాఠశాలలు లేనందున విద్యను పొందజాలకున్నారు. అందువల్ల ప్రతిపల్లెయందు ప్రభుత్వపు పాఠశాలలను స్థాపించుట ముఖ్యావసరమని కోరినారు. సభ శాంతియుతముగా ముగింపబడెను.

గోలకొండ పత్రిక 8-2-1952



## జోగిపేటలో సన్మానసభ

జోగిపేట, ఫిబ్రవరి 23:

తేది. 18-2-52 సోమవారము సాయంత్రము 6 ఘం॥లకు ఆందోలు తాలూకా నిజామాబాదపక్షమునుండి హైద్రాబాదు

శాసన సభకు ఎన్నికైన కాంగ్రెసు అభ్యర్థులకు శ్రీ వెంకట రాజేశ్వరజోషిగారిని, శ్రీలక్ష్మణకుమార్‌గారిని. మరియు శ్రీ నరేంద్రజీని, చేనేత పారిశ్రామికార్యాధ్యక్షులైన కొండాలక్ష్మణ గార్లను.59, ఎడ్ల జతలతో అలంకరింపబడిన రథముపై మంగళ వాయిద్యములతో ఊరేగింపు జరిపిరి. వేలాది గ్రామీణ ప్రజలు ఇందు పాల్గొని యుండిరి. వీథుల్లో స్త్రీలు కూడ క్రిక్కిరిసి యుండిరి.

రాత్రి 8 ఘం॥లకు మనుసానిపల్లె వాండ్ల రైసుమిల్లు వరాండంలో అందంగా నలంకరించబడిన సభా మండపమున తాలూకాధ్యక్షులు శ్రీ శ్రీపతిరావు వకీలుగారి అధ్యక్షతన ప్రార్థ నతో సభాకార్యక్రమము ఆరంభింపబడెను. శ్రీ పండిత రాచవీర దేవరగారు పెద్దామఠంగారు తాలూకా ప్రజల వైపు నుండి సన్మాన పత్రమును సమర్పించిరి.

శ్రీ కొండా లక్ష్మణబాపూగారు దోపిడీ వర్గమును ప్రజలే వృద్ధిజేయుచున్నారు. ఈ విషయంలో ప్రభుత్వంవారిది ఎలాటి తప్పులేదు. అట్టి వారిని పట్టించనందున ప్రజలకే పొరపాటు దోపిడివిధానమును నిర్మూలింపజేసి, సంస్థను చక్కదిద్దుకోవడము ప్రజల కర్తవ్యమై యున్నది. మరియు కాంగ్రెసు వారెల్లరు ఖద్దరు వస్త్రములనే తప్పక ధరించవలెనని ఇత్యాది విషయము లను చక్కగా ప్రతిపాదించిరి. శ్రీ వెంకట రాజేశ్వర జోషి

గారు ప్రజల కవసరమైన కూడు, గుడ్డ, విజ్ఞానము వీటి విషయమై మేము కృషి చేయగలము. మాకు మీ సేవయే ప్రధానమైనదని సెలవిచ్చిరి. శ్రీ పండిత నరేంద్రజీగారు లంచగొండి తనము, బ్లాక్ మార్కెటు నిర్మూలన విషయమై చక్కగా చర్చించుచు మధ్యన మూర్ఖతనమున రేషను విషయమై ప్రశ్నలు వేసిన వారికి రష్యా, అమెరికా మొదలైన రాష్ట్ర ప్రజలు తమ దేశముయొక్క గౌరవమును కాపాడుకొనుటకై ఆహార ధాన్యంకొరత విషమ పరిస్థితులయందు యిచటి ప్రజలు ఎలా ఎన్ని పాట్లుపడ్డారు. అదికాక పాకిస్థానులో చాలా భూభాగ ముండి జనాభ కొద్దిగుంది. మనకు-మిగిలిన భూభాగములో కొద్ది గాఉండి జనాభా చాలాఉంది. ఇతర దేశములనుండి వలసవచ్చిన శరణార్థులకు కూడు గుడ్డ ఉద్యోగములు సప్లయిజేయుటమువల్ల మనకీనాడు తిండి ధాన్యముకొరత ఏర్పడినది.

అయినను బెంగాల్, రష్యాలోని నాయకులు లక్షలాది, వేలాది, ప్రజలను క్షామదేవతకు బలిగావించినట్లు నేడు మనకా దుస్థితి నంభవించ లేదుగదా ? అట్టి పరిస్థితు లేర్పడక మొదలే మన నాయకుడైన పండిత జవహార్‌లాలుగారు అన్య దేశముల నుండి ఆహార ధాన్యమును దెప్పించి మనకు సప్లయి చేయించు చున్నవారే మనపాలిటి దైవము. అట్టినాయకులు"నభూతో నభవి ష్యత్తు"లో గూడ లభించుటదుర్లభము. మన పూర్వపుణ్యమునుండి వారు మనకు నాయకులై మార్గదర్శకులైనారు. సావధానముతో

మామిడి మొక్కను సురక్షితముగా పెంచి మధురమైన మామిడి పండ్లనందింపజేయు తోటమాలి నెహ్రూగారు. గారడీ విద్యలో అప్పుడే పుట్టించి పెంచి రెండుమూడు పండ్లను త్వరలో అందింపజేయుట. లేక చేయగలమనే కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులైన డాంగే, జయప్రకాశనారాయణులుగారు. సావధానముతో మనకు కాంగ్రెసు సంస్థయే సుఖమును లభింపజేయును. ఈ పరమపవిత్రమైన కాంగ్రెసు సంస్థపై మీరందరు విశ్వాసముంచండి, అని బోధించిరి.

తరువాత శ్రీ సదాశివశర్మగారు నరేంద్రజీగారి హిందీ భాషణమును తెనుగున యనువదించి చెప్పిరి. 7-30 గం॥కు శాంతి పాఠముతో సభ ముగిసెను.

గోలకొండపత్రికా తేది 28-2-1952



## ఆశాకిరణము

......భేదాలతోనూ....భావములతోనూ పదవీవ్యామోహంతోను, మూర్తీభవించిన వ్యక్తులు కొందరు ప్రవేశించియున్నందున ప్రజలకు ఈ సంస్థయందు అవిశ్వాసము, అగౌరవము, తాత్సార భావములు, ప్రతిబింబితమైపోయినవి. అందు చేతనే కాంగ్రెసు అంటే కస్సుమన్నారు కొందరు. ఆ నాయకులంటే బుస్సుమన్నారు మరికొందరు. నాయకుల భేదభావముల ఫలితమై ప్రజల్లో ఉద్రేకములుచెలరేగి తమంతట తామే పోట్లాడారు. తమతమ విచారములను ఉడుపులతో బాటు మార్చుకున్నారు.

కొందరు కమ్యూనిస్టులతో సహకరించి ప్రక్కతాళం కొట్టుచు పైకి లేవదీస్తున్నారు. మరికొందరు సోషలిస్టు ప్రజా పార్టీలతో పొత్తుగల్పుకున్నారు. విశేషమేమిటంటే ప్రజలకు ఏ విధమైన మేలు కలిగించకపోవటమొకటి. కాంగ్రెస్ వారు నిర్ణయించుకున్న పంచవర్ష ప్రణాళికను త్వరలో అమలు చేయక పోవటం రెండవ కారణము. ప్రభుత్వము ప్రజలకెంత మట్టుకు మేలు కలిగిస్తుందని పైవారు సింహావలోకనము జేయక పోవటము మూడవ కారణము. ఇకముందు ఇలానే చీలికల భావములతో నడచిన "రెండు పిల్లులు కలహించుకొనిన కోతికి లాభమైనట్లు" మూడవ సంస్థ పైకి రావటమునిక్కము.

దార్రిద్య నిర్మూలనకు దారితీసే కమ్యూనిజమే శరణ్య మనువారు పెక్కురున్నారు. ప్రజల యాభావములను పరి మార్జింపవలెననిన ప్రప్రథమములో రామానందతీర్థగారు సెల విచ్చినప్రకారము భూపంపకము, జాగీర్‌దార్లనురద్దుజేసి,బీదలకు మేలుకలిగించుట చాలా మంచిది. మరియు పంచవర్ష ప్రణాళి కను త్వరాతి త్వరలో అమలుజేయుట అతి శ్రేయస్కరము. అప్పుడు గాని ప్రజలకు ఈ సంస్థయందు అపరాభిమానాలు విశ్వాసములు, చూరగొనుట నిక్కము. అయిన "గతంగోష్ఠిన కర్తవ్యం'' అను సూత్రమునుబట్టి ప్రజల భావిసర్వాంగాభి వృద్ధిని ప్రస్తుతంలో ఎన్నికైన శాసనసభవారు తమ దృష్టి యందుంచుకొని ప్రవర్తించుటయే ప్రజలయందు మూడిన గత పరిస్థితుల భావములను మరపించుటకు మూలము. తేది 12-2-52 రోజున కేశవ మెమోరియల్ హైస్కూలులో జరిగిన కాంగ్రెస్ లెజస్లేచర్ పార్టీ సమావేశములో భేదభావములేకుండగ ఏకగ్రీవంగా బి. రామకిషన్‌రావుగారు కాంగ్రెస్ అసెంబ్లీ పార్టీ నాయకస్థానమునకు ఎన్నుకోబడినారు. అను విషయము ఈనాడు మన హయిదరాబాదు రాష్ట్ర ప్రజలకు ఒక "ఆశాకిరణము మూడి" నట్లుతోచుచున్నది.

అయినను వారు గత పరిస్థితి మల్లె మాతృభాషా విషయమై విద్యాశాఖామాత్యులయ్యుతాత్సార భావముతో తమ విధిని పూర్తిగ నెరవేర్చక పోవుటచే మాతృ భాషాభిమానంగల

తెలంగాణా పత్రికలెలా విమర్శించాయో, ఆ పరిస్థితులేర్పడ కుండగ ప్రవర్తించుటయే వారి అద్యకర్తవ్యము. "మనసా-చింతితం కార్యం వచసాన ప్రకాశయేత్" ప్రకటించుటకంటె పనిచేయుటయే పరమ ధర్మము. అనుసూక్తి మననీయమైనది. కార్యము సిద్ధించువరకు కళ్ళెం కదిలించుట పొరపాటు. కారణ మేమన "ఖమ్మంమెట్టులో ఆంధ్ర సారస్వత పరీక్షలకు ప్రభుత్వంయుచే అంగీకరింప చేశాను. ఆర్థిక సహాయము కూడా పరిషత్తుకు చేయిస్తున్నాను, పరిషత్తు పరీక్షలలో నెగ్గినవారికి గవర్నమెంటు ప్రాథమిక పాఠశాలలలో తీసుకుంటున్నారు." అని వీరు ఇచ్చటి సమావేశములో ప్రభుత్వ ముంగీకరింపక మొదటే సెలవిచ్చినట్లు, ఇకముందు అలా జరుగకుండ అప్రమత్తులు (జాగృతులు) కావలెనని ప్రార్థిస్తున్నాను.

ఇకనైనా శ్రీవారు హిందీ రాష్ట్ర భాషగాను, మాతృ భాషను ప్రాంతీయ భాషగాను, ప్రభుత్వముచే అంగీకరింపజేసి, త్వరలో ఆంధ్ర సారస్వత పరిషత్తుకు ఆర్థిక సహాయమొసర్చి ఆయా పరీక్షలలో నెగ్గినవారికి ప్రభుత్వ శాఖలలో చేర్చుకొనునట్లు జేయుటచే ఈ ఉపాధికారం ఫలితమనుభవింతురు ప్రజలు, 'చతుర్విధఫల పురుషార్థములకు' విద్యయే మూలము గదా! కనుక మొదలు కావాల్సినది ప్రజలకు విజ్ఞానం (విద్య ఒకటే ఆధారము.

రాచవీర దేవర

గోలకొండ పత్రిక 3-3-1952 సోమవారము

## 'విశారద' పరీక్షలో ఉత్తీర్ణులైన ఉపాధ్యాయులకు విద్యకు తగ్గ ప్రతిఫలం ముట్టుటంలేదు

### సత్వర చర్యలకై ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యకర్తలకు విజ్ఞప్తి :

మన రాష్ట్రమునకు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు మాతృభాషాభివృద్ధికొరకు నిరంతరమైన కృషినల్పుతు కొలది సంవత్సరములనుండి పరిషత్తు పక్షమున కొన్ని పరీక్షలను నడుపుచున్నారు. వాటిలో ప్రవేశ పరీక్షను ప్రభుత్వపు 7వ తరగతి పరీక్షకు సమముగాను, మరియు, విశారద పరీక్షను మెట్రికు్యలేషన్ సమానముగాను ప్రభుత్వమువారిచే అంగీకరింప జేసినారు.

ఈ పరీక్షలలో ''ప్రవేశ'' పరీక్షకుగాని, "విశారద" పరీక్షకుగాని, ఉన్నట్టి పాఠ్య గ్రంధములు చాలా కఠినములైనవి. అందులోను 'విశారద' పరీక్ష రెండు సంవత్సరముల కోర్సులోను ఇంచుమించు 40 పాఠ్య గ్రంధములున్నవి. వీటిలో లాక్షణిక గ్రంధములున్నవి. వీటిలో లాక్షణిక గ్రంధములు కొన్ని ఛందస్సలంకారములతోను, మహాకావ్యములతోను, ఒప్పియున్నవి. ఆంధ్రమున మద్రాసు యూనివర్సిటీ విద్వాన్

మరియు ఆంధ్రాయూనివర్సిటీ భాషాప్రవీణ మొదలైన ప్రౌఢ పరీక్షలతో విజ్ఞానమునందు 'విశారద' పరీక్షయోగ్యత లేశ మాత్రము తక్కువ గాలేదని ఘంటాపథముగా నొక్కి చెప్పవచ్చు.

ఐతే ఇంతటి యోగ్యతగల ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి 'విశారద' పరీక్షను మన ప్రభుత్వము వారు బి. ఏ. పరీక్షకు సమముగా నంగీకరించిన విద్వాన్ పరీక్షతో సమముగ నున్నను 'మెట్రిక్'తో సమానముగా ఒప్పలేక ఒప్పియున్నట్లు "ఏడ్చే వారి కన్నులుతుడిచిన' మాదిరి అంగీకరించియున్నారు. "విశారద'' పరీక్షను మెట్రిక్యులేషన్‌తో సమానముగా నంగీ కరించియున్నారని పదిసార్లు చెప్పుకొని సంతసించడమే కాని అందుకు తగిన ప్రతిఫలము మాత్రము ఎవరికీ కలుగుటలేదు. ఇందువలన ప్రతి ఏట ఈ పరీక్షల నొసగే విద్యార్థుల సంఖ్య గూడ తగ్గిపోవుచున్నది. జీవితంగడువని చదువు ఎందుకని నిరాశ అంతటా ప్రబలివున్నది.

ఇంతవరకు మనము విచారించి చూచినచో ఈ విశారదలో నెగ్గి విద్యాశాఖలో నున్నట్టి తెలుఁగు పండితుల కెక్కడను మెట్రిక్యులేషను గ్రేడును విద్యాశాఖాధికారులు ప్రసాదించలేదని నా ఊహ. తెలుఁగుపండితులతో మాధ్యమిక హైస్కూళ్ళలో ఎక్కువగాపని. తీసుకోవడమే జరుగుతున్నదిగాని, యోగ్యత

ప్రకారం వేతనము లిచ్చుటలేదు. ఇంతవరకు ఉద్యోగములలో నున్నట్టి పండితులు గూడా విద్యాశాఖాధికారులతో ఎక్కువగా ఈ విషయమై ప్రసంగించిన ఉన్న ఉద్యోగం ఊడుతుందేమో అని భయముతో నున్నారు.

ఐతే ఒక విషయము ప్రభుత్వ పరీక్షల నొసగినవారు అన్ని విషయములను బోధించగలుగుతారు, మఱివీరికట్లుబోధించ టకు శక్తిలేదనుకుంటారేమో, కాని ఈ పరీక్షలలో నెగ్గినవారు సంస్కృతాంధ్రములను నిరర్గళముగ బోధించగలరని నొక్కి చెప్పుచున్నాను. అంతేగాక మఱికొందఱు హిందీ, తెలుగు, సంస్కృత, కన్నడ ఈ నాల్గు భాషలలో ప్రౌఢ విద్యలను బోధించుటకు శక్తిగలవారున్నను వారి ప్రమాణ పత్రములను చూచి గూడ మామూలు ఆ మెట్రిక్యులేషన్ గ్రేడును కూడా ఎందువల్ల ప్రసాదించుటలేదో ! దీన్ని బట్టి ప్రైవేటు సంస్థలు నడిపి పరీక్షల ముందు మాతృభాషయందు ఎంతటి ఏవగింపుగా ఉన్నదో మనకుద్యోతకముగాక మానదు.

మద్రాస్, రాజమహేంద్రవరము, మొదలగు ఆంధ్ర ప్రాంతపు గొప్పవిద్వాంసులు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు నడిపే విశారద పరీక్ష యొక్క విజ్ఞానాన్ని గుర్తించి అచ్చటి విశ్వవిద్యాలయములవారు దీనిని "ఇంటర్‌తో సమానముగా నంగీకరించి చివరకు ఆ గ్రేడును ఇవ్వటానికి సైతము అనేక

విధముల శంకించుచున్నారు. ఇది మీదుమిక్కిలి - బాధా కరము.

ప్రస్తుతము "విశారద" పూర్తి పరీక్షలో నెగ్గి విద్యాశాఖ వారిచే మాధ్యమిక హైస్కూళ్ళలో నియోగింపబడినట్టి తెలుఁగు పండితులకు ప్రభుత్వమువారు వాలంటరీ పాఠశాలలో ఇవ్వబడే (30) లేక 30-50 గ్రేడును మాత్రమే ఇచ్చియున్నారు.

ఈగ్రేడు ప్రభుత్వ పాఠశాలలో 4వ లేక 6వ తరగతి వరకు చదివిన వారికి ఇవ్వబడుచున్నది. ఆ యోగ్యతను ఈ విశారద పరీక్షలో నెగ్గినవారికి అంటగట్టినారు. దీనితో వీరి వివేక మెతుందో తేటతెల్లమగుచున్నది.

ఒక పక్షమున కొన్ని జిల్లాలలో కొందరు తెలుగు పండితులకు మెట్రిక్యులేషన్ గ్రేడు నొసగియుండవచ్చునని అనుకొనినచో ఆ చట్టము స్టేటు అంతటికి వర్తించవలయును గదా? అట్లైన కాని మెదక్ జిల్లా విద్యాశాఖ వారికి మాత్రము ఈ చట్టముతో సంబంధము ఉన్నట్లు కానరావటంలేదు. ఎందు వల్లననగా ఈ జిల్లాలోమాధ్యమిక హైస్కూలు పాఠశాలలలో-నియోగింపబడిన 'విశారద' పరీక్షలో నెగ్గిన పండితులకు కేవలముపై జెప్పబడిన ప్రకారము 30-50 గ్రేడును మాత్రమే ఇచ్చియున్నారు, గాని మెంటిక్యులేషన్ గ్రేడు మాత్రము ఒసగ

లేదు. ఎంత అశ్చర్యకరముగా నున్నదో పాఠకులే ఊహిం తురుగాక.

అంతేగాక ఇతర ప్రాంతములకు సంబంధించిన "విద్వాన్" "భాషాప్రవీణ" మున్నగు పరీక్షలో నెగ్గినవారికి మెట్రిక్ గ్రేడు నొసగుచు హైదరాబాదులోనేపుట్టి పెరిగిన ఈ "విశారద" పరీక్ష యోగ్యతనేలా నిర్లక్ష్యం జేస్తున్నారో తెలియుటలేదు. సూక్ష్మ దృష్టితో చూచినయెడల ప్రభుత్వమువారు ఒక విధమైన కక్షతో ఈ పరీక్షలను చూచుచున్నట్లు గోచరమగుచున్నది. ఎంప్లాయ్ మెంటు వారుగూడ దరకాస్తులు బెట్టుకొనినను నిర్లక్ష్యము చేయు చున్నారు. దీనితో బీదలగతి ఎలా బాగుపడుతుంది ?

కావున పరిషత్తు ప్రధాన కార్యకర్తలతో మనవి ఏమనగా దయచేసి వెంటనే మెదక్ జిల్లా మొదలైన విద్యా శాఖాధికారులకు ఘాటుగా ఒక పత్రమును వ్రాసి "విశారద" పరీక్షలో సంపూర్ణముగ నెగ్గిన వారికి మెట్రిక్ గ్రేడును ప్రసా దించునట్లు చేయగలరు. లేనిచో ఈ విషయము తమ సంస్థకు మాకును చాల అవమానకరముగా దోచుచున్నది. పైవిషయాన్ని గూర్చి గ్రేడు విషయమై హైదరాబాద్ (విద్యాశాఖ) **D.P.I.** ఆఫీసరు శ్రీమాన్ సేతు మాధవరావుగారి సన్నిధికి రెండుసార్లు రిజిష్టరు రసీత్తులబుద్వారా వినతి పత్రమును పంపినను సమా ధాన మిచ్చుటలేదు. దీనికంతటికి కారణమేమో తామే ఊహించగలరు.

ఉపాధ్యాయవృత్తిలో నున్నప్పుడు
గుప్తముగ ప్రకటించబడినది.

ఇట్లు
రాచవీరదేవర
ఒక భాషాభిమాని.

18-11-1954 తెలుగుదేశం



**ఉపాధ్యాయుల సూచనలు**

పేక్మాల్, మే 3 :

ఏప్రెల్ 20వ తేదీన పేక్మాల్ ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో శ్రీ బి. నత్తయ్య ప్రధానోపాధ్యాయులుగారి అధ్యక్షతన టీచర్స్ యూనియన్ సమావేశము జరిగెను. అందు ఈ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా నంగీకరింపబడినవి.

ప్రభుత్వపు ఇతర శాఖలందున్న ఉద్యోగుల వేతనములను తగ్గించక కేవలము, విద్యాశాఖ ఉద్యోగుల వేతనములను తగ్గించుటకు కారణములేదు.

అట్లు చేయక విద్యాశాఖ యోగ్యతక్రమముల కనుగుణముగా పూర్వమువలెనే మిడిల్ వారికి 50-65, మెట్రిక్ వారికి 65-115 మొదలగు గ్రేడులను ఒసగవలెను.

ప్రభుత్వంవారిచే గుర్తింపబడిన ఆంధ్ర సారస్వత పరిషత్తువారి "విశారద" మరియు హిందీ "విశారద, భూషణ" పరీక్షలలో నెగ్గిన వారికి. మెట్రిక్ గ్రేడ్ నొసగి మాతృభాషను మరియు రాష్ట్రభాషను ప్రోత్సహింపజేయవలెను. వీరికి బేసిక్ ట్రెయినింగ్‌లో పాల్గొనుటకవకాశమును కల్పించవలెను.

తెలుగు భాషలోనే విద్యాశాఖ కార్యాలయముల చట్టములను, ఆదేశ పత్రములను ఉత్తర ప్రత్యుత్తరములను జరుపవలెను.

వాతావరణము ననుసరించి ఉపాధ్యాయులు తమకు వలసిన సదుపాయములకై పై అధికారులవద్ద దరఖాస్తులు పెట్టుకొనిన వెంటనే వాటిని నెరవేర్చుటలేదు. తక్షణమే అవునుకాదని జవాబు ఇవ్వవలెను.

ముంతఖబలు మరియు టి.ఎ. బిల్సుత్వరలోనే వారి వారికి అందచేయవలెను.

ఇంటి కిరాయలు ప్రతిచోట జిల్లావలెనే ఇతర గ్రామస్థ ఉపాధ్యాయులకును వర్తింపజేయవలెను.

బరావర్దులు ప్రతిమాసము చివరి తేదిన ఆయాబళ్ళ-కందచేసిన మాసము మొదటి తేదిలోనే ఉపాధ్యాయులు తమ తమ వేతనములను త్వరలోనే పొందుట కనుకూలించును.

ప్రతి మాసపు బరావర్దులు తెలుగుభాషలోకి మార్చిన ప్రాధమిక ఉపాధ్యాయులకు చాల మేలగును.

గోలకొండపత్రిక 6-5-55 శుక్రవారము దినపత్రిక



## గ్రామ వార్తలు

### వీరశైవ సమాజ స్థాపనము

చౌదరపల్లి, జూన్ 9 :

కల్వకుర్తి తాలూకా ఎందల చౌదరపల్లిలో గురువారం మే 31నాడు శ్రీ గూడ బన్వాలింగప్పగారిచే నిర్మింపబడిన శివాలయములో శ్రీ బసవేశ్వర లింగ ప్రతిష్ఠాపన ఇత్యాది కర్మలు వీరశైవ బ్రాహ్మణోత్తములచే శాస్త్రోక్తముగా జరుపబడెను. సాయంత్రము మహేశ్వరుని ధర్మలగ్నముకూడ జరిగెను. అదే సందర్భమున హైదరాబాదు నగర అఖిలాంధ్ర

వీరశైవ సమాజము పక్షమున అరుదెంచిన శ్రీమాన్ యస్. బసవరాజు బి.ఏ. కార్యదర్శిగారు, శ్రీ పండిత్ రాచవీరదేవర జోగిపేటగారు, శ్రీ జగదీశ్వరరావుగారు, శ్రీ దెమ్మవీరభద్రప్ప గారు, వీరశైవ ధర్మములను గురించి ఉపన్యసించిరి.

తేది 1-6-56 ఉదయము 10 గంటలకు శ్రీ గూడ బస్వలింగప్పగారి గృహమున స్థానిక మరియు పరిసర గ్రామాదుల వీరశైవులు ఎల్లరు శ్రీ పూజ్యానిడుమామిడిమఠం కరి బసస్వాముల వారి అధ్యక్షతన సమావేశమైన పిదప శ్రీ పండిత రాచవీరదేవరు. శ్రీ జగదీశ్వరరావుగారు, శ్రీ యస్. బసవరాజు బి. ఎ. గార్లు అఖిలాంధ్ర వీరశైవ సమాజంవారు వీరశైవ మతోద్ధరణ విషయమై అతివిపులముగా ముందు సమాజము చేయవలసిన కార్యక్రమములను గురించి ఉపన్యసించిరి.

పిదప సమాజ నిర్వహణకై దిగువనుదాహరించిన కార్యవర్గ కమిటీ ఏకగ్రీవముగా ఎన్నుకొబడినది.

అధ్యక్షులు గూడ బస్వలింగప్ప, ఉపాధ్యక్షులు కోరె రాజప్ప, కార్యదర్శి. నాణెంకల సాదప్ప, సహాయ కార్యదర్శి గూడ మల్లప్ప, కోశాధిపతి మెండెగుత్తల భద్రప్ప, మరి **11** మంది సభ్యులు ఎన్నుకోబడిరి. శ్రీ కార్యదర్శిగారి కృతజ్ఞతతో సమావేశము పగలు **12** గంటలకు జయప్రదముగా ముగిసినది.

గోలకొండ పత్రిక -6-1956

# వీరశైవ పతాకారోహణ గేయము

రచయిత :

విద్వాన్. విశారద, శ్రీ రాచవీరదేవరగారు,సదాశివుని పేట.
(హైస్కూలు పండితులు.)

ఎగురవే ఓ వీరజెండా !
ఎగురవే మా వీరజెండా ! !
ఆది శైవులు నిన్ను ఆదరించిన వేళ
వెల్లివిరిసెను నీదు యశము
కొల్లగొట్టెను సాంద్ర నిశను 1

రెడ్డిరాజులలోన ఖ్యాతిగాంచిన రాణి
బిడ్డలై పగతుల పొలిదోలిన మహా !
రుద్రమ్మ నలరాజు నాగమాంబల శౌర్య
ముద్రలై వెలసిన ముదిత శైవులసీమలో 2

తరతరంబుల నుండి పరిపక్వమై పండి
గురుతర క్షీరమున నవనీతమును బోలె !
వీరశైవ పదమ్ము వీరులనె పఠియించె
వీరశైవుల పుణ్యభూమి యగు నాడులో 3

శ్రీ రేణుకాచార్య వరులల్లమప్రభుల్
భూరిప్రభావు లగు బసవాది ప్రమథులు

నిరత ధర్మక్రాంతికై లేపి నిలిపిన జెండా !
సర్వజనాశ్రయం బొసగి మెఱసిన జెండా ! 4

పాండ్య కేరళ చోళ ప్రముఖ కాశ్మీరముల
ఫాలలోచన భక్తవరు లెల్ల భూపతుల్ !
పోరి జగమున శాంతి ధర్మమ్ము స్థాపించు
వీరశరణుల నాటి వీరశైవుల జెండా ! 5

స్వధర్మ **1.1.1959**



# రాష్ట్రభాషగా సంస్కృతం

ఆర్యా !

నేడు భాషాచిక్కును విడదీసి భారతదేశగత వైభవమును పునః నెలకొల్పవలెననిన సంస్కృతభాషను రాష్ట్ర భాషగా ప్రభుత్వము గుర్తించుట సమస్త జనులకు శ్రేయస్కరం.

ఈ యభిప్రాయమును మనసునందిడుకొనియే కాబోలు కొందరు సంస్కృత పండిత ప్రకాండులు విశాల దృష్టితో భారతదేశములోని సమస్త విశ్వవిద్యాలయముల యొక్కయు, మరియు సంస్కృత ప్రచార పరిషత్తులయొక్క ప్రిలిమినరీ పరీక్షలను బి.ఎ.తో. ఫైనల్ (ఓరియంటల్ టైటిల్సు) వానిని ఎం.ఎ. తోను సమానముగా సెంట్రల్ గవర్నమెంటు విద్యాశాఖా మాత్యులచే నంగీకరింపజేసి యున్నారు. ఈ విషయము సమస్త సంస్కృతభాష నభ్యసించిన వారికి మరియు సంస్కృత భాషా భిమానులకెంతో ముదావహము.

ఇదే మాదిరిగా మన రాష్ట్ర ప్రభుత్వం వారు మరియు భారత ప్రభుత్వ విద్యాశాఖా వారుగూడ అలా గుర్తించినదానినే గుర్తించిఎం.ఎ.వారికిచ్చే గ్రేడునిచ్చి గౌరవించినచో ఇతరులకు ఈ సంస్కృతభాష యందు గౌరవాభిమానములు తప్పకుండ గలుగగలవని విశ్వాసపూర్వకముగా జెప్పనొప్పును.

ఇటీవలనే శ్రీ రాష్ట్రపతిగారు హైదరాబాదునకు విచ్చే సిన సందర్భమున స్థానిక పండిత ప్రకాండులైన శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, మున్నగు వారెల్లరు శ్రీ వారిని సందర్శించి సంస్కృతమునే రాష్ట్ర భాషగా యొనర్చిన యిప్పుడున్న రాష్ట్రభాషా వివాదము సమసి పోవునని సూచించిన విషయమున వినిన మనకెల్లరకు ఆనందప్రదమే.

కాని రాష్ట్రభాష సంస్కృతము కావలెనన్న దాని వ్యాప్తికై ప్రభుత్వము ఆర్థికముగాను సంస్కృత భాషాభిజ్ఞులు భాషా ప్రచారముతోను కలిసికట్టుగాను పనిచేసినచో తప్పకుండా సంస్కృతభాష రాష్ట్రభాష యగుటలో సందియములేదు.

కాని పండితులలో కొందరికి అహంభావముండి, నేనే గొప్పపండితుడను. నేను వల్లెవేసినన్ని గ్రంధములు మరెవ్వరూ వల్లెవేయలేదను దురభిమానమును స్వార్థమును, కూటివేళ్ళతో పెకలించివైచి నిస్వార్థముతో విశ్వప్రేమతోను మానవ కళ్యాణమునకై పాటుబడిననాడె సంస్కృతము రాజభాషయై యల రారగలదు.

ఈ సంగతిని నేనిక్కడలేవనెత్తుటకు గారణమేమనగా ఇప్పటికి యింకను కొందరు పండితులు పూర్వపు చాదస్తమును వీడక ఎల్లప్పుడు వారికదకేగి 'నమోదాదామానుజాయ' అని దీర్ఘ

దండ నమస్కారమొనర్చిన వారికే సంస్కృత విద్య లభించు చున్నది. ఇది యాచరించనివారికి అక్కడ సంస్కృతబోధన జరుగుట యసంభవము.

ఇట్టి గురుకులములకు ప్రభుత్వము గ్రాంటు నొసగుట గూడ పొరపాటే. ఏలనన యిక్కడ కొన్ని కళాశాలల్లోను నేటి కిని జాతి విచక్షణగూడ జరుగుచున్నది. ఇది నా యనుభవము ఇలాంటి యప్పుడు సంస్కృతభాష రాష్ట్రభాషయగుట యెట్లు పొసగును? సంస్కృత పరీక్షలకు గూడ గొప్పగొప్ప గ్రంథ ములను నిర్ణయించుచున్నారు. ఇట్టి మహాపండితులే. ఇకసంస్కృ తము నితరులు అభ్యసించుటకు ఎట్లు వలనుపడును? అది మొదలే కొరకరాని కొయ్యవంటిదని సర్వవిదితము.

కావున సంస్కృతము రాష్ట్రభాష గావలయునని గోరి నచో మొదలు తేలిక (సులభము) గానుండు భాషాపదజాల ముండిన పుస్తకముల నెన్నుకొని ప్రతి ప్రభుత్వ పాఠశాలల యందు సంస్కృతమును తప్పనిసరిగా బోధనావిషయముగా నిర్ణయించవలెను. పోతే హిందీ ప్రచారమునకై వెచ్చించుచున్న ఆర్థిక సహాయమును ప్రభుత్వమువారీ సంస్కృత ప్రచారము నకై వెచ్చించవలెను. ఐతేభాషాభివృద్ధికి కొన్ని సంవత్సరము లవసరము. ఇది ఏ భాషకైనను యవసరమే గదా।

సంస్కృత పట్టభద్రులకు (ఓరియంటల్ ట్రైటిలుగల వారికి) ఎం.ఎ.తో సమానముగా గ్రేడులనిచ్చి ప్రోత్సహించి ప్రభుత్వము తగిన గౌరవ మీయవలయును. అప్పుడే సమస్త జనులకు సంస్కృతము నభ్యసించుట యందభిరుచి గలుగును. అప్పుడే మన భారత సంస్కృతిని భారత ప్రభుత్వమువారు గాపాడిన వారగుదురు. సంస్కృతము మహాసాగరమువంటి దనియు, అందున్న విషయములు యితర భాషలో లేవనినచా నతిశయోక్తి గాజాలదు. కావుననే పూర్వకాలమున విదేశీయులెల్లరు మన భారతదేశమునకు విచ్చేసి సంస్కృతభాషనభ్యసించిరి. ఆ కారణమున సంస్కృతమే రాష్ట్రభాష యగుటకు సర్వవిధ ముల యొప్పియున్నది. రష్యా, అమెరికా, ఇటలీ, జర్మన్, జాపాను దేశములవలె మన భారతదేశము రాణించును. భారత దేశ సంస్కృతికి సంస్కృతభాష పట్టుగొమ్మ వంటిదని గ్రహించాల్సి ఉంది. గత వైభవాన్ని మళ్ళీ సంతరించి కొని నట్లగును.

ఇట్లు

**పి.ఆర్.వి. దేవర**

యాకుత్పుర.

గోలకొండ పత్రిక 16-7-1965

# ఉస్మానియా 'బి.ఓ.యల్.'కు ఆంధ్ర 'విద్యాప్రవీణ'కు యం.ఏ. డిగ్రీతో సమాన ప్రతిపత్తి

—రాష్ట్ర ప్రభుత్వం గుర్తింపు

తిరుపతి డిసెంబరు 25 :-

విద్యాశాఖలో ఉద్యోగ నియామక విషయంలో రాష్ట్రం లోని వివిధ సంస్థలు నిర్వహించే సంస్కృత పరీక్షలకు ఇంగ్లీషు డిగ్రీలతో సమాన స్థాయిని కల్పిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "రికగ్నేషన్" ఇచ్చింది.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం "శిరోమణి" (ఫైనల్)ని యం.ఏ. డిగ్రీతో సమానంగా పరిగణిస్తారు. ఇదే విధంగా విద్వాన్ [ప్రిలిమినరీ] బి.ఏ. డిగ్రీకి సమానంగా పరిగణింపబడుతుంది.

పార్టు 2, 3 సంస్కృతంలో ఉస్మానియా బి.ఒ.యల్. పరీక్షలో ఉత్తీర్ణులైన వారిని ఎం.ఏ. డిగ్రీ పొందిన వారితోను, పార్టు 2, 3 సంస్కృతంలో డి.ఒ.యల్. పరీక్ష ప్యాసయిన వారిని బి.ఏ డిగ్రీ పొందిన వారితోను సమానంగా పరిగణించడం జరుగుతుంది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని 'విద్యాప్రవీణ' [ఫైనల్] పరీక్షకు యం.ఏ. స్థాయిని, విద్యాప్రవీణ ప్రిలిమినరికి బి.ఏ. స్థాయిని ఇవ్వడం జరిగింది.

ప్రాచ్యభాషా పరీక్షలకు ఇంగ్లీషు డిగ్రీలతో సమాన స్థాయిని కల్పించాలని కేంద్ర సంస్కృత బోర్డు ప్రభుత్వానికి ప్రప్రథమంగా సూచించింది. ఈ బోర్డు సంస్కృతాభివృద్ధి విషయంలో ప్రభుత్వానికి అవసరమైన సలహాలను, సూచనలను ఇస్తు వుంటుంది.

ప్రతి విశ్వవిద్యాలయంలో విధిగా ఒక సంస్కృత పండితునినియమించాలని, అట్టి పండితునికి ఇతరఉపన్యాసకులతోపాటు జీతం తదితర విషయాలలో సమాన స్థాయిని కల్పించాలని, ఈ విషయమై కేంద్రప్రభుత్వం విశ్వవిద్యాలయాలకు తగిన సూచనలివ్వాలని ఈ బోర్డు సిఫార్సు చేసింది. హయ్యర్ సెకండరీ పాఠశాలలోను. కళాశాలలోను పని చేసే సంస్కృత పండితులకును ఆధునిక విద్యా పద్ధతులపై శిక్షణ పొందిన ఇతర అధ్యాపకులతో సమాన స్థాయిని కల్పించాలని కూడా ఈ బోర్డు స్పష్టం చేసింది.

వివిధ సంస్థలు నిర్విహించే ప్రాచ్యభాషా పరీక్షలకు విద్యారంగంలో సమాన స్థాయిని కల్గించాలని కూడా ఈ బోర్డు సూచించింది. భారత ప్రభుత్వం ఈ బోర్డు చేసిన సూచనలను

ఆమోదించి, ఈ విషయాన్ని పరిశీలించవలసినదిగా రాష్ట్ర ప్రభుత్వాలను కూడా కోరింది.

ఇండియా సంస్కృత విద్యా కేంద్రం నిర్వహిస్తున్న "శిక్షా శాస్త్రి" డిప్లొమా కోర్సుకు "రికగ్నేషన్" ఇచ్చే విషయమై పరిశీలించడం జరుగుతుందని విద్యామంత్రి శ్రీ బలరామిరెడ్డిగారు తెలియజేశారు. శ్రీ బలరామిరెడ్డిగారు శుక్రవారం నాడు ఈ విద్యాపీఠాన్ని తిలకించారు. ఈ విషయాన్ని విశ్వవిద్యాలయాలకు నివేదించడం జరిగిందని, ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ నివేదిక కోసం ఎదురు చూస్తున్నామని మంత్రిగారు పేర్కొన్నారు.

పరిశోధనా కార్యక్రమానికి అనువైన 10 వేల వ్రాత ప్రతులు విద్యాపీఠం గ్రంథాలయంలో వున్నాయని డైరెక్టర్ డాక్టర్ శర్మగారు పేర్కొన్నారు.

ఆంధ్రప్రభ 26-12-1965 ఆదివారం

# సంస్కృతోపాధి పరీక్షల గుర్తింపు

ఆర్యా !

ఉస్మానియా బి.ఓ.యల్. కు ఆంధ్ర 'విద్యాప్రవీణ'కు ఎం.ఏ. డిగ్రీతో సమాన ప్రతిపత్తినిస్తు రాష్ట్ర ప్రభుత్వము గుర్తించడం జరిగితే చాల సంతసించవలసిన విషయమే. కాని పైన పేర్కొనబడిన పరీక్షలే గాకుండా కేంద్ర ప్రభుత్వ విద్యా శాఖ సచివాలయమువారు విశాల దృష్టితో పరిశీలించి సంస్కృత వాఙ్మయాభివృద్ధికై ఆలిండియా (అఖిల భారతీయ) వివిధ సంస్థలు నిర్వహించే ప్రాచ్య భాషా ఉపాధి పరీక్షలలో ప్రిలిమ నరీ పరీక్షలను బి.ఏ. డిగ్రీతోను, ఫయినల్ పరీక్షల నన్నింటినీ ఎం.ఏ. డిగ్రీతో సమానముగా గుర్తించి ఆయా పరీక్షలలో నెగ్గిన వారికి ఎం.ఏ. డిగ్రీ వారికొసగబడు వేతనమునే వీరికిని ఇవ్వ వలసినదిగా అన్ని రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖాధికారులకుగూడ ఒక ఆదేశ పత్రమును పంపించినది.

కాని దురదృష్టవశాత్తు మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు ఇంతవరకు అంగీకరించకపోవడం వాల విచారకరమయిన విషయము. ఎల్ల భాషలకు సంస్కృతము మాతృభాషవంటిదని సర్వవిదితము. ఈ భాషను చక్కగా నభ్యసించిన వారు ఇతర భాషలను చక్కగా బోధించుటలో శక్తి సామర్థ్యములు మెండు



మదరసే ఆలియా జూనియర్ కళాశాలలో తెలుగు పండితుడిగా పనిచేసిన చిత్రము ప్రిన్సిపాల్ అసిదోద్దీన్‌గారి వెనుక భాగములో ఆశీనులైయున్నవారు పం॥ రాచవీరదేవరగారు

గానుండునని గుర్తించుట ఆవశ్యకము. అంతే గాకుండా మన వైదిక సంస్కృతియంతయు నీ వాఙ్మయమునందే నిబిడీకృతమై యున్నది.

సంస్కృత వాఙ్మయాభిరుచిని ఆధునిక యువతరము వారికి గలిగించుటకు ఇదియొక ఆశాకిరణము వంటిది. సంస్కృతము మృతభాషయను దురభిప్రాయమును కూకటి వ్రేళ్ళతో బెరిక్కివేయుటకిది మంచి యుపాయము.

పై విషయముల నన్నింటిని దృష్టియందిడుకొని మన ఆంధ్ర ప్రభుత్వము వారును విశాల హృదయముతో సెంట్రల్ గవర్నమెంటు వారంగీకరించిన లిస్టులోని మొత్తము (22) ఇరువది రెండు సంస్థలు సంస్కృతాభివృద్ధికై మిక్కిలి పాటుబడుచూ వచ్చిన ప్రాచీనమైన "వంగీయ సంస్కృత శిక్షా పరిషత్తు కలకత్తా" కాశి, తిరుపతి, ఉస్మానియా, ఆంధ్ర, మద్రాసు మున్నగు విశ్వవిద్యాలయముల ఓరియంటల్ టైటిల్స (సంస్కృతము) పరీక్షలను ఎం.ఏ. డిగ్రీతో సమానముగా నంగీకరించి, ప్రతియొక్క కాలేజి, హైయ్యర్ సెకండరీ పాఠశాలలో సంస్కృత పండితులనుగా నియోగించి వారికి ఎం.ఏ. డిగ్రీ వేతనముల నొసగి గౌరవించి ప్రోత్సహించగలరని యాశించుచున్నాను. మన విద్యామంత్రిగారీ విషయమై మిక్కిలి

శ్రద్ధ వహించుట ముదావహము.

ఇట్లు
**పి.ఆర్.వి. దేవర**
యాకుత్‌పుర, హైద్రాబాద్.

## సంస్కృత పరీక్షల పరిగణన

ఆర్యా :

కేంద్ర విద్యాశాఖ వారు ప్రకటించిన నంబరు ఎఫ్ 46-1/63 ఎస్.యు. తేది 23-1-1964 పత్రంలో అఖిల భారత విశ్వవిద్యాలయములకు సంబంధించిన, సంస్కృత పరిషత్తులకు సంబంధించిన, సంస్కృతోపాధి పరీక్షలలో ఆంధ్ర గవర్నమెంటువారు కేవలము మూడు విశ్వవిద్యాలయములకు సంబంధించిన సంస్కృతోపాధి పరీక్షలనే ఎమ్.ఏ.తో సమానముగా గుర్తించి మిగత వాటిని గుర్తించకపోవడము తమ పక్షపాతపు వైఖరినే ప్రదర్శించినట్లైనది, ఇది చాలా విచారకరమైన విషయము.

ప్రాచీన కాలమునుండియు సంస్కృత భాషాభివృద్ధికై నిరంతరము కృషిజేయుచు వచ్చిన కాశీ, కలకత్తా, వంగీయ సంస్కృత శిక్షా పరిషత్తులవంటి యు.పి. ప్రాంతపు పరీక్షలలో

పట్టభద్రులై అధిక సంఖ్యలో ప్రభుత్వపు విద్యాశాఖలో బహు కాలము నుండి ఉద్యోగముల నిర్వహించుచు వచ్చినవారి గతి యేమి ? ఇంతకు వీరి సీనియారిటీ (సర్వీసును) దెబ్బ తిన వలసినదేనా ?

కావున మరోసారి ఆంధ్ర ప్రభుత్వం వారు విశాల హృదయముతో పరిశీలించి, కేంద్రప్రభుత్వ విద్యాశాఖవారి పత్రములోని యన్ని పరీక్షలనన్నింటిని ఎం.ఏ. డిగ్రీతో సమానముగా గుర్తించి వారికిచ్చిన వేతనమునే ఆయా పరీక్ష లలో నెగ్గిన వారికిని ప్రసాదించగలరని గోరుచున్నాను.

కేంద్ర ప్రభుత్వము వారిచే గుర్తింపబడిన పరీక్షలన్నియు ఇండియాలో పేరు పొందిన ఆయా రాష్ట్రములకు సంబంధించిన గొప్ప సంస్కృత విద్వాంసులచే సిఫార్సు చేయబడి, ప్రభు త్వము వారిచే గుర్తించబడినవే, పోతే యోగ్యతలోను అన్ని పరీక్షలు సమానమైనవే. గొప్ప గొప్ప సంస్కృత లాక్షణిక గ్రంధములనే పాఠ్యభాగములుగా నిర్ణయింపబడినవే. ఇందెంత మాత్రము సంశయమున కాస్కారము లేదు.

మొత్తముపై అందరి యభిలాషయు సంస్కృత వాఙ్మ యాభివృద్ధికై పాటుబడుటయే కదా ! ఆ భాషరాని వారికిని, వచ్చిన వారికిని, ఉత్సాహమును కలిగించుటయే ముఖ్యోద్దేశమై యుండాలి. కావున తప్పకుండ పైచూపబడిన కేంద్ర జాబితా

లోని పరీక్షలన్నింటిని తప్పకుండ మన ఆంధ్రప్రభుత్వము వారంగీకరించి సంస్కృత భాషాభివృద్ధికై తోడ్పడగలరని ప్రార్థన.

పి. రాచవీరదేవర
హైదరాబాదు

ఆంధ్రభూమి 29-1-1966

## సంస్కృత పరీక్షలు

సంస్కృతోపాధ్ధి పరీక్షలతో కేవలం ఉస్మానియా, ఆంధ్ర, వేంకటేశ్వర, విశ్వవిద్యాలయాలకు సంబంధించిన బి.ఓ.ఎల్., 'విద్యాప్రవీణ', శిరోమణి పరీక్షలనే యమ్.ఏ. డిగ్రీతో సమానంగా గుర్తించి, మిగతా భారత ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు గుర్తించిన, అఖిల భారత విశ్వవిద్యాలయములకు, పరిషత్తులకు, సంబంధించిన సంస్కృత పరీక్షలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గుర్తించకపోవడం చాలా శోచనీయం.

మీదుమిక్కిలి ప్రాచీనం నుండి సంస్కృత భాషాభివృద్ధికి పాటుపడుతూ వచ్చిన కాశి, కలకత్తా. "వంగీయ సంస్కృత శిక్షా పరిషత్తుల" పరీక్షలలో పట్టభద్రులై, ఆంధ్ర

ప్రభుత్వ విద్యాశాఖలో చాలా కాలం నుండి పనిచేయుచున్న వారి గతేమిటి? వారి సర్వీసు సీనియారిటీ దెబ్బతినవలసిందేనా?

కావున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, విద్యాశాఖా కారులు విశాల దృష్టితో పరిశీలించి భారత ప్రభుత్వం అంగీకరించిన పరీక్షలన్నింటిని యమ్.ఏ. డిగ్రీతో సమానంగా గుర్తించి వారి కిచ్చే వేతనములకు సమానంగా వీరికిచ్చి సంస్కృత భాష యొక్క గౌరవ ప్రతిష్టలను నిలుపగలరని కోరుతున్నాను.

మొత్తముపై అందరి అభిలాష సంస్కృత భాష అభి వృద్ధి చెందుటే, భాషరానివారికి వచ్చిన వారికి ఉత్సాహం కలిగించుట ముఖ్యోద్దేశం. అందువల్ల ప్రభుత్వం, పై చూపబడిన కేంద్ర జాబితాలోని పరీక్షలను అంగీకరించి ఇతర పట్టభద్రులకు తోడ్పడ వలసిందిగా కోరుతున్నాను.

హైదరాబాద్ — పి. రాచవీరదేవర
సంస్కృత పండితుడు

ఆంధ్రజనతా 3-2-1966, గురువారము



# జ న వా ణి

## అధికార భాష

ఆర్యా !

ప్రస్తుతము అధికార భాషా గుర్తింపు విషయమున నలుగడల చెలరేగిన వివాదమును బహిష్కరించుటకు సంస్కృతమునకు ప్రాధాన్యత నొసంగుటయే శరణ్యముగా నున్నది. స్వాతంత్ర్యమును మనము సముపార్జించుకొనిన, మనకు సర్వజనామోదయోగ్యమైన, ఏదో ఒక భాషను జాతీయ భాషగా గుర్తించుట యత్యవసరము. అట్లని కొందరికనుమతయోగ్యమై మరి కొందరికి యసమ్మతికి కారణమైన హిందీని రాష్ట్రభాషగా గుర్తించుట భాషా పక్షపాతమే యగును. దీనివలన కొందరికి యన్యాయము జరిగియే తీరును, హిందీ మాతృభాషయైన యౌత్తరాహులకు మాత్రమే సంతోషదాయకమైనది. కానిదాక్షిణాత్యులకా భాష కొరకరాని కొయ్యవంటిది. ఐతే పరకీయ భాషయైన ఇంగ్లీషు మాత్రమే రాజకీయ భాషగానుండవలెనని నా యభిప్రాయము గాదు.

అటు ఔత్తరాదులకు, ఇటు దాక్షిణాత్యులకు, సన్నిహితమై అభిమానపాత్రమైన సంస్కృతభాష యుభయులకంగీకారయోగ్యమైనదే. సంస్కృతము నభ్యసించుటలో ఇరువురకునుగు

తూహలము మెండు, హిందూ జాతి సంస్కృతికి నిలయమై విశాల మైన భావములతోను, గంభీరములైన అర్థములతోడ నొప్పారు చున్న యీ సంస్కృతమునకు సాటియైన భాష మరొకటి ప్రపంచమునందు లేదని చెప్పవచ్చును. ప్రప్రథమమున బాశ్చాత్యులు గూడ సంస్కృతాన్యభ్యసించియే తమ విజ్ఞానాన్ని పెంపొందించుకొని యున్నారు. నేటికిని జర్మన్, జపాన్, ఇటలీ మున్నగు ప్రాక్ పశ్చిమ దేశములలో సంస్కృతానికి గొప్పస్థానము నొసగియున్నారు. అన్ని భాషలకు జనని వంటిది సంస్కృతము. ఆ భాషయందు అపారమైన విజ్ఞానము సాహిత్యము, శాస్త్రము, సంగీతము మున్నగు విషయము లన్నియు సముద్రములోని రత్నములవలె మఱుఁగునపడి యున్నవి.

సంస్కృతము మృతభాషయను భావన కొందఱి మెదడులో కరుడుగట్టుకొని యుండవచ్చును. కాని విజ్ఞులైన వారికిది యెంతయు సమ్మతమైనదికాదు. సంస్కృత భాష అమృతమువంటిది. కావున దానినాశ్రయించియే మనదేశ భాషలన్నియు పెంపొందినవి, అట్టి దానిని మనమెట్లు మృత భాషయని నిరూపించుకొనగలము? కొందఱు మహాశయులు సంస్కృతభాష అతికఠినమైనది. దానినే వాళ్ళభ్యసించినను సాధారణ జనులు మాట్లాడుకొనుట యసాధ్యము అని ప్రశ్నింతురేమో.

అందుకు నా సమాధానమియ్యది. ఆంగ్లేయులు మన దేశము నాక్రమించుకొని తమ మాతృభాషను మనదేశము వారికి నిర్బంధ పఠనీయము గావించియుండిరి. లేదా ఆ కాలమున ఇంగ్లీషు నభ్యసించినవారికే ప్రభుత్వము ఉద్యోగముల నిచ్చుచున్నారను యాశచేత మనవారు కొందఱు నేర్చుకొనియున్నారు. కాబోలు ఇట్టి భాషా వ్యామోహమునబడిన వారెందరున్నారు? సక్రమముగా పాశ్చాత్యులవలె ధారాళముగా వ్యాకరణ దోష రహితముగా యెందఱు మాట్లాడగలుగుచున్నారు ?

మనవారు రెండు వందల సంవత్సరములు గడచినను ఇతరతరులకాంగ్ల భాష. ఈ దేశంలో సర్వజన సాధారణభాష కాలేకపోయినదిగదా ? ఆంగ్లము గూడ అతికఠినమైన భాషయే కదా ?

ఒకవేళ సంస్కృత భాషాశిక్షణకై అన్ని సౌకర్యము లను గల్పించినచో మనవారుగూడ అచిరకాలములోనే నిరర్గళ ముగా మాట్లాడ నేర్చుకొనెదరు. ప్రతిభాషయందును సంస్కృత పదజాల మెక్కువగా వ్యాపించియున్నది. ఇందుకు కారణము భోజరాజు కాలమున మన దేశములో సామాన్యుడు గూడ సంస్కృతములోనే మాట్లాడుచుండిరని చరిత్ర చెబుతున్నది. దేనికైన రాజాశ్రయమత్యవసరము. అట్లాశ్రయం లభించిన సంస్కృతము జన సామాన్య భాషయగుటలో సందియము లేదు.

సంస్కృతాన్నభ్యసించిన వారికి ఉన్నత యుద్యోగ ముల గల్పించడముగాని, వేతనముల హెచ్చించడముగాని లేదా కనీసము ఉచిత వేతనముల నొసగుట గాని చేసి ప్రభుత్వము ఏ సదుద్దేశముతో ప్రయత్నించినచో తప్పకుండ జనులందరు దానినే యభ్యసింతురు. సంస్కృతానికి రాజాశ్రయము లేక సరియైన దోహదములేని కతముననే నేడా భాష వ్యాప్తిలోలేదు.

అంతే గాకుండ మనకుపయోగకరములైన ప్రమాణ గ్రంధము లన్నియు సంస్కృతమునందే గలవు. ఇంగ్లీషున కుండే గౌరవము. పదగాంభీర్యము విపులార్థమునిచ్చు పద జాలము విజ్ఞానరాసుల కాలవాలమైనది, సంస్కృతము. కావున సంస్కృతమే సర్వవిధముల అధికార భాషయగుటకు దగినది. సులభముగా నేర్చుకొను మార్గముగూడ యిందు గలదు. హిందీ ఇంగీషు భాషల వివాదములను దీర్చుటకు సంస్కృత భాషను అధికారభాషగా గుర్తించుటే ఏకైక పరిష్కారమార్గము.

పి. రాచవీర దేవర

సంస్కృతం తెలుగు సీనియర్ పండిట్ హైదరాబాద్.

ఆంధ్రభూమి పత్రిక గురువారం, మార్చి 7-1968

## జనవాక్యం

## సాహిత్య అకాడమీ ప్రచురణలు

ఆర్యా!

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు తక్కువ వెలకు ప్రకటించే ప్రాచీన సాహిత్య ప్రచురణలు సామాన్య చదువరులకు ప్రయోజకారి యగునట్లు ప్రకటించుటలేదు. పండితులు కాస్త శ్రమయను కొనకుండా కనీసము పద్యకావ్యములకు కఠినార్థములు లేదా లఘు టిప్పణిగాని, వ్రాసి ప్రకటించినచో సామాన్య జనులకు కూడా యుపకరించినట్లగు చుండెడిది. అట్లోనర్చకపోవడము చాలా విచారకరము.

కేవలం ప్రాచీన కావ్యములను యథాతథముగా కొత్తగా ముద్రించుట సామాన్యులెవరైనను చేయవచ్చునుగదా! గ్రంధ ముద్రణయందు అసలు గ్రంధము పేజీల కంటే ఉపోద్ఘాతపు పేజీలు ఎక్కువగా ప్రచురించుట వలన పేజీలనుబట్టి వెలను హెచ్చించుచున్నారు. డబ్బు గడించుటకిదొక సాకు కాదుకదా?

ఈ ఉపోద్ఘాతమున కంటె లఘువ్యాఖ్య గాని, లేదా కఠినార్థములతోగాని ప్రచురించినచో అకాడమీవారు జనులకెంతో మహోపకారము చేసిన వారగుదురు.

హైదరాబాద్ — పి. రాచవీరదేవర

ఆంధ్రభూమి. శుక్రవారం ఫిబ్రవరి 7, 1969

# భాషా పండితుల గ్రేడ్ల సమస్య

ఆర్యా !

కోఠారికమిషన్ వేతన సిఫారసులలో సమస్త ఉపాధ్యాయులతో పాటు ప్రత్యేకముగా ఓరియంటల్ టైటిల్ పట్టభద్రులైన సంస్కృతాంధ్ర హిందీ మున్నగు పండితులపట్ల శ్రద్ధ విషయమును అందులో పేర్కొనకపోవడము చాల విచారకరం.

ఇంతవరకు ఆయా ఓరియంటల్ టైటిల్స్ పరీక్షలను ప్రభుత్వపు బి.ఎ.బి.ఇ.డి. పరీక్షలతో సమానముగా గుర్తించి వారివారి యోగ్యతల ననుసరించి వారికి ఉచితమైన గ్రేడ్ల నొసగి భాషాపండితుల గౌరవ ప్రతిష్ఠలను కొంతవరకు కాపాడియున్నారు.

కాని అదే యోగ్యతలుగల కొందరు పండితులకు కొన్నాళ్ళ నుండి సరియైన గ్రేడ్లు లభించనందున వారెల్లరు తమ తమ విచారముల వెలిబుచ్చుచున్నారు.

ఉదా : ఈ వరకు బి.ఓ.ఎల్. పరీక్షలో నెగ్గినవారికి కొందరికి బి.ఎ.బి.ఇ.డి. గ్రేడు నొసగి యున్నారు. ఇదే యోగ్యతగల మరి కొంతమంది పండితులకు జూనియరు గ్రేడు నొసగి వందరూపాయల బేసిక్ వేతనం ఇవ్వడానికి కూడా ప్రభుత్వము వారు ఇటీవల అభ్యంతరం తెల్పుచున్నది

మరి కొందరికి సంస్కృత ఓరియంటల్ టైటిల్స్ పరీక్షలను ఇండియా గవర్నమెంటు విద్యాశాఖ సచివాలయం వారు అభిమానించి, సంస్కృత భాషను పోషించి,దానినిగౌరవించుటకై భారతదేశములో చలామణియగుచున్న వానినన్నింటిని ఎం.ఏతో సమానమని గుర్తించి యున్నప్పటికి, స్టేట్ గవర్నమెంటు విద్యాశాఖవారు ఆమోదించక సంస్కృతాంధ్ర పండితుల వేతనాభివృద్ధికి నిరోధము కలిగించుచున్నారు.

ప్రాంతీయ భాషలోనే ఇకముందు విశ్వవిద్యాలయలన్నింటిలో బోధన జరుపవలెనని విద్యాశాఖామాత్యులు మున్నగువారు ప్రతిపాదించుటలో యెంతటి ఔచిత్యముగలదనుటకు మున్ముందు కోఠారికమిషన్‌కు తన సిఫారసుల మేరకు పండితులకుచితమైన గ్రేడ్లను ప్రసాదించుట యందు వ్యక్తము కాగలదు. కావున భాషాపండితులకు ప్రాధాన్యతనిచ్చి రాబోవు జూనియరు కాలేజీలలో వారివారి యోగ్యతలను బట్టి గ్రేడ్లను ప్రసాదించగలరని ప్రభుత్వమునకు మనవిజేయుచున్నాను.

హైదరాబాదు — పి. రాచవీరదేవర

ఆంధ్రభూమి గురువారం 18-9-69 "జనవాక్యం"

# "జూనియర్ కళాశాలల్లో బోధన గ్రాంధిక భాషలోనే జరపడం సముచితం"

## ఉపాధ్యాయ పండిత పరిషత్తు ప్రధాన కార్యదర్శి

## పి. రాచవీరదేవరగారి ప్రకటన

హైద్రాబాదు, ఫిబ్రవరి 13

ఆంధ్రభూమి తేది 14-2-1970 శనివారం

గ్రాంధిక భాషాస్థానాన్ని గురించి వివరిస్తూ "మన ఇండ్లలో పిల్లి, కుక్క, పశువులకెట్టి స్థానము నొసంగవలెనో అట్లే వ్యావహారిక భాషకాయాస్థానముల నొసంగక తప్పినది కాదు." అని ఉపాధ్యాయ పండిత పరిషత్తు కార్యదర్శి తెలుగు సీనియర్ పండితుడు అయిన శ్రీ పి. రాచవీరదేవరగారు ప్రకటించి యున్నారు.

ఆయన ప్రకటన పూర్తి పాఠం ఈ విధంగా ఉన్నది :..

ఈ నెల 6వ తేదీ శుక్రవారము ఆంధ్రభూమిలో "గ్రాంధిక భాషకు ప్రాచీన గ్రంధాలలో దప్ప వ్యవహారములో స్థానము లేదు" అను శీర్షికతో ప్రకటించిన ఉస్మానియా యూని వర్సిటీ భాషా శాస్త్రములో అధ్యాపకులైన శ్రీ డా॥ చేకూరి రామారావుగారు వ్రాసిన లేఖను దిలకించితిని.

ఖతే వారు గత నెల 25న ఉపాధ్యాయ పండితః పరిషత్తు వార్షికోత్సవ సందర్భమున యధ్యక్ష పీఠమునలంకరించి యుండిన ఆచార్య శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు సెల విచ్చిన విషయమును సమగ్రముగా దెలసికొననిదే తొందరపడి వారు ఈ విధముగా శ్రీవారి సందేశముపై విమర్శ వ్యాఖ్య వ్రాయడము అంతగా సముచితమనిపించదు.

శ్రీ అవధానిగారి యాశయము ప్రకారము వ్యావహారిక భాషను బొత్తిగా గ్రాంధికముగా మార్చవలెనని గాదు. తామా శించిన గ్రాంధిక భాషలోనైనను, శకటరేఫలు, ''అరసున్న లుండి తీరవలెనని వారి పట్టుదల గాదు. ఐతే కొందరు మహాను భావులు రాబోవు జూనియర్ కళాశాలల్లోని బోధనాభాష వ్యావ హారికముగా మార్చుటకు ప్రయత్నించుచున్నారు. గనుక శ్రీవారు బోధనాభాష గ్రాంధికముగానె యుండిన బాగుండునని దమయాశయమును ప్రకటించియున్నారు. అందును భాషా బోధనయందు మాత్రమే గ్రాంధిక భాషకు ప్రాముఖ్యత నొసగి మిగత సైన్సు గణితము, మున్నగు నితర విషయములలో సామాన్య గ్రాంధిక భాషలోనే బోధన గరిపిన బాగుండుననిరి. ఇందుకు వ్యతిరేకముగా గ్రాంధిక భాషకు బొత్తిగా స్వస్తిజెప్పి కేవలము వ్యావహారిక భాషనే పట్టుకు ప్రాకులాడినచో నేడు భాషకుండిన గౌరవము అంద, చందములు, నుడికారపు సొంపు - భాషా పటిమ, భాషా సౌష్టవము లంతరించుననుటలో సంది

యము లేదు. మన తెలుగు భాష విషయమటుంచి యితర భాషల వైపు మనము కాస్త దృష్టిని సారించినచో నీ విషయము తేటతెల్లము గాక మానదు. ఉన్నత పాఠశాలలో బి.ఎ. పట్ట భద్రులను లేదా ఎమ్.ఎ. పట్టభద్రులను అధ్యాపకులుగాను కళాశాలలలో ఎమ్.ఎ. ప్రథమశ్రేణి లేదా పి.హెచ్.డి. పట్టం కల వారిని ఉపన్యాసకులుగా నియోగించుట యెందులకు? సామాన్యముగా పత్రికలను జదివి రేడియో ప్రోగ్రాములు విని భాషాజ్ఞానము నార్జించుకొనిన వారినచట బోధకులనుగా నియో గించిన సరిపోయెడిదేమో! ఇక ఉన్నత విద్య నభ్యసించిన శ్రమయంతయు వృథాయే కదా!

అట్లు గాకుండా ఏ భాషకైనను నొక ప్రత్యేకత యుండి తీరును, గనుక ఈ వాదమును ప్రతి యొక్కరంగీ కరింపక తప్పినది కాదు. ఆ భాష యొక్క తీరు తెన్నులు, భాష సౌందర్యములను దెలిసికొనుటకు గొంత యాకాంక్షను మానవునిలో గల్పించనిచో భాషా మాధుర్యము, జగి. బిగువులు చెడిపోవుట తథ్యము.

ఉదా: కావ్య కన్యయొక్క సౌందర్యము (లావణ్య మును) వస్త్రాద్యలంకారములతో గొప్ప పఱచనిదె నగ్నత్వ మును వ్యక్తపరచినచో నాకావ్యకన్యయొక్క వన్నెచిన్నెలను (సౌందర్యమును) దిలకించవలెనను గాంక్ష యెవరికిని గలుగదు.

గదా ! అదేమాదిరి తెలుఁగు భాషకు గొంత యర్థగాంభీర్యము. పటుత్వములెంతేని యవసరము, గ్రాంధిక భాషా ధన స్థాన మున వ్యావహారిక భాషా బోధనకై కృషి సల్పిన ఆపూర్వపు సిద్ధాంతములోనిపస యీ భాషకు అబ్బదు, వ్యావహారిక భాషకై పూర్వములో బ్రాకులాడిన పెద్దలు కొందఱు . కొక్కొండవారి మరియు శ్రీ వేదంవెంకటరాయ శాస్త్రిగార్ల పాండిత్యమును విమ ర్శించినది నాటి పరిస్థితులుఅట్లుండెను. నేడట్టి వానికిక్కడ స్థానము లేదు. ఆధునిక విద్వల్లోకము వారివారి యోగ్యతలను జక్కగా గుర్తించుచున్నది.

ఇకపోతే వ్యావహారిక భాషకెట్టి స్థానముండవలెనో లోక మింతకు బూర్వమే నిర్ణయించియున్నది. మనుష్యులు దమతమ గృహాల్లో మాట్లాడు కొనునప్పుడు సర్వసాధారణముగా వ్యవ హారిక భాషనే వాడుటకద్దు. అక్కడ గూడ గ్రాంధిక భాషా ప్రకారము "అయ్యా! మాయింట్లో తండులంబులు నిండుకొనయె కాన నేడు పొందు యెల్లిరండు" అనియెట్టి పండితుడునంగీ కరింపడు. మన యిండ్లల్లో పిల్లి, కుక్క, పశువులకెట్టి స్థానము నొసగకతప్పినదికాదుగదా! మనుష్యులు త్వరలో తాము సగౌరవ ముగా మాట్లాడు కొనునప్పుడు పదములను తూచితూచి యుచ్చ రించుట కొందరు విజ్ఞులు బాటింతురు. ఐతే ఇంట్లో జ్ఞాతులతో స్నేహముగా మాట్లాడు కొనునప్పుడుగాని, లేదా స్నేహితులు



మలక్‌పేట బి. కాలనీ శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవ సందర్భ
మున ఆం. ప్ర. వీరమహేశ్వర (జంగమ) మహాసభాధ్యక్షులవారు
ఉపన్యసిస్తున్న దృశ్యం



14-7-91న వి.వి. హాస్టలులో ఆం.ప్ర. వీరమహేశ్వర (జంగమ) మహాసభ జరిగిన ఎన్నికలలో వే. పం. రాచవీరదేవరగారిని అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నుకొన్నప్పుడు, శ్రీ కె. మదన మోహనగారు ఉపన్యసిస్తున్నారు.



ఆం ప్రం. ఉపపరిషత్తు వారు జరిపిన రజతోత్సవ సందర్భమున శ్రీ ఆళ్వారుదాసుగారు ఆం. ప్ర. విద్యాశాఖామాత్యులు. శ్రీ డా. దివాకర్ల వెంకటావధానిగారిని సన్మానిస్తున్నారు.



వే॥పం॥ రాచవీరదేవరగారు తన మనుమరాలైన
చి॥ పి.ఎస్. ఉమారాణికి అక్షరాభ్యాసము చేయించినది



పండిత పరిషత్తు పక్షమున జరిపిన సన్మానసభలో శ్రీ సన్నిధానం
సూర్యనారాయణశాస్త్రిగారు శ్రీ పెరవల్లి లింగయ్య శాస్త్రిగారు

బరస్పరముగా సరసాగ మాట్లాడుకొనునప్పుడుగాని, మాట్లాడు భాష గ్రాంథికము పయోగింపవలెను కాదు.

ఆయా భాషలాయా స్థానములందే యుపయోగింపబడును. అట్టి సందర్భమందు గూడ గ్రాంథిక భాషను వాడుట రసాభాసముగానే యుండునుగదా! వ్యవహారిక భాషలో దేశీ విదేశీ, గ్రామ్యపదజాలమును యథేచ్ఛముగా వాడుట కవకాశముకద్దు. కాని గ్రాంథిక భాష యందట్లుగాదు. దానికొక పరిధిగలిగి వ్యాకరణము ఛందోబద్ధమై యుండుటచేత భాషయొక్క రూపు రేఖలు సర్వతోముఖముగా ఏర్పడియున్నది.

ఆహారమునందేర పత్రికలోని భాషను పత్రికలకనువుగా నుండునట్లుగా వాడుట, రేడియోలోని భాష రేడియో కనువుగా నుండునట్లుగానే వాడుట, సముచితముగా నున్నది. ఏలన వాటిలోనిభాష పండిత పామరుల కామోదయోగ్యమైనదిగా నుండవలెను.

ఉన్నతపాఠశాలలలో విద్యనభ్యసించు విద్యార్థులు ప్రౌఢ విద్యాభ్యాసమునకై యందు జేరుదురుగదా! గనుకఅట్లువారి యోగ్యత ననుసరించియుగానె గ్రాంధిక భాషలోనె బోధన గరుపుట మిక్కిలి యుచితముగా నుండును. ఇంతవరకు అంతటి కట్టుదిట్టాలకులోనై ప్రౌఢవిద్య నభ్యసించుటవలననే మన తెలుఁగుభాష

కొంతవరకు ప్రౌఢతను సంతరించుకొనియున్నది. అట్టి ప్రౌఢ భాషనుకొందరు విజ్ఞాన వంతులాకళింపు జేసికొనుట చేతనే నేటి తరము నాట యువతీ యువకులు భావకవిత్వమును మరియు గ్రాంథిక కవిత్వమును మలచి, గుండె నిబ్బరములతో సభల యందలి వేదికలయందు నిలచి తమ యుత్తమ భావములను ప్రకటించుచున్నారు. విద్యార్థులలో కొందరు సమాధానము వ్రాయునప్పుడు గూడా గ్రాంధిక భాషను వ్రాయుచున్నారు. అది యటుంచి, నేడు గ్రాంధిక భాషయభివృద్ధిగాంచలేదని శ్రీ రామారావుగారు ఎదపై హస్తము నిడుకొని చెప్పగలరా? కేవలము వ్యావహారక భాషకే ప్రాధాన్యతి నొసగినచో నేడీ యుచ్ఛస్థితి భాషకల వడుతుండెడిదికాదు.

ఇక ఆచార్య శ్రీ వెంకటావధానిగారు కొంత వరకు ప్రాంతీయాభిమానమును మరియు రాజకీయ దృష్టిని ప్రదర్శించి యున్నారనుటలో పసలేదు. వారు సమస్త విద్వల్లోకమునకు సముచితమైన మార్గమును జూపియున్నారేగాని, వారిలో నీసంకుచిత భావము గోచరింపలేదు. ఆ కారణముచేత వారి యుక్తియుక్తమైన ఉపన్యాసమును నాటి సభికులెల్లరు కరతాళ ధ్వనులచేత తమయామోద సంతోషములను ప్రకటించి యున్నారు. వ్యావహారిక భాషను కళాశాలలో ప్రవేశ పెట్టడము చేత గలుగు నర్థములను స్వప్రమాణములతో

చూపెట్టియున్నారు. నిజమైన పరిపూర్ణమైన పాండిత్యముగల వారు ఎన్నడును గ్రాంథిక భాషాబోధనను దిరస్కరించరు.

ఐనను భాషయొకరిసొత్తు గాదుగాదా! అది తెలుఁగు గడ్డపై నివసించుచున్న మనయందరి సొత్తుగనుకనే యాభాష యొక్క గౌరవమును, సొంపు పెంపులను, ప్రౌఢతను రక్షించుటలో మన యందరి ప్రథమ కర్తవ్యమై యున్నది. కావున రాబోవు జూనియర్ కళాశాలల్లోను, బోధనాభాష గ్రాంధికముగా నుంచుటయే సముచితముగా నుండునని నాయాశయము.

## లంచగొండి తనాన్ని నిర్మూలింప జేయాలి

గోలకొండపత్రికా సంపాదకులకు.

అయ్యా!

మన కాంగ్రెసు నాయకులు సత్యాహింసలకు పాటుబడి అహోరాత్రులందు అనేక కష్టముల నెదుర్కొనితమ జీవితములనే ధారపోసి స్వాతంత్ర్యము గడించియున్నారు. తరువాత భారత ప్రభుత్వము తీవ్ర చర్యతీసుకొని ఈ హైదరాబాదునందు దిన దినము చెలరేగుచున్న నిరంకుశ విధానమును అణచి వేసి అనేక కష్టములకు లోనగుచున్న మనల్ని సమయానికి కాపాడి బ్రతి

కించినది. ఈ సమయములో గోలకొండపత్రిక గూడ ధైర్య సాహసములతో వాస్తవాలను ప్రకటించి ప్రజలకు సహాయము చేసినది.

హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో లీనమైన తర్వాత కొలదిరోజులకు ప్రజానాయకులు ప్రజా శ్రేయస్సుకై కావల్సిన నా నా విధములైన సౌకర్యములను గురించితర్క వితర్కములను జరిపి పౌరసత్వ హక్కులను క్రమక్రమముగా అమలులో బెట్టుచున్నారు.

ఇట్టి సత్యాహింసల సంగ్రామముతో సంపాదించిన మన నైజాము రాష్ట్రమునందు ప్రభుత్వ శాఖల కొన్నింటిలో లంచము తీసుకోవడము దిన దినము అభివృద్ధి పొందుట శోచనీయము. ఇట్టి విధానమును విమర్శించిన పూర్వస్థితి కంటెను పదిరెట్లు హెచ్చించినదని ప్రజలు వాడుకుంటున్నారు. ఈ లంచగొండి తనమును చూచిన అమాయక ప్రజలు మొదటి స్థితియె చాల బాగుండెనని నుడువుచున్నారు.

బీద ప్రజలు ఏమైన తమ విపత్తును ప్రభుత్వము ఎదుటవెలి పుచ్చుకొందమని దరఖాస్తులు పెట్టుకొందమనినను మధ్యనున్నవారు అడ్డగించి వారి కార్యములను ఉద్దేశములను నష్టపరచుచున్నారు. పాపము వారిని తృప్తిపరచుటకు సరియైన డబ్బు, పొట్టనిండయన్నము, మైనిండ గుడ్డలు, లేనివారలయొద్ద అంత డబ్బు ఎక్కడిది ?

దేవుని దర్శనము చేసుకొనుటకై మొదలు పూజారులకు కొద్దిడబ్బులు చెల్లించిన తరువాత వారి యనుగ్రహమువలననే దేవుని దర్శించి అక్కడ గూడ మన కార్యము సిద్ధించడానికై టెంకాయల నెట్లు అర్పించుకోవలెనో, అదే మాదిరిగా కొందరి ప్రభుత్వాధికారుల దర్శన భాగ్యము గల్గుచున్నది. ఎవరైతే దక్షిణల నర్పించుకుంటున్నారో అట్టి వారి కార్యములు అన్యాయముల నవలంబించినవైనను తేలికగ అనుకూలించుచున్నవి. కాని బీద ప్రజల న్యాయసమ్మతమైన మొరలు నిష్ఫలమౌచున్నవి. కోర్టు, తహశీలులో బీదల కేసులను గురించి వాయిదాలు జరుపడడములో వీరు డబ్బులు షాహుకార్లవద్ద తెచ్చి వ్యయపరచుకొనినను, అనేకసార్లు తిరిగినను, వారిపనులు సక్రమముగా జరుగుటలేదు.

ఇట్టి ఇబ్బందులు వాహనశాఖ, పోలీసుశాఖా, విద్యాశాఖ, ఇత్యాది డిపార్టుమెంటుల్లో విచ్చలవిడిగా అతి కీలకమైన కొద్ది స్థానాల్లో జరుగుచున్నవి. ప్రజల ఆపత్తులను దీర్చి, వారి సుఖ పెంపబడిన ఈ రాజ్యాంగములో ఈ లంచగొండులను నిశితమునకై నిర్దాక్షిణ్యముగా శిక్షించి, పదచ్యుతులనుగా జేయక అలానే యుంచిన, ఇట్టి వారిలోనే వీరి మార్గమునే ఇతరులు అవలంబించిన "పెద్ద పాములు చిన్న పాములను, పెద్ద చేపలు చిన్న చేపలను మ్రింగునట్లు" ప్రజల డబ్బులను మ్రింగుచు మన రాజ్యాంగమును పాడుచేయుదురని నిస్సందేహముగా చెప్పవచ్చును.

శ్రీ మహాత్మాగాంధీ, నెహ్రూలు ఇత్యాది అధినాయకుల సత్యాంహిపాలనా రామరాజ్యములో ఈ లంచగొండి తనము తాండవమాడుచున్నదనిన చాలా శోచనీయమైన విషయము.

ఈ వ్యవహారముచే ఆహార ధాన్యముల ధరలు హెచ్చించుటచేత బీదప్రజలకు కడుపునిండ అన్నము గూడ లభించుటలేదు.

కాబట్టి ఈ విషయమై ప్రభుత్వము వెంటనే తీవ్రముగా జోక్యము కల్గించుకొని, బీదప్రజల ఉద్దేశములను కార్యములను పూర్తి జేయకుండ ధనమును దిగ మింగే ఈ దుష్టశక్తులను శోధించి, త్వరలోన శిక్షింపజేసి రాజ్యాంగమును చక్కపరిచిననే మంచిది లేనిచో చాలా ప్రమాదము వాటిల్లి, ఇది మనరాష్ట్రము నకు ఆపయశస్సును తప్పకుండ లభింపజేయును. కావున తీవ్ర ముగా లంచగొండి తనాన్ని నిర్మూలింపజేయవలెనని ప్రభుత్వ ముతో ఈ దీనుల ప్రార్థన.

ఇట్లు

**పం॥ రాచవీర దేవర, ఆల్లాదుర్గము**

గోలకొండ పత్రిక శుక్రవారము 18-8-72

## వీరశైవ సాహిత్య సాంస్కృతిక సంఘం

హైదరాబాద్, జనవరి 22 :

చందూలాలుబారాదరి కాలనీలో శివశ్రీ కారంజిచంద్ర మౌళిగారి గృహంలో "వీరశైవ సాహిత్యసాంస్కృతిక" సంఘ సభ్యులు సమావేశమై శ్రీ కాసుల సర్వేశ్వర్‌రావుగారిఅధ్యక్షతలో నీ దిగువ అడహాక్ కమిటీ కార్యకర్తలను, కార్యవర్గ సభ్యులను, సలహా సంఘ సభ్యులను, ఏకగ్రీవముగా ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు శివశ్రీ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" ఉపాధ్యక్షులు శివశ్రీ బి.పి. వీరభద్రగౌడు, ప్రధాన కార్యదర్శి శివశ్రీ కె. గౌరప్ప, సహాయ కార్యదర్శి శివశ్రీ కారంజిచంద్ర మౌళి, కోశాధ్యక్షులు శివశ్రీ ఎస్. రాజశేఖరస్వాములు.

ఆంధ్రభూమి 23-1-73

## జో గి పే ట

జోగిపేట హయి స్కూలు విద్యార్థులు, స్థానిక గ్రంథాలయ సభ్యులు, పౌరులు, ఆరవ స్వాతంత్ర్య దిన సందర్భమున ప్రభాత్ ఫేరీ గావించిరి. ఉదయము ఎనిమిది గంటల నుండి

అన్ని ప్రభుత్వ ఆఫీసులతో పాటు కాంగ్రెసు తాలూకా కార్యాలయము స్టూడెంట్ యూనియన్ మరియు గ్రంథాలయము ముందు జాతీయ పతాకారోహణము జరిగెను. సాయంత్రము శ్రీ జి. హన్మంతరెడ్డిగారి (స్థానిక తహసీల్దారు) అధ్యక్షతలో శ్రీ జోగినాథస్వామి ఆంధ్ర గ్రంథాలయమునందు బహిరంగసభ గావించబడెను. శ్రీ శ్రీపతిరావు, (తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు) శ్రీ బసవమాణయ్య, (తా॥ సోషలిస్టు పార్టీ) కార్యదర్శి శ్రీ ఎం. రుక్నొద్దీన్ (వకీలు) శ్రీ కంది నాగయ్య, శ్రీ ఆళ్వారు స్వామి, శ్రీ జి. సంగమేశ్వర్ శ్రీ రాచవీర దేవర, (పి.డి.ఎఫ్. వర్కర్) శ్రీటి.వి. నారాయణ (ఉపాధ్యాయులు) వారల వుపన్యాసములు, పార్టీ విభేదాలు విస్మరింపబడి జరిగినవి. "ప్రతివారు యితరులేమి చేయుచున్నారో అని లెక్కబెట్టకుండ, మొదలు తానేమి చేయుచున్నానని ఆత్మవిమర్శ గావించుకొని నేటి సమాజోన్నతికై పాటుపడదీక్ష బూనవలసిన దినమని" సభాధ్యక్షుల వారు తమ వుపన్యాసములో పేర్కొనిరి.

## సదాశివపేటలో మహేశ్వరదీక్షా సంస్కారములు

సదాశివపేట, ఏప్రిల్ 7 : మార్చి 24 న

సదాశివపేట పెద్దమఠములో శ్రీ మ.ని.ప్ర. జగద్గురు శ్రీస్వామి విరూపాక్షానంద సంస్థాన మఠము కోడన్‌గల్లుగారి పర్యవేక్షణలో మహేశ్వరదీక్షా సంస్కార కార్యక్రమములు

వే॥ పం॥ శ్రీ రాచవీరదేవరగారి పుత్రద్వయము చి॥ బసవరాజదేవర మరియు చి॥ ప్రభులింగదేవరకు **సదాశివపేట** పెద్దమఠములో కారణ సంస్కారములు (అయ్యాచారాలు) జరిగిన దృశ్యము





పం॥ రాచవీరదేవర గారు నిర్మించి ఆవి ష్కరించిన జగ ద్గురు శ్రీ రేణుకా చార్యులవారి విగ్ర హము - లింగోద్భ వము



19-10-91 చి॥ ప్రభులింగదేవర ఎమ్.ఎ.ఎమ్.ఫిల్‌గారి వివాహం కుమారి జయదేవితో వి.వి. హాస్టలులోజరిగిన దృశ్యము

జరిగినవి. శ్రీ మ.ని.ప్ర. నీలకంఠ స్వాములవారు వీరశైవ షట్స్థల పతాకారోహణము చేశారు. పం. శ్రీ రాచవీరదేవర పెద్దమఠము యం.ఓ.యల్. తీర్థగారు, షట్స్థలధ్వజము యొక్క ప్రాశస్త్యము గురించి విపులముగా మాట్లాడారు.

శ్రీ శ్రీస్వామివీరభద్ర శివాచార్యులు బృహన్మఠము హల్లూరుగారి (మైసూరు స్టేట్)చే వీరశైవ ఆగమోక్తముగా మహేశ్వర వటువులైన చి॥ పి. బసవరాజ దేవర తండ్రి శ్రీ పి. రాచవీరదేవరగారి ప్రథమ పుత్రుడు, చి॥ పి. ప్రభులింగ దేవర తండ్రి శ్రీ పి. రాచవీరదేవర ద్వితీయ పుత్రుడు, మిగతా కొందరు వటువులకును మహేశ్వర దీక్షా సంస్కారము జరుప బడినది.

మధ్యాహ్నము జంగమార్చన, తీర్థప్రసాదముల వితరణము, అన్నప్రదానము జరిగినది.

సాయంత్రము శ్రీమన్నిరంజన ప్రణవ స్వరూపులైన జగద్గురు శ్రీ స్వామి విరూపాక్షానంద సంస్థానమఠము (కోడన్ గల్లు)గారి అధ్యక్షతలో క్రిందిగువ కార్యక్రమములు నెరవేరినవి. పం. శ్రీ రాచవీరదేవర ప్రార్థనతో సభాకార్యక్రమము ప్రారంభమైనది. శ్రీశ్రీ స్వామి వీరభద్ర శివాచార్యులవారి యమృత హస్తముతో అఖిలభారత శివానుభవ సంస్థ శాఖ (ఆంధ్రప్రదేశ్)కు ప్రారంభోత్సవము జరిగినది.

పూజ్యశ్రీ షడరకవి దేశికేంద్ర శివాచార్యులవారు శ్రీ మ.ని.ప్ర.జ. స్వామి విరూపాక్షానందులవారి యనుమతిని గొని ప్రాచ్య కళాశాల యొక్క వుద్ఘాటనం చేసారు. సంస్కృత భాష ప్రాముఖ్యతను విశదీకరించారు.

శ్రీ మ.ని.ప్ర. పూజ్యశ్రీ చంద్రశేఖర మహాస్వాములు పాసన్నపేటగారు పం. శ్రీ రాచవీరదేవర (ఎం.ఓ.ఎల్) తీర్థ గారిచే రచింపబడిన "నేనెవరు"? అను గ్రంథం ఆవిష్కరించిరి. గ్రంథకర్త ఆ గ్రంథంను చదివి శ్రోతలకు వినిపించారు.

శివశ్రీ శెట్టిరేవప్ప మాజీ మునిసిపాలిటీ చైర్మన్ శ్రీ పాల్కురికి సోమనాథ కవి సాహిత్యంలోని శివానుభవ తత్వములను గురించి మాట్లాడారు.

శివశ్రీ శిలమునాగలింగము, శివశ్రీ చంద్రశేఖరు, శివశ్రీ సుబ్బణ్ణగారు ఉపన్యసించారు.

శ్రీ శెట్టిరేవప్ప కృతజ్ఞతాభివందనములతో మరియు శాంతిపాఠంతో నాటి సభా కార్యక్రమం ముగిసినది.

ఈ కార్యక్రమం యొక్క నిర్వాహకులుగా శ్రీయుతులు శిందోలు వీరప్ప, గందిగిసిద్రామప్ప, కస్సెట్టి విశ్వనాథము, తోటసదాశివుడు, తోట శివనాగప్ప. వకీలు

గారు, హెచ్. కల్లప్ప, తేర్దెళ్ళి బక్కప్పగారు, మున్నగు వారు వ్యవహరించారు.

ఆంధ్రజనత 8 ఏప్రిల్ 1972, శనివారం

## సదాశివపేటలో ప్రాచ్య కళాశాల ప్రారంభోత్సవము

సదాశివపేట, మార్చి, 30

అఖిల భారత శివానుభవసంస్థ అధిపతి శ్రీవిరూపాక్షానందస్వామిగారు, ఇటీవల ఇక్కడ ప్రాచ్య కళాశాలకు ప్రారంభోత్సవం చేసారు.

శ్రీ నీలకంఠస్వామి ఇక్కడ కార్యక్రమమును నిర్వహిస్తున్న పెద్దమఠంలో ఈ ప్రాచ్యకళాశాలను స్థాపించారు.

ఈ సందర్భంలో జరిగిన ఉత్సవంలోనే శివానుభవసంస్థ శాఖకు శ్రీ వీరభద్ర శివాచార్య మహాస్వామిగారు, ప్రారంభోత్సవం చేసారు. "నేనెవరు?" అనే గ్రంథాన్ని పాపన్నపేటకు చెందినశ్రీ చంద్రశేఖరస్వామిగారు అవిష్కరించారు.

తెలుగు సాహిత్యంలో పాల్కురికి సోమనాధుడు మొదలగువారు ప్రబోధించిన శివానుభవతత్వంను గురించి స్థానిక పురపాలక సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ శెట్టిరేవప్ప' వీరశైవ ధర్మమును గురించి శ్రీ శీలం నాగలింగము, పులిమామిడి చంద్రశేఖరంగారు, సంస్కృతభాష ప్రాముఖ్యతను గురించి శ్రీ దేశికేంద్ర శివాచార్యులు, శివానుభవ సాహిత్యమును గురించి శ్రీ హల్గూరు బృహన్ మఠానికి చెందిన ఈ వీరభద్ర శివాచార్యులుగారు వివరించారు.

ఆంధ్రభూమి 1-4-1972 శనివారము

## గోలకొండ గ్రంథాలయము

### "వీరశైవ ధర్మాన్వేషణము" అను గ్రంథ సమీక్ష

గోలకొండ పత్రిక 26-2-1965

శ్రీ శ్రీ శ్రీ స్వామి వీరభద్ర శివాచార్యులవారి కన్నడ మూల గ్రంథమునకిది తెలుగునేత. ఆంధ్రకర్త శ్రీ పం॥ రాచ వీరదేవరగారు. పేజీలు 36 వెల రు. 3-00 రూ॥లు ప్రాప్తి స్థానము పం॥ రాచవీరదేవర, సంస్కృతాంధ్ర పండితుడు. ఇం. నం. 3-3-139, కాచిగూడ, హైదరాబాదు - 500 027. ఆం.ప్ర.

"న వీరశైవ సదృశం-మత మస్తి జగత్త్రియే" అని ప్రతిజ్ఞ చేసి గ్రంథమును ఉపక్రమించియున్నారు. "భక్తిర వ్యభిచారిణీ" అన్న గీతా వాక్యము ఏమతస్థునికైనను శిరోధార్యమే. శైవుడుగాని, వైష్ణవుడుగాని, శాక్తేయుడుగాని, మరే మతస్థుడుగాని, నిశ్చలభక్తితో తన కులదైవతమును సేవించ వలెనని చెప్పుటయే పైపంక్తి తాత్పర్యము. అందువలననే వీర శైవ, వీరవైష్ణవాది శబ్దములు ప్రచారములోనికి వచ్చినవి.

ఒక మతమునకు కట్టుబడి యుండుట ఎందుకనగా మనస్సు పరిపరి విధముల పరిభ్రమింపక ఏకాగ్రమై యుండుటకు, తమ తమ విశ్వాసము ననుసరించి, తాము భక్తి చేయ వచ్చును. అన్యమత దూషణ చేయుమని గురువులు ఉప దేశించరు.

శైవమతమును గురించి శివపారమ్యమును గురించి పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రయందు వివ రించియున్నాడు. అంతటి యుద్గ్రంథమును ప్రజాసామాన్యం పఠింపజాలరని ఈ చిరుపొత్తము ప్రకటింపబడినది.

భారతాది గ్రంథములయందును శివపారమ్యము చెప్ప బడియే యున్నవి. అనుశాసనిక పర్వము 14వ అధ్యాయమున ఉపమన్యువు ఇంద్రునితో చెప్పిన విషయం.

హేతుభిర్వాకిమన్యై ర్వాస్త్రై-రీశః కారణ కారణం।
నశుశ్రమయ దన్యస్య-లింగ మభ్యర్చ్యతే సురైః॥ 233

కస్యాన్యస్య సురైసర్వై-ర్లింగం ముక్త్యామహేశ్వరం
అర్చ్యతే ర్చిత పూర్వంవా-బ్రూహియద్యస్తి
తేశ్రుతిః॥ 234

యస్యబ్రహ్మాచ విష్ణుశ్చ-త్వంచాపి సహదేవతైః ।
అర్చయేత్సదా లింగం-తస్మాచ్ఛ్రేష్ఠత
మోహినః ॥ 235

సృష్టి సమస్తమూ శైవమే. పంచభూతములు ఈశ్వరుని మూర్తులే. ఇది మనకు ప్రత్యేక్షమే. కావున ఆస్తికులకు అవశ్య పఠనీయము ఈ గ్రంథరాజము.

## స్నేహితులుగా విడిపోవడం శ్రేయస్కరము

షట్సూత్ర పథకంపైనను అష్టసూత్ర పథకంపైనను తెలంగాణా ప్రజలకు ఇదివరకు కాస్తోకూస్తో ఉన్న విశ్వాసం ప్రస్తుతముల్కీ సంక్షోభంతో నన్నగిల్లిపోయినదనియు కావున

మిత్రులుగా విడిపోవడం మంచిది. ప్రస్తుత సంక్షోభానికి, పరిష్కారానికి వేరే మార్గం లేదని 'శివశ్రీ' ఒక ప్రకటనలో అభిప్రాయపడ్డారు.

ఆంధ్రభూమి

—:—:—

## అందుకున్నాం

## ప్రాచీన వీరశైవము

కన్నడ భాషనుండి తెనిగించబడిన ఈ గ్రంథంలో వీరశైవ ప్రాచీనత్వాన్ని నిరూపించే ప్రయత్నం జరిగింది. కొందరు పరవాదులు క్రీస్తుశకం 12వ శతాబ్దంలో వీరశైవం పుట్టిందని ప్రచారం చేయడాన్ని ఖండిస్తూ వెలువడిన కొద్ది గ్రంథాలలో ఇది ఒకటి. తామ్రయుగం (6 వేల సంవత్సరాలకు పూర్వం) నాటినుండి లింగపూజ వున్నదని, శైవం నుండి వీరశైవం 'పాలలో నెయ్యి' వలె ఉద్భవించినదని ఇందులో సోదాహరణంగా పేర్కొన్నారు.

కన్నడ మూలం : చన్నబసవ శాస్త్రి రాయచూరు

తెలుగు సేత : పెద్దమఠము రాచవీరదేవర

## వీరశైవ ధర్మ భావ గీతికలు

వీరశైవాన్ని ప్రస్తుతంలో దాదాపు 55 గీతాలు ఇందులో వున్నాయి. అందరూ పాడుకొనేందుకు అనువుగా సినిమా పాటల ఫక్కీలో కొన్ని పాటలను రచించటం జరిగిందని రచయిత వివరించారు. కొన్ని నీతి ప్రబోధ గేయాలు కూడా ఇందులో చోటుచేసుకున్నాయి. ఉదాహరణకు : బసవ బౌద్ధుల అహింసాతత్వము కరుణాగుణమే కమనీయంబైనవి. కావున దానినే మననము జేయరా

రచన : పెద్దమఠము రాచవీరదేవర

ప్రాప్తిస్థానం : ఇ.నెం. 3-3-139, కాచిగూడ,
హైదరాబాద్ - 27.

## ఇష్టలింగార్చన విధిః

ఇది 'వీరశైవ ధర్మ గ్రంథమాల' క్రింద ప్రచురితమైన ఏడవ పుస్తకము. వేద సహస్రనామావళితోబాటు 'శివ లింగపూజావిధి' ఇందులో సులభరీతిలో సంగ్రహపరచబడివుంది.

సంగ్రహకర్త : పండిత పెద్దమఠము రాచవీరదేవర

ప్రాప్తిస్థానం : ఇ.నెం. 3-3-139,
కాచిగూడ, హైదరాబాద్ - 27.

ఆంధ్రభూమి 26-3-1989 ఆదివారం



శ్రావణమాస పూజా సందర్భమున రుద్రాక్షల కిరీటధారులైన
వే॥ పం॥ పెద్దమఠము శ్రీ రాచవీరదేవరగారు




వి. వి. హాస్టలు బాగ్ లింగంపల్లిలో శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవ సందర్భములో సామూహికముగాదిగిన చిత్రము

# పం॥ రాచవీరదేవరగారి వచనములు

—రచన : పెద్దమఠము రాచవీర దేవర
"తీర్థ" (కలకత్తా) M.O.L. (O.U.)

## గురు - లింగ - జంగమ పూజా నిష్ఠ

లింగపూజనుజేసి - మంగలమునువేడు
జంగమమునుజూచి - వంగి నమస్కరించు
భంగపడే అహంభావమునువీడి
మంగల ప్రదుడైన శివునిధ్యానించు మది. ॥౧॥

శివలింగమేదో గుర్తించి లింగపూజలొనర్చు
శివపూజలేమికి శివుఁడు మెచ్చడు సుమా!
శివుని దూషించి పలు జన్మలెత్తకు
శివుని యర్చించి శివలోకమును బొందు. ॥౨॥

గుర్వనుగ్రహించిన లింగమును వీడి
గర్వముతో దీర్ఘయాత్రలు దిరుగకుము
గురుచరణతీర్థ ప్రసాదములను సేవించి
గురుతర మోక్షమును బడసి సుఖించుము. ॥౩॥

గురుజనుల, హరజనుల, హితవాక్యముల మీరి
చర జంగమంబుల, దూషించి చెడకుమా!
పరుల హితమును గోరి, పరమశివుని దర్శించు
పరమోక్ష సాధకునకిదియె కర్తవ్యమ్ము. ॥౪॥

వీరశైవ దర్పణము నవంబరు-88/31

## సూక్తులు

అతిగా భుజించుటకు మించి పాపములేదు
అతిగా నిద్రించుటకు మించి శత్రువులేదు
అతిగా మాట్లాడినను. అతిగా సంగమము జేసినను
ఆతియనున దెక్కడ చెల్లదు. సుమా! అతినివీడి
మతిమంతుడవై సతతము శివయోగానురక్తుడవైనచో
శితికంఠుడు పరశివలింగము తానై వచ్చిగట్టిగాకౌగిలించుకొనును.
వేదనిందకుని ముఖముఁజూడఁదగదు, ఆగమమును
నిందించు అజ్ఞానులతో గూడి యుండరాదు.

వీరశైవుఁడైనచో వేషమును ధరించాలి
అంగలింగతత్త్వము నరయ దలచినచో
ఆశయములతత్త్వముల నరయఁదగును.
పండితుడైనచో పురాణముల తాత్పర్యములఁ
గ్రహించాలి ఇటులేమియుఁ జదువక
"అందులోనేముంది ఇందులో నేముంద''ని
చెప్పుచుడొంకదారినిబోవు మంకు బుద్ధివారినే
మనందగును "దేవరసంగమదేవ"
మడిమడియందురు ఆమడితీరు ఇటులుండాలి
అంతరంగ, బహిరంగములందు, శుచిగానుండుటే మడి
రాగద్వేషములను అస్పృశ్యులను దాకకుండుటే మడి
కామక్రోధంబులను చాండాలురఁ దాకకుండుటే మడి
మాదేవర సంగమదేవుని భక్తిమయుడగుటే నిజమైన మడి
అష్టావరణములను కవచాన్ని ధరించి
పంచాచారములను ఖడ్గమును ధరించి
షట్స్థలముల తత్త్వములను గుర్తించి
సంసారమను సమరభూమిలో కామాదిశత్రువులతో
పోరాడునాతడే వీరశైవుఁడనిన అదెటులయ్యాః
''విశబ్దేనోచ్యతే విద్యా శివ జీవైక్యబోధితా ।
తస్యాంరమంతె-యెశైవా వీరశైవాస్తుతేమతాః॥"
అని శ్రీరేణుక భగవత్పాదులు బోధించుటవలన

అంగలింగ సమరసతత్త్వము నెఱింగి యానందించువాడే నిజమైన వీరశైవుడు సుమా! "దేవర సంగమదేవ"

వీరశైవ దర్పణము నవంబరు-88/32

శ్రీశైల ప్రభ మాసపత్రిక :-

## మహాత్మ శ్రీబసవేశ్వరుడు

రచన : పండిత శ్రీ పి. రాచవీరదేవర **M.O.L.**
"తీర్థ", "విశారద" సాహిత్యరత్న

భారతదేశమున విలసిల్లిన మత ప్రవక్తలలో శ్రీకల్యాణ బసవేశ్వరుల వారొకరని జెప్పినచో అతిశయోక్తిగాదు. దివ్య జ్యోతిగా వెలిగిన మహాపురుషుడు. వీరి జీవితమత్యంత నిరాడంబరమై, సత్యాహింసలతో గూడినదై తేజోవిరాజతమై యొప్పారుచుండెడిది. అంతేగాక పరమ పవిత్రముగా నుండి, యితర జనావళికాదర్శప్రాయముగా నుండినది. వారుపదేశించిన వచనములు వేద వేదాంగఆగమోపనిషత్తుల యొక్క సారభూతములై యున్నవి. దళితదీన జనోద్ధారకులైన మహాపురుషులలో శ్రీ బసవేశ్వరులవారికి ప్రత్యేక స్థానము కలదు. అస్పృశ్యతను దొలగించి హరిజనులను గౌరవించెను. విప్రుని మొదలుకొని యంత్యజుని వరకు శివభక్తులైన వారినందరిని

ఒకటిగా జూతునని జెప్పి వర్ణనిబంధనను దొలగింనెను. "నా కంటెను", పిన్నలులేరు, "శివభక్తులకంటెను", అధికులులేరని, సర్వమానవ సమతావాదియయ్యెను.

ఇట్టి మహాత్ముని విశ్వపిత యని బిరుదాంకితులగావించి ఎంతగా గౌరవించినను తక్కువే. వారు ధార్మిక, మరియు రాజకీయములందు సామ్యసిద్ధాంతమును లేవనెత్తి సుస్థిరపరచి యున్నారు.''కాయకమే కైలాసమును నినాదమును లేవనెత్తి'' సమస్త కులవృత్తులను ప్రోత్సహించి నిరుద్యోగమను సమస్యను సమయింపఁజేసిరి.

శ్రీ బసవేశ్వరులవారిని గురించి యనేక కవులు, పండితులు, మరియు శివశరణులు' శివయోగులు గూడవారిని ''భక్తి భాండారి," "ధ్యితీయ శంభువు'' ''ప్రథమప్రథమాచార్యుడు" "మంత్రమూర్తి''. అష్టావరణస్వరూపుడు, ''శివాచారచక్రవర్తి" "సమస్తాచారసంపన్నుడు, సర్వాంగలింగమూర్తి,వీరశైవ నిర్ణయ పరమావతారుఁడు" అని అనేక విధములఁబొగడియున్నారు, మన ప్రాచీన ఋషిపుంగవులు కేవలము "సర్వేజనాఃసుఖనోభవంతు" అని నుడివియున్నారే గాని, శ్రీ బసవేశ్వరులవారు మాత్రము సకల జీవాత్ములకును హితమును గూర్చునట్టి మాశివశరణులే సత్కులజులని నొక్కివక్కాణించి యున్నారు. అర్థాత్ కేవ

లము మానవులకేగాకుండా సమస్తజీవాత్ములకును, హితమును గూర్చుటయే వారిముఖ్యోద్దేశమై యున్నది.

వారితత్త్వము, ఆచారవ్యవహారములు, మరియు వారొనర్చిన ఘనకార్యముల నుండియు స్థిరపడుచుండెను. కాని శ్రీబసవేశ్వరుల వారితత్త్వ ప్రచారము జనజాగృతి నందిన వారికి మాత్రమే యుపకరించుచున్నది. వారు గురువునందు సదాచారము, లింగమునందు శివాచారము, జంగమునందు సమయాచారము, ప్రసాదమునందు మనోనిగ్రహము, ఆచారము నందు సువిచారముగలవారై యొప్పుచుండిరి.

యద్యపి బసవేశ్వరులవారి మహిమను. మరియు వారి గాంభీర్యమును గుర్తించిన యెడల నేడిప్రపంచము సత్యమునకు సాగరమువంటిదై, భక్తికి నిలయమై, ముక్తికి మూలమై, పుణ్యపు రాసియై, వేయేల? క్రొంగ్రొత్త రెండవ కైలాసమెయగుచుండెను. కారల్ మార్క్సు నుండి మొదలుకొని లెనిన్ 1922వ సం॥ మునకు బూర్వమే "కాయకమే కైలాసమని" జాటి వీరశైవులలో స్వావలంబనామార్గమును జూపించియున్నారు. సమాజమున మొట్టమొదట విప్లవ శంఖారావమును పూరించి, వినిపించి, వీరశైవుల నందరిని నిద్రనుండి మేల్కొలిపిన మహానుభావులు వీరు, శ్రీహరళయ్యగారివంటిపాదరక్షలజేయు కాయకపు వారికిని,

శ్రీమధువరసలాంటి కర్మఠ బ్రాహ్మణునకును శివదీక్ష నొసంగి వివాహ సంబంధః మొనర్చుటవంటిది. నేటికిని జనులనాశ్చర్య చకితులఁజేయుచున్నదనుటలో సందేహములేదు.

అహంకారము భక్తిలక్షణముగాదనునీరహస్యము నెఱింగినవాడు గనుక నాకంటెను పిన్నలు లేరను భావముతో యుండి ఘనకార్యములను సాధించియున్నారు. నుడివి నట్లొ రించిరి లింగధారణమును జేసికొను నపేక్షగల సమస్త వర్ణన ముల వారికిని స్వేచ్ఛ యొసఁగిరి, అందుకు గావల్సినన్ని సౌకర్యములను గలిగించిరి.

లాంఛనమునను శరణందును, అందుకుఁదగిన యాచరణలేనిచో కూడలిసంగమ దేవునిసాక్షిగా నేను "ఛీ" యందునని ఆచారహీనులను గురించి యతికఠిణముగా మంద లించి యున్నారు. "మృదువచనములే సకల జపంబులయ్యా, సదువినయమే సదాశివుని వలపించుటయ్యా" అని నిండుమనం బుతో బలికెరి, అంతేగాకుండ "యత్రతజీవాఃతత్రతశివః" అనగా ఎక్కడైతె ప్రాణులున్నవో అచట శివుడున్నాడని భావించి సమస్త ప్రాణులను సమాన దృష్టితో జూచియున్నారు.

కన్నడమున ఆధికసంఖ్యలోనున్న శ్రీ బసవేశ్వరుని వచనరచనలు రసగుళికల మాదిరి యతిమధురములై ఆణి (జాతి) ముత్యములవలె కాంతివంతములై, సమస్త మానవ

జాతికే నీతిబోధకములుగా నున్నవి. మానవ కల్యాణమునకు నీతియెంతేని యవసరము. అసత్యమార్గ ప్రవర్తకులను సత్య మను ఖడ్గముతో ఖండించెను. "న్యాయనిష్ఠుర దాక్షిణ్యపరుడను నేనుగానయ్య, లోకవిరోధి శరణుడేరికీనిభయపడడయ్యా, కూడల సంగమదేవుని రాజతేజముననుండు కతన, వారికి దమయారాధ్య దైవమునందధికమైన విశ్వాసముండెడిది. కావున నాతడు ఈలోకపు మానవులకుఁజంకువాడుగాడు, అనుభవియొక్క నుడి కారమే వేదవాక్యమని శ్రీమదల్లమ ప్రభుదేవులవారువారి వాక్య మునే సమర్థించియున్నారు.

ఈశ్వరానుగ్రహమును బడయుట కనేక మార్గముల ననుసరింప వచ్చునని ధర్మశాస్త్రము వలన దెలియుచున్నది. వానిలో ధ్యానయోగము, భక్తియోగము, మొదలగునవి యోగ్య ములుగా నున్నవి. అందును భక్తిమార్గము శ్రేష్ఠమైనది. పండిత పామరులందరీ మార్గమునే అతి సులభముగా నను సరింప వచ్చును. అట్టి భక్తిమార్గమునే ఆశ్రయించి యత్యు న్నత పదవి నధిష్టించి యున్నారు శ్రీ బసవేశ్వరుల వారు,

శ్రీహరిహర కవిపుంగవుఁడు బసవన్నగారిని "సద్భక్తి సూరేగారం" అనగా సద్భక్తి భాండారియని యర్థము. 'భక్తి తిలకం' అనగా భక్తియను వంశమునకు తిలకమువంటివాడ నియు వర్ణించి యున్నాడు, భక్తిపరవశులైన శ్రీ బసవన్నగారు

అర్థిజనుల యిష్టార్థములన్నింటిని పూరయించి యున్నారు. కొందరు "బసవడుముక్తిగె మూలమని" యు మరికొందరు "బసవడుభక్తిగె మూలమనియు" మిగులగొనియాడి యున్నారు. వారి భక్తిభావము. వారినిండు హృదయము నుండి వెల్లుబికి వెలువడిన వచనామృతమునుండే వ్యక్తమగుచున్నది. "తనువు నడిగిన నిత్తును, మనమునడిగిన నిత్తును, విత్తమునడిగిన నిత్తును, కన్నులనడిగిన నిత్తును, శిరమునడిగిన నిత్తును, కూడలసంగమదేవ మీకు నా సర్వస్వము నర్పించి పరిశుద్ధుండ నైతిని, మీ పురాతనుల గృపవలనని ముక్త కంఠముతో బలికి యున్నారు. శివభక్తి సంపన్నులైన శివశరణులంజూచినంత బసవేశ్వరుల వారి యానందమునకు మేరయుండేదికాదు. వారి నిర్మలమైన యాత్మనుండి వెలువడిన యావచనమును బరిశీలించినచో నెంతటి పాషాణహృదయముగూడ కరిగి నీరుగాక మానదు, 'తల్లినెడబాసిన శిశువుపునః దన తల్లిని వెదకుల్లుగా, గుంపునుండి దప్పిపోయిన పశువు మరల దనగుంపును వెదకు పగిది, వేచియుంటినయ్యా! వేయికన్నులతో మాశివశరణుల రాకకై వేచియుంటినయ్యా! మాశివభక్తులరాకకై దినకరుడు దయమునకు కమలము వికసించునట్లు నాకు మాశివశరణుల రాక కూడలసంగమదేవ,

ఆకారణముచేత వారు భక్తిభాండారియైనప్పటికిని జ్ఞాన కర్మ సముచ్చయముల రెండింటిని సమన్వయము జేసికొని

తమపవిత్రమైన జీవితనౌకను నడిపియున్నారు, అంతే గాకుండ ఇహలోకమున నున్ననాళ్ళు లింగనిష్ట - జంగమ ప్రేమగలవారై కేవలము ధర్మస్వరూపులై ప్రఖ్యాతిగాంచిరి. వారు నివసించిన భూమియే పుణ్యక్షేత్రమై సాక్షాత్కైలాసమ య్యేను. వారియాశ్రమము నందుండి నిరంతరము వారిచే ఆదరాదిసపర్యలనందుకొనిన జంగమమూర్తులే ప్రత్యక్షముగా ప్రమధులై వెలసిరి. ఇట్టితఱినాడు కల్యాణ పట్టణమేలగ్గైలా సముగారాదు ? సచ్చిదానంద స్వరూపమైన వారియిష్టలింగ మునే పరశివబ్రహ్మముగా భావించిరి. అజ్ఞానాంధకారమును దొలిగించుటకు జ్ఞానజ్యోతి యెట్టులవసరమో అట్లే నీయిష్ట లింగముగూడ ముక్తికి సాధనమని యుద్బోధించిరి ? శ్రీబసవన్న గారు అష్టావరణములందు నవచైతన్యమును సృష్టించి ప్రచండ తరముగా వానికి బ్రతిష్ట నాపాదింపఁజేసియున్నారు.

"జంగమేమే నాకులింగము, జంగమమే నాకు బ్రాణము, కూడలసంగమదేవా ! నాకును నీకును జంగమ ప్రసాదమే ప్రాణము" అనినుడివి, ఎవరేమన్నను నేను మరల మరల జంగమారాధన యొనర్తును. ఇదినా ప్రతిజ్ఞ నేనుల్లంఘించినచో నీవు నా నాసికమును ఛేదింపుమని" దనయారాధ్య దేవతయైన కూడలసంగమదేవుని బ్రతిమాలి వేడికొనిరి.

జాతి భేదమను నుచ్చులోబడి తల్లడిల్లుచుండిన వారినీ రీతిగా హెచ్చరించి యున్నారు. "కులమునందు శూద్రుడైన

నేమి ? మహాదేవునియందు మనసునిల్పినవాడే ఉత్తమ వీర శైవుడు సుమా ! పరస్త్రీని స్వమాతృదేవతగా భావించి అను భవమంటపమున వారికి తగిన గౌరవమొసంగిరి, వారికి పురు షులతోబాటు సమానహక్కులను గల్పించిరి. అంచేత అక్క మహాదేవిలాంటి విదుషీమణులెందరో కవయిత్రులై వెలసిరి. పురుషవృషభులై విశాలహృదయముతో తమయమూల్య జీవిత మును సాగించియున్నారు. అట్టి పుణ్యాత్ముని ఘనతనెంతగా వర్ణించినను తక్కువే గదా ? మహాత్ముల చరిత్రల వినిన మనసులు శాంతినొందును గదా !

ఇతి, శివం భూయత్,

# వీరశైవ దర్పణము

మే - 1988

# యజుర్వేదములో శ్రీరుద్రము

[వైదిక సాహిత్యములోను, వైదిక మత ఆచరణలోను శ్రీరుద్రమునకుగల ప్రాధాన్యత అసామాన్యమైనది. వాయు పురాణములో ఈ క్రింది శ్లోకాన్ని గమనిస్తే ఈ విషయం విశదమవుతుంది.

విద్యాసు శ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశిని శ్రుతౌ।
తత్ర పంచాక్షరీ తస్యాం శివ ఇత్యక్షర ద్వయమ్ ॥

విద్యలన్నింటిలో వేదముత్కృష్టమైనదనియు, వేదములలో శ్రీ రుద్రము హృదయము వంటిదనియు, శ్రీరుద్రములలో పంచాక్షరి మంత్రమే మౌలిక మనియు, పంచాక్షరిలో 'శివ' అను రెండక్షరములే గొప్పవని పై శ్లోకము యొక్క భావము.

శైవమతాధిక్యతను నిరూపించే వైదిక సాహిత్యము యెడల వీరశైవులు విభిన్న వైఖరులు అవలంబించుచున్నారు. కొందరు వీరశైవము యెడల తీవ్రాభిమానము వహించి శ్రీరుద్రమును వీరశైవులు పఠించగూడదని వాదిస్తే, మరి కొందరు వేదాలు కూడ వీరశైవాన్నే బోధిస్తున్నాయని చాటుచు శ్రీరుద్రాన్ని అనుసరణీయముగా చెప్పుచున్నారు. తెలుగులో శ్రీరుద్రమునకు వీరశైవ పరమైన వ్యాఖ్యలు చాల తక్కువ. శ్రీరుద్రములోని కొన్ని మంత్రాలకు సశాస్త్రీయమై వీరశైవ ధర్మోన్ముఖమైన వ్యాఖ్యను ప్రచురించడానికి సంతసించుచున్నాము.

— ఎడిటర్]
వీరశైవ దర్పణము మే-88/22

# ప్రార్థన

యోవేదాదౌ స్వరః ప్రోక్తో-వేదాంతేచ ప్రతిష్ఠితః ।
తస్య ప్రకృతి లీనస్య-యః పరః సమహేశ్వరః ॥

మంత్రము : ఓం నమస్తే రుద్రమన్యవ-ఉతోత ఇషవే నమః।
నమస్తె అస్తుధన్వనే-బాహుభ్యాముతతే నమః ॥౧॥

తా॥ సమస్త దుఃఖమునకు కోపమే కారణము కావున ఇక్కడ మొదలు రుద్రుని కోపమునకు నమస్కారమునుజెప్పి, తరువాత ప్రత్యక్షముగా ప్రాణములను హరించె, యతని బాణము-విల్లు మరియు బాహువులకు నమస్కారమును జెప్పఁబడినది. దీనితో రౌద్రాయుధములుగల యారౌద్ర మూర్తి శాంతమూర్తియగును.

రుద్ర : రుద్దుఃఖం దుఃఖ హేతుర్వా-తద్రావయతినః ప్రభుః।
రుద్రి ఇత్యుచ్యతేతస్మాచ్ఛివః పరమ కారణమ్॥

వ్యాఖ్య : ఇట్లు రుద్ర దేవుఁడు ప్రసన్నుడైన బిదప భక్తుఁడు దనను రక్షించుటకై ప్రార్థించుచున్నాడు.

మంత్రము : యాతఇషు శివతమా-శివంబభూవతే ధనుః ।
శివశర వ్యాయాతవత యానోరుద్ర మృడయ॥౨॥

తా॥ ఓయీ! రుద్రదేవా! నాయొక్క భక్తి పూర్వకమైన నమస్కారముతో నీయొక్కయే బాణమైతే శాంతించెనో మరియు నీయొక్క విల్లు-అమ్ముల పొదియు శాంతించెనో, వాటన్నింటి వలన నన్ను రక్షించుము.

మంత్రము : యాతేరుద్ర శివాతనూ రాఘోరా పాపకాశినీ ।
తయానస్త నువాశంత మయాగిరి శంతాభి
చాకసీహి ॥3॥

వ్యాఖ్య : భక్తుడు మొదటి మంత్రముతో నైహిక సుఖ సంపత్తుల నర్థించి ప్రస్తుతము మోక్షమునకు గారణమైన శివజ్ఞానము నర్థించుచున్నాడు.

తా॥ ఓయీ! రుద్రదేవా! నీ యొక్క ప్రశాంతమైన లింగ రూపమగునే శరీరముగలదో, అట్టిది యుగ్రమైనది గాకుండ, పాపరహితులైన సద్భక్తులయందు ప్రకాశించునదై యత్యంత సుఖకరమైనది. అటువంటి శరీరము నుండి 'గిరి' మంత్ర రూపంబగు వాక్కులందుండి "శంత" అర్థానిని జపించువారికి ఇహపర సుఖములను బ్రసాదించు వాడివి కనుక మమ్మల్ని ప్రకాశింపం జేయుము, ఇప్పుడింక అనిష్ట పరిహారమును గురించి ప్రార్థించుచున్నాడు.

మంత్రము : యామిషుం గిరిశంతహస్తే-॥౧॥ బిభర్ష్యస్తవే।
శివాంగిరిత్రతాంకురు మహిగ్ం సీఃపురుషం
జగత్ ॥౪॥

తా॥ జ్ఞానమనెడు కైలాసమందుండి భక్త జనులకు సుఖమును గలుగజేయువాడా ! (అనగా సర్వజ్ఞుడైన శివుఁడు భక్తుల దుఃఖములను బరిహరించువాడని యర్ధము) ఏ బాణ మును పాపులను రక్షించుటకై హస్తమునందు ధరించి యున్నాడివో? అట్టి యమ్మును (బాణమును) శాంతింపఁ జేయుము 'గిరి మంత్ర రూపంబైన శ్రీరుద్రాధ్యాయము నందుండి దానిని జపించు వారిని "త్ర" రక్షించువాఁడవై మమ్ము పుత్ర పౌత్రాదులతో సహ మరియు గోవు-క్షేత్రము-గృహము మొదలగు సమస్త ప్రపంచాన్ని హింసింపకుము. ఇట్లు నిరూపించుటఁజేసి తనకు మరియు నితరులకు మంగళము నభిలషించినట్లయ్యెను.

మంత్రము : "శివేనవచసాత్వాగిరి శాచ్ఛావదామసి।
యథానస్సర్వమిజ్జగద యక్ష్మగ్ం సుమనా
అసత్ ॥౫॥

తా॥ ఈ మంత్రముతో ఇష్టప్రాప్తి మరియు అనిష్ట పరిహార ములకై ప్రార్థించుచున్నాడు. గిరిషుసేత ఇతి, గిరిశ,

అనగా వేదములలో వేదప్రతిపాదకమైన భావము, మరియు పుణ్యారణ్య క్షేత్రములో నివసించువాడా! నిర్మలుండవైన నిన్ను మేము పరిశుద్ధమైన వాణితో ప్రార్థించుచున్నాము. నిన్ను స్తుతించుట వలన సుప్రసన్నుండవైన నీవు మా యొక్క సమస్త పశుపుత్రాది రూపములైన యీప్రపంచము రోగ రుజినములు లేకుండ ప్రసన్న మనస్సుగలదై యెటులుండదగునో అట్లొనర్చుము. ॥౯॥

శృతి : ౧, రుద్రోవా ఏషయదగ్ని స్తస్యైతనువౌ; ఘోరాన్యా, శివాన్యా,

మహాభారతే : ద్వైత నూతన్య దేవస్య-దేవజ్ఞా బ్రాహ్మణా విదుః ।
ఘొరాన్యా శివాన్యా-తెచ్చైవ శతధా పునః ॥

వ్యాఖ్య : రుద్రుడనగా అగ్ని, అద్దానికి రెండు శరీరములుండును. అందును ఒకటి ఘోరమనియు, మరొకటి అఘోరమనియు.

—రచన పెద్దమఠం రాచవీరదేవర 'తీర్థ' M.O.L.
కాచిగూడ హైదరాబాదు.

శివం భూయాత్ !

# ప్రకటనలు

**తాండూరు :**

వీరశైవ సమాజము తాండూర్‌వారి ఆధ్వర్యములో 19-4-88న శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవము అతి వైభవోపేతముగా శ్రీ భద్రేశ్వర దేవాలయమునందు జరిగెను. పండిత రాచవీరదేవరగారు ప్రధాన ఉపన్యాసకులుగా యుండిరి. సర్వశ్రీ సెట్టి చంద్రశేఖర్, పసారం శాంతకుమార్, చిగురు వీరేశం మరియు మున్నగు ప్రముఖుల కృషి అతి అమోఘముగా నుండెను. వీరశైవ సమాజము పక్షమున పండిత శ్రీ రాచవీర దేవరగారికి కంచు నటరాజ మెమోంటాన్నిచ్చి శాలువను గప్పి ఘనంగా సన్మానించనైనది.

**ముషీరాబాద్ :**

వీరశైవ బసవ సమాజము మరియు వీరశైవ సహకార పరపతి సంఘముల ఆధ్వర్యములో శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవము శివశ్రీ పత్తి మహారుద్రప్ప అధ్యక్షులు, ఆం.ప్ర. వీరశైవ మహాసభవారి అధ్యక్షతలో అతి రమణీయముగా జరిగినది. ఉ॥ 6-30లకు ధ్వజారోహణముతో ఆరంభమైన ఈ సమావేశము మ॥ 2 గంటలకు బసవపంక్తి, భోజనముతో ముగిసినది. సర్వశ్రీ యం. శ్రీశైలము సభాధ్యక్షులుగాను, యం. మల్లయ్యస్వామి, కార్యదర్శిగాను, ఈ ఉత్సవము అతి

ఉత్సాహంతో జరిగినది. సర్వశ్రీ పెద్దమఠం పం॥ రాచవీర దేవరగారు, మఠంలింగయ్యస్వామి, గంటె సిద్ధిరామప్ప మరియు పి. నాగభూషణం గార్లు ఉపన్యాసకులుగా యుండిరి.

వీరశైవ దర్పణము మే 1988

వీరశైవ దర్పణము అక్టోబరు, 1989

ధారావాహిక

## అల్లమ ప్రభు విజయము

రచన: పండిత రాచవీర దేవర

సఖులు : (అందరు కలసి) అయ్యో ? మా రాకుమారి మూర్ఛ చెందినది గదా ! ఇప్పుడేమి జేయునది ?
(దుఃఖముతో)

(కొద్దిగా శబ్దము)

విమల : కరుణాసాగరా ! అనంత లోకములకు కారణభూతుడ వైన నీవే మా సఖి తను-మనములను మాటిమాటికి బరికించుటఁదగునా ?

ప్రభు : కోరికకు గూడ ఒక పరిమితి యుండగూడదా ! విమలా !

విమల : అదేమో నిజమే ప్రభు ! చైతన్య రహితమైన జీవితమునకు మీ కరుణారసమే ప్రాణప్రదమైనది గదా !
ప్రభూ! దయచేసిముందా మెననుగ్రహించిబ్రతికించుము.

ప్రభు : సుకుమారీ ! పాలకు తోడుచేసిగట్టిపడినరుగును దిని యానందించునటుల నీటిలో మీగడవేసిన యది పెరుగగునా ? అట్టిది భోగించుటకు అర్హమగునా ?

విమల : ప్రభుదేవా..................! !

ప్రభు : మతిహీనురాలికి నెనెంతగా బోధించినను ప్రయోజనముండదు !

విమల : మీరు పరుషమణిలాంటివారు గదా స్వామీ ! నీచమైన లోహమువంటి యీ మాయను ఒక తడవ కాలితోనైన దాకుము ప్రభూ ! అథవా కరుణతోనైన ఆలింగింపుము ! ఎటులైనను చేసి మీ స్పర్శానుగ్రహమైనచో నదియే జాలును.

ప్రభు : విమలమతి ! పరుషమణి సోకిన లోహము బంగారమగునే గాని, మట్టికూన బంగారమెట్లౌతుంది ? అది బంగారమగుట సాధ్యమా !

ప్రభు : మతిహీనులమల్లె మాటలాడకుము విమల : ఒక విత్తనము నాటి మరో ఫలము నాశించినచో నది యెన్న

డై నను ఫలించునా ? కేవలము వికారమునకు లోనై బూజించిన మాయవే కాని, నిజమైన సత్ఫలము నీకు లభించుట కలలోని మాటసుమా !

విమల : అల్లమ ప్రభువర్యా ! మీ పాదపద్మంబుల నాశ్రయించి యున్నారము. ఇఁక రక్షించుట, శిక్షించుట (పాల ముంచినను నీట ముంచినను) మీ యధీనము.

ప్రభు : సార్థక నామధేయురాలినయిన నీవెంతటి ప్రజ్ఞావంతు రాలివి (మాయవైపు జూచి) మాయాదేవి, కామము మరియు పరమతత్త్వముల మధ్య నొక గాఢాంధ కారము మరియు సూర్యునకుభూమికి మధ్యనున్న అంత రమువంటిది. తమో వికారమును వహించిన నీవా దివ్యజ్యోతి స్వరూపమును సాధించుట యనునది వట్టి భ్రమ.

మాయ : (అతీవ కోపముతో) స్వప్నములోను, నా హృదయ ములోను, ప్రతిబింబించియు, మోహపరవశురాలినిగా యొనర్చి, మరల నీరీతి రాతి హృదయముతో నన్ను దూలనాడి వేధించుచుంటివా ? వంచకూడా !

ప్రభు : నీ మనోవికారమే నిన్ను వేధించుచుండగా అందుకు నేను బాధ్యుడనా! రాకుమారీ! స్వప్నమున సర్పము

కాటువేసినదని మేల్కొనిన పిదప బాధపడుట హాస్యా స్పదమే యగును గదా!

మాయ : నీ సత్త్వమును బరికింపనిదే నా స్త్రీ జాతికే కళంకము వాటిల్లును. ఎలాగైనను సరే! ఎన్ని దినములు గడచినను సరే! నేను బూనిన ప్రతిజ్ఞను నేను నెరవేర్చియే తీరగలను.

ప్రభు : భూమండలములోని సాగరములన్నియు అమృత మడుగులుగా మారినను మారవచ్చును. తూర్పుదిశలో నుదయించు సూర్యుడు పడమరదిశలో నుదయించవచ్చును. సామాన్య వృక్షములన్నియు కల్పవృక్షము అనవచ్చును. కాని మాయాదేవి! నీకు మాత్రము పరమతత్త్వజ్ఞానియైన అల్లముడెన్నడును వశముగాడు సుమా ?

మాయ : నేను పరిపూర్ణ జ్ఞానినని రంగులుమిన మాటలాడి దప్పించుకొనిబోవ యత్నించుచున్న నిన్ను మాత్రము నేనెన్నటికిని వదిలియుండను. అల్లమా! నీవు జూచుచుండగ నీ క్షణములోనే నిన్ను ఎట్లు పరాభవింపజేతునో నిదే చూడుము.

మాయ : ప్రభూ! అల్లమ ప్రభూ-ప్రియసఖి విమల! అల్లమ ప్రభు చివరికి దొరకకుండగనే మాయమయ్యెను గదా?....

నెచ్చెలీ! నా ప్రతిజ్ఞ నెరవేరకపోయెనుగదా! ఇంకనేమి చేయుదము సఖులారా! (నిరాశతో దుఃఖించును)

శివంబూయాత్ / సమాప్తము

వీరశైవ దర్పణము అక్టోబరు, 1989

## సంతాప ప్రకటన

వీరశైవ ధర్మ సంస్థాపకులైన జగద్గురు శ్రీ రేణుకాది పంచాచార్యులలో ఒకరైన కాశీక్షేత్రజ్ఞానసింహాసనాధీశులైన జగద్గురు శ్రీ శ్రీ శ్రీ విశ్వేశ్వరశివాచార్య మహాస్వాముల వారు తమ జంగమవాడి మఠమునకు శాఖామఠమైన పూనా నగరంలోని జంగమవాడి మఠములో అకస్మాత్తుగా తేది **2-10-1989** సోమవారము ఉదయము లింగైక్యులైనారని తెల్పుటకు చింతించుచున్నాము. వీరు కొద్ది కాలమునుండి అస్వస్థులుగానుండిరి. వీరికంటే పూర్వముండి లింగైక్యులైన జగద్గురు వీరభద్ర శివాచార్య మహాస్వాములవారు శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారి సంస్కృత, కన్నడ, మరాఠి, హిందీ, ఆంగ్ల భాషలయందలి వీరి పాండిత్యమును గుర్తించి శ్రీవారు తమ అంతిమ సమయములో శ్రీ విశ్వేశ్వర శివాచార్యుల వారి పేరిట

ఒక వీలునామాను వ్రాసి రహస్యముగా ఉంచియుండిరి. తమ తరువాత వీరిని కాశీపీఠమునకు తగిన వారసునిగానిర్ణయించారు.

జగద్గురు శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాముల వారికి ఆరు భాషల్లో పాండిత్య మపారముగా ఉండేది. కావుననే వీరి హయాములో వీరశైవ ధర్మమునకు ప్రధాన గ్రంథము లైన "లింగధారణ చంద్రిక - నందికేశ్వరోపనిషత్తు" లాంటి ఉత్తమ గ్రంథాలు ప్రకాశమునకు వచ్చినవని.

అంతేగాకుండ ఆంధ్ర కర్నాటక మహారాష్ట్ర ప్రాంతముల నుండి కాశీహిందూ విశ్వవిద్యాలయములో సంస్కృతము నభ్యసించడానికై అక్కడికి వచ్చినవిద్యార్థులందరికి తమజంగమ వాడిమఠములో ఆశ్రయమిచ్చి వారికి ఉచిత భోజనవసతసౌకర్యములను వీరు గల్పించిరి, పోగా తమ శాఖామఠముగానున్న పూనా నగరములోని జంగమవాడి మఠమున గూడ గురుకులము నేర్పరచి విద్యార్థులకు ధార్మికశిక్షణ గరుపుట భోజనవసతులను గల్పించిరి. ఎల్లకాలములలోను జగద్గురువుల వారు కర్నాటక మహారాష్ట్ర ప్రాంతములందు బర్యటించి అచటి భక్తులకు ధర్మ బోధ గావించుచు శివదీక్షా సంస్కారములను సల్పుచుండిరి.

ఇటీవలె కాశీ హిందూ విశ్వవిద్యాలయములోను వీరశైవ ధార్మిక ఉన్నత విద్యాభ్యాసమునకై సంస్కృత-హిందీ భాషల

యందు ఘనపాండిత్యమును సంపాదించి రెండు-మూడు బంగారు పతకములను విశ్వవిద్యాలయము నుండి బడసి డా॥ రేటు పట్టభద్రులైన పూజ్యశ్రీ డా॥ చంద్రశేఖర శివాచార్య ప్రాచార్యులవారి ఆధిపత్యమునల పరీక్ష నేర్పరచియున్నారు. ఈ వరకెందరో విద్యార్థులు యాయా పరీక్షల నభ్యసించి పరీక్షలలో ఉత్తీర్ణులై మఠాధికారులై యున్నారు. వారందరికి జగద్గురు శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారే ఆశ్రయమిచ్చి పోషించారు.

మహాస్వాములవారు ఉదార స్వభావముగలవారై తమ మృదుమధుర వాక్కులతో భక్తామహేశ్వరులందరిని ఆకట్టుకొనుచుండిరి. కాశీలోని జంగమవాడిమఠమునకు వచ్చిన అథితులందరికి భోజన వసతులను గల్పించిరి.

ఆంధ్రప్రదేశములోని కరీంనగరవాసులు సుప్రసిద్ధ వర్తకులని పేరు గాంచిన గొప్ప ధనికులైన శ్రీ సిద్ధుల రాజేశము గారి కోరికమేరకు వే॥ పండిత రాచవీరదేవరగారి పలహామేరకు విచ్చేసి వారి కుటుంబ పరివారమునకు లింగదీక్షా సంస్కారమును గావించిరి. తత్ఫలితముగా హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలోను జరిగిన సభల్లోను మరియు కొలనుపాక పుణ్యక్షేత్ర సభలోను జగద్గురు శ్రీ శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారు ధార్మికోపన్యాస మొనర్చుటచేత ఆంధ్ర ప్రాంతమండలి భక్తామహేశ్వరులందరికి జిరపరిచితులైనారు.

కనుక శ్రీవారి యాత్మకు జగద్గురు శ్రీ రేణుకాది పంచాచార్యులు మరియు బసవాది ప్రమథులు చిరశాంతి నొసంగుదురని ఆపర శివమూర్తిని అనన్య హృదయముతో ప్రార్థించుచున్నాము.

వీరశైవ దర్పణము 1990

## జంగములనగా నెవరు ?

రచన : పెద్దమఠము రాచవీర దేవర

జగదాదియందు శక్తి విశిష్టాద్వైతాత్మకమగు వీరశైవ మతమును పరమ పూజ్యులైన శ్రీమజ్జగద్గురు పంచాచార్యులు స్థాపించిన విషయము ప్రతివీరశైవునకు తెలిసియేయున్నది. ఇట్టి గురుసార్వభౌములు భరత ఖండమునందు సర్వతోముఖముగా వ్యాపించిన వీరశైవ ధర్మము యొక్క రక్షణ శిక్షణాదుల కొరకు ప్రతియొక్క గ్రామ, నగరములలోను శాఖా మఠములను నెలకొల్పి అందు ఉపచార్యులను అథవా మఠాధిపతులైన చరమూర్తులను నియమించియున్నారు. వీరినే నిజమైన జంగములని చెప్పబడియున్నది. ఇక్కడ "చరంతీత జంగమా అనగా ఎల్లప్పుడూ ఒకచోట నిలువకుండ గ్రామాదులను బర్యటించి అక్కడి భక్తుల యోగక్షేమములనరసి వారికి ధర్మోపదేశము జేయుచుందురు. సంచారము సల్పునాతడు జంగముఁడని నిర్వచనము గలదు. అందుకే 'చరమూర్తియని' మరో పేరు

గూడ వీరశైవులలో సుప్రసిద్ధమైయున్నది. ఆగమాది శాస్త్రములు సహా ఉద్ఘోషించియున్నవి.

ఈ మహనీయుల తప ప్రభావము వలననే వీరశైవ ధర్మము ప్రపంచములో చాల పవిత్రమైన ధర్మమని ప్రసిద్ధి జెందియున్నది. అట్టి జంగమా మూర్తులయొక్క అపారమగు మహిమను జూచి, భరతఖండమునే ఏకచత్రాధిపత్యముతో బరిపాలించిన అనేకానేక హిందూ మహారాజులు మరియు యవన (మహమ్మదీయ ముస్లిం)మహారాజులైన అక్బరు చక్రవర్తి, జహంగీరు, హుమాయూను, ఔరంగజేబు, మున్నగువారు- గురువునకు దేహమును, లింగమునకు మనస్సును, జంగమునకు ధనమును, సమర్పించవలయుననే శాస్త్ర ప్రమాణమునుబట్టి అనేక విధములైన దానములను జేసియున్నారు. వారొసంగిన భూములు, జాగీరులకు సంబంధించిన (అగ్రహారాలు) శాసన పత్రములు నేటికిని ప్రమాణములుగానున్నవి.

వీరశైవధర్మ గ్రంధములలోను

శ్లో॥ చరమూర్తిర్వినాదేవి ! అన్యోనైవ హిజంగమః ।
చరమూర్త్యభిదానేన, జంగమః కథితోధృవం ॥
అన్యధాయశ్చజానాతి, శారవంనరకంవ్రజేత్ ।

అని నిరూపించబడినది. అనగా, ఓ పార్వతీదేవి ! చరమూర్తె జంగముఁడని చెప్పఁబడుచున్నాడు. మరోవాడు జంగముడు

ఎన్నటికిని గానేరడు. ఇట్టి పవిత్రమూర్తియైన చరమూర్తిని అన్యధాభావించినచో అట్టివాఁడు రౌరవనరకమును బొందునని ఉద్బోధించియున్నాడు.

జంగమాధిక్యతను గురించి కొన్ని వేదాగమ
శాస్త్ర ప్రమాణములు :
ఋగ్వేదారణ్యకములో :
"ఈశ్వరోZతిథిరేవచరిత స్తదుపాస్మహె

తా॥ సాక్షాత్తుగా ఈశ్వరుడే అతిథిరూపమున జరించుచున్నాడు. అతనినే నేను ఉపాసించుచున్నాము.

యజుర్వేదములో ॥దేవానాందేవోZతిథి॥

తా॥ దేవతలందరికిని దేవుఁడుగాను అతిథిగాను భావింపబడుచున్నాడు. దేవదేవుఁడు మహదేవుఁడని మరోచోట చెప్పఁబడినది.

వీరాగమము :

"సర్వలోకోపకారాయ-యోదేవః పరమేశ్వరః ।
చరత్యతిరూపేణ-నమస్తేజంగమాత్మనే ॥

తా॥ ఏ పరమాత్ముడు సమస్తలోకములకు మేలు జేయు నుద్దేశ్యముతో అతిథిరూవమున సంచరించుచున్నాడో, అట్టి

అతిథి స్వరూపుఁడైన-ఆజంగమా మూర్తికి నేను నమస్కరించు చున్నాను.

ఇక్కడ ఇతర (వీరశైవ-శైవేతరులకు) వేదములెట్లు ప్రమాణములో అదే విధముగా ఆగమములుగూడ శైవ-వీర శైవ ధర్మీయులకు ఆగమములే అధిక ప్రమాణములైయున్నవి. ఇంచుమించుగా నీ యాగమములు గూడ వేదములోని ముఖ్యాంశ ములనే బోధించుటఁజేసి "మాతృదేవో భవ - పితృదేవోభవ - ఆచార్యదేవోభవ - అతిథిదేవోభవ, మాతా - పితా - ఆచార్యుల" కంటెను అతిధికి యెక్కువ ప్రాముఖ్యత నొసఁగుట వలన ఆగమములోను అతిథికి "జంగమ, అను సాంకేతిక - పదముగా మార్చబడినది. అందులకే వీరశైవులు జంగములను అధిక ముగా పూజించుట - గౌరవించే రూఢి యేర్పడినది, అంతే గాకుండా భక్తులు అట్టి జంగమామూర్తిని తమ గృహములకు రప్పించుకొని పూజించి తత్తీర్థ ప్రసాదములను భక్తితో సేవించు సాంప్రదాయము నేటికి అనూచానముగా వచ్చియున్నది.

శంకర సంహితలో -

"యే రుద్రలో కాదవతీర్య రుద్ర-మానుష్యమాశ్రిత్య జగద్ధితాయ చరంతినానావిధచారుచేష్టా-స్తైభ్యోనమస్త్ర్యం బక పూజకేభ్యః ।

తా॥ ఏ పరమాత్ముఁడు రుద్రలోకము నుండి భూలోక మున కవతరించి సమస్తలోకహితమునకై మానుషరూపమును

దాల్చి సంచరించుచున్నాడో అట్టి జంగమామూర్తికి నా నమ స్కారమని చెప్పబడినది.

జంగమపద నిర్వచనము :-ఆగమ ప్రమాణములలో

శ్లో॥ జకారం గురు రూపంచ-గకారం లింగమేవచ ।
మకారం జంగమంచైవ-సర్వకర్తాచ జంగమః ॥
(వీరాగమము)

శ్లో॥ లింగాధీనం జగత్సర్వం-లింగంబ్రహ్మాండమేవచ ।
తల్లింగం జంగ మాధీనం-జంగమోమమదేవతా ॥ (,,)

శ్లో॥ అంగమాశ్రిత్య ఆచారం-తదంగం ప్రాణమాశ్రితం ।
తత్ప్రాణ మాశ్రితం లింగం-తల్లింగంజంగమాశ్రితం॥
(గరుడపురాణము)

శ్లో॥ కోటితీర్థంనదీస్నానాత్-కోటిలింగార్చనం జపాత్ ।
కోటిక్షేత్రాత్యత్పుణ్యం-విశేషంచరపూజనే ॥

॥శివమ్ భూయాత్॥

వీరశైవ దర్పణము ఫిబ్రవరి, 1990

వీరశైవులు తప్పనిసరి జ్ఞాపకము నందుంచ దగిన

## అతి ముఖ్యములైన వీరశైవ ధర్మ విషయములు

రచన :- పండిత రాచవీర దేవర

1. (మూలమునకు ముందు) శివమూర్తి
2. వేదమూర్తి (వేదమునకు ముందు)

3. మ,ని,ప్ర,స్వ. శ్రీమన్ నిరంజన ప్రణవస్వరూపి.
4. మ,ఘ,చ, శ్రీమద్ఘన లింగ చక్రవర్తి
5. ష,బ్ర. శ్రీషట్ స్థల బ్రహ్మ.
6. శ్రో,బ్ర. శ్రోత్రీయ బ్రహ్మనిష్ఠ.
7. త్రివిధ గురువులు :- 1. దీక్షాగురువు, 2. శిక్షాగురువు 3. మోక్షా గురువు.
8. త్రివిధ దీక్షలు :- క్రియా దీక్ష, 2. మంత్ర దీక్ష, 3. వేదా దీక్ష.
9. త్రివిధ ప్రసాదములు :- 1. శుద్ధ ప్రసాదము, 2. సిద్ధ ప్రసాదము 3. ప్రసిద్ధ ప్రసాదము.
10. త్రివిధ ప్రసాదకులు :- 1. సమయ ప్రసాది, 2. నిచ్చ ప్రసాది, 3. అచ్చ ప్రసాది.
11. త్రివిధార్పణములు :- 1. కాయార్పణము 2. కరుణార్పణము 3. భావార్పణము.
12. త్రివిధ తనువులు :- 1. స్థూలతనువు, 2. సూక్ష్మ తనువు, 3. కారణ తనువు.
13. అంగత్రయము :- 1. త్యాగాంగము, 2. భోగాంగము, 3. యోగాంగము.
14. జీవత్రయము :- 1. విశ్వము, 2. తైజసము 3. ప్రాజ్ఞ.
15. గుణత్రయము :- 1. సత్వగుణము, 2. రజో గుణము, 3. తమో గుణము.

16. అవస్థాత్రయము :- 1. జాగ్రత్, 2. స్వప్న, 3. సుషుప్తి.
17. లింగత్రయము :- 1. ఇష్ట లింగము, 2. ప్రాణలింగము, 3. భావ లింగము.
18. త్రివిధ కర్మలు :- 1. సంచితము, 2. ఆగామి, 3. ప్రారబ్ధము.
19. తాపత్రయము :- 1. ఆధ్యాత్మికము, 2. ఆదిభౌతికము, 3. ఆది దైవికము.
20. అంతఃకరణ చతుష్టయము :- 1. మనస్సు, 2. బుద్ధి, 3. చిత్తము, 4. అహంకారము.
21. చతుర్విధ అనుభవము :- 1. ధ్యానము, 2. మౌనము, 3. సత్యము, 4. నియమము.
22. పంచభూతములు :- 1. పృథ్వి 2. అప్పు, 3. తేజ, 4. వాయు, 5. ఆకాశము.
23. పంచ జ్ఞానేంద్రియములు :- 1. ముక్కు, 2. కన్నులు, 3. నాలుక, 4, చర్మము, 5. చెవి.
24. పంచ కర్మేంద్రియములు :- 1. వాక్కు, 2. పాణి, 3. పాదము, 4. గుద, 5. గుహ్యము.
25. పంచ విషయములు :- 1. శబ్దము, 2. స్పర్శము, 3. రూపము 4. రసము, 5. గంధము.
26. పంచాచారములు :- 1. లింగాచారము, 2. సదాచారము, 3. శివాచారము, 4. గణాచారము, 5. భృత్యాచారము.

27. పంచవిధ భస్మము :- 1. విభూతి, 2. భసితము, 3. భస్మము, 4. క్షారము, 5. రక్ష.

28. షట్ స్థలములు :- 1. భక్త, 2. మహేశ, 3. ప్రసాది, 4. ప్రాణలింగి, 5. శరణ, 6. ఐక్యము.

29. అరిషడ్వర్గము :- 1. కామము, 2. క్రోధము, 3. లోభము, 4. మదము, 5. మత్సరము.

30. షడూర్మి :- 1. ఆకలి, 2. దాహము, 3. సుఖము, 4. దుఃఖము, 5. జననము, 6. మరణములు.

31. షడ్విధభక్తి : 1. శ్రద్ధా భక్తి 2. నిష్ఠా భక్తి, 3. అవధాన భక్తి, 4. అనుభవ భక్తి, 5. ఆనంద భక్తి, 6. సమరసభక్తి.

32. సప్త వ్యసనములు :- 1. తను వ్యసనము, 2. మనో వ్యసనము 3. క్రోధ వ్యసనము, 4. విషయ వ్యసనము, 5. ధన వ్యసనము, 6. రాజ్య వ్యసనము, 7. సేవక వ్యసనము.

33. సప్త జన్మలు :- 1. సస్య జన్మ, 2. క్రిమి జన్మ, 3. పక్షి జన్మ, 4. పశు జన్మ, 5. రాక్షస జన్మ, 6. మానవ జన్మ, 7. దేవ జన్మ.

34. అష్టావరణములు :- 1. గురు, 2. లింగ 3. జంగమ 4. పాదోదకము, 5. ప్రసాదము, 6. విభూతి, 7. రుద్రాక్షి, 8. మంత్రము.



పి. ఎం. బసవరాజదేవర పి. ఎం. ప్రభులింగదేవర
మరియు పి. ఎం. శివరాణి



వి. వి. హాస్టలు హైదరాబాదులో శ్రీ వాగీశ పండితారాధ్యులవారి
అధ్యక్షతన ఉపన్యసిస్తున్న పం॥ రాచవీరదేవరగారు

35. అష్ట సిద్ధులు :- 1. అణిమా, 2. మహిమ, 3. గరిమా, 4. లఘిమా, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్య, 7. ఈశత్వము 8. వశిత్వము.

36. అష్ట విధార్చనలు :- 1. భస్మము, 2. గంధము, 3. అక్షతలు, 4. పత్రి, 5. పుష్పములు, 6. ధూపము, 7. దీపము, 8. నైవేద్యము.

37. అష్ట మదములు :- 1. కులమదము, 2. బల మదము, 3. ధనమదము, 4. రూపమదము, 5. యౌవనమదము, 6. విద్యామదము, 7. తపో మదము, 8. రాజ్యమదము.

38. అష్టైశ్వర్యములు :- 1. రాజ్యము, 2. భాండారము, 3. సైన్యము, 4. గజము, 5. అశ్వము, 6. ఛత్రము, 7. చామరము, 8. పల్లకి.

39. అష్టాంగ యోగములు :- 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధ్యానము 7. ధారణము 8. సమాధి.

40. నవ లింగములు :- 1. ఆచార లింగము, 2. గురు లింగము, 3. జంగమలింగము, 4. శివలింగము, 5. ప్రసాదలింగము, 6. మహాలింగము, 7. ఇష్ట లింగము, 8. ప్రాణ లింగము, 9. భావ లింగము.

41. నవరసములు :- 1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణ, 4. రౌద్రము, 5. వీరము, 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము, 9. శాంతము.

42. దశవిధ పాదోదకము :- 1. గురు పాదోదకము, 2. లింగ పాదోదకము, 3. జంగమపాహోదకము, 4. స్పర్శ పాదోదకము, 5. అవధానోదకము 6. ఆప్యాయనోదకము 7. హస్తోదకము, 8. పరిణామోదకము, 9. నిర్నామోదకము, 10. సత్యోదకము.

43. ఏకాదశ ప్రసాదము :- 1. గురు ప్రసాదము, 2. లింగ ప్రసాదము, 3. జంగమ ప్రసాదము, 4. ప్రసాది ప్రసాదము, 5. సమయ ప్రసాదము, 6. భోజ్య ప్రసాదము, 7. అప్యాయతప్రసాదము, 8. భక్ష్యప్రసాదము, 9. చోహ్యప్రసాదము, 10. లేహ్యప్రసాదము, 11. తృప్తి ప్రసాదము.

44. ఇరువది యెనిమిది ఆగమములు:- 1. కామికాగమము, 2. యోగజము, 3. చింత్యము, 4. కారణము, 5. అజితము 6. దీప్తము, 7. సూక్ష్మము, 8. సహస్రము, 9. అంశుమంతము, 10. సుప్రభేదము, 11. విజయము, 12. నిశ్వాసము,13. స్వాయంభువము, 14. అనలము, 15. వరము, 16. రౌరవము, 17. మకుటము, 18. విమలము,

19. చంద్రజ్ఞానము, 20. బింబము, 21. ప్రోద్గీతము, 22. లలితము, 23. సిద్ధము, 24. సంతానము, 25. సర్వోత్తరము, 26. పారమేశ్వరము, 27. కిరణము, 28. వాతులాగమము.

వీరశైవ దర్పణము ఫిబ్రవరి 1990



హైదరాబాదు - ఆకాశవాణి - ప్రసంగము

## అ మ ర వా ణి

## సూ క్తి సు ధా

"విశ్వశ్రేయః కావ్యమ్" అను కావ్యోక్తి లక్షణమున ననుసరించి కావ్యములు లోక కళ్యాణమునకై లాక్షణికులు చెప్పియున్నారు. మరియొకచోట కూడా "రామాదివత్ప్రవర్తితవ్యమ్ న రావణాదివత్" అనగా ప్రతిమానవుడు రామునివలె ప్రవర్తించాలి కాని రావణుని మార్గము అనుసరించరాదు. అనునట్టి నీతి ప్రబోధకములైన కావ్యముల మాదిరిగానే, కొన్ని సూక్తులు గూడ అనుభవజ్ఞులచేత 'అల్పాక్షరములలో అనల్పార్థములను స్ఫురింప చేయు సూక్తులను చెప్పియున్నారు. తమ జీవితానుభవములలోని సుఖదుఃఖాది రసానుభూతులను వ్యక్తపరచి, వినువారలను

హృదయస్పందనము కలిగే లాగున చెప్పి, ముందు తరంవారి కల్యాణమునపేక్షించి చెప్పిన మధురోక్తులనే "సూక్తి సుధా" అని మనము చెప్పుకుంటాము. ఇట్టి సూక్తిసుధా రసస్రవంతిలో భక్తి, జ్ఞాన, వైరాగ్య, శృంగార, హాస్యము మున్నగు నవరసములు అక్కడక్కడ గోచరించుచుండును. మనోహరములైన అలంకారములు గూడ ఇందులో పొదగింపపడినవి. అయితే కావ్యములోని కథావస్తువు ఒకటే అయి ఆద్యంతములకు సంబంధించి యుండును. కాని ఈ "సూక్తిసుధ, అను శ్లోకములు మాత్రము ఏదానికదే ప్రధాన వస్తువై జనుల హృదయాలను స్పందింపచేసి, రంజింపఁజేయుననుటలో సందేహము లేదు. అలాంటి సుధాసూక్తులలో కొన్నింటిని మాత్రమే ఏరి కూర్చియున్నాడను. శ్రీ రేణుకాద్యాచార్యుల, బసవాది ప్రమథుల శివయోగిశివాచార్యుల శివశరణుల వచనములే ఇందుకుదాహరణాలు.

శ్లో॥ ఓం నమో లింగరూపాయ, జగజ్జన్మాది హేతవే ।
నిగమాగమ వేద్యాయ, భక్తసిద్ధి ప్రదాయినే ॥

ప్రణవ స్వరూపమగు, ప్రపంచ సృష్టికి కారణభూతమగు వేదాగమాదులచేత తెలియదగు మరియు భక్తులయొక్క కోరికలను నెరవేర్చునట్టి ఆ పరశివమూర్తికి (లింగమూర్తికి) నా నమస్కారము.

శ్లో॥ బీజేఖత్వేష బీజానాం, జ్యోతిరేక ప్రకాశతే ।
బాలక్రీడనిభై రేవ, క్రీడతేశంకర స్వయం ॥

సమస్త బీజములకు ప్రధాన బీజ రూపమైన, జ్యోతి యొకటి ప్రకాశించును. ఆ జ్యోతి స్వరూపుడైన శివుండే స్వయముగా ప్రపంచాన్ని సృష్టించి దానితో దాలక్రీడతో సమానముగానాడుచున్నాడు.

శ్లో॥ స్నాపయిత్వా విధానేన, యోలింగంస్నపనోదకం।
త్రిః పిబేత్ త్రివిధంపాపం, తస్యేహాసుప్రణస్యతి ॥

ఎవడైతే ఇహమందు విధివిధానముతో (శాస్త్రప్రకారముగా) ఇష్టలింగమునభిషేకించిన తీర్థమును మూడుసార్లు సేవించినట్టి వాడికి కాయ, వాచ, మానసిక సంబంధమైన పాపములు నశించునని కాశీ ఖండములో చెప్పబడియున్నది.

ఆయొక్క జ్యోతిర్లింగమై ప్రకాశించుచున్నదని చెప్పుటలో ఎంత మాత్రము అనుమానము లేదని వేదాగమాల సారభూతమైన సిద్ధాంత శిఖామణిలో నిరూపించబడినది.

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వాదయోదేవాః, సర్వేవేదాదయస్తథా.

లియంతేయత్ర గచ్ఛంతే, తల్లింగం బ్రహ్మ కేవలం
(11-35 (సి.శి.) లింగస్థలం) బ్రహ్మ విష్ణ్వాది దేవతలు, మరియు సమస్త వేదములు, యెక్కడైతే లయమగుచు మరియు అక్కడే పుట్టుచున్నవో. అదేలింగమైన పరబ్రహ్మస్వరూపం

బైనదని, సిద్ధాంత శిఖామణి గ్రంథకారుడు విశదీకరించి యున్నాడు.

నాల్గాశ్రమములలో గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనది.

శ్లో॥ యస్మాత్రయోZప్యాశ్రమిణో, దానేనాన్నేన చాన్వహమ్.
గృహస్థేనైవ ధార్యంతి, తస్మాచ్ఛ్రేష్ఠాశ్రమో గృహి॥
మనుస్మృతి, 76

చతురాశ్రమములలో బ్రహ్మచర్యము, వానప్రస్థము, సన్యాసాశ్రములకంటెను. గృహస్థాశ్రమమే చాల శ్రేష్ఠమైనదని చెప్పబడినది. ఏలనన ఆహారపానీయాదుల, ప్రదానములచేత ఈ గృహస్థునిపైననే మిగతా మూడు ఆశ్రమములవారు ఆధారపడి జీవించుచున్నారు.

శ్లో॥ అద్భిర్ గాత్రాణి శుధ్యంతి, మనఃసత్యేన శుధ్యతి.
విద్యాతపోభ్యాం భూతాత్మా - బుద్ధిర్ జ్ఞానేన శుధ్యతి
॥మనుస్మృతి॥ ఐదు. శ్లో. 10.

జలము దేహమును శుభ్రపరచును, సత్యమునే మాట్లాడుటవలన మనస్సుశుద్ధియగును.

విద్యాతపంబులచేత ఆత్మశుద్ధి యగును. జ్ఞానముచేత బుద్ధి నిర్మలమగును.

శ్లో॥ దృష్టిపూతం న్యసేత్పాదం, వస్త్రపూతం జలంపిబేత్,
సత్యపూతం వదేద్వాచం, మనఃపూతం సమాచరేత్.

మనుస్మృతి. 76.

ముందుచూచి అడుగిడవలెను. వడియగట్టిన నీరుద్రాగవలెను. సత్యముచేత పవిత్రమైన మాటనే పలుకవలెను. నిర్మలమైన మనస్సుచేత ఆచరించవలెను.

శ్లో॥ ఆయుర్నశ్యతి, పశ్యతాం ప్రతిదినం యాతిక్షయం యౌవ్వనం.
ప్రత్యాయాంతి గతాన పునర్నదివసాః॥ లక్ష్మితోయతరంగవచ్చపలా విద్యుచ్చలం జీవితం. తస్మాన్మాంశరణాగతం కరుణయాత్వం రక్షరక్షాధునా2

ఓయీ। మానవుడా ప్రతిదినము ఆయుష్యము నశిస్తుంది. యవ్వనము నశిస్తుంది. గడిచిన దినములు మళ్ళీరావు. కాలుడు ప్రపంచాన్ని భక్షించ జూచుచున్నాడు. లక్ష్మి(సంపద) నీటి తరంగమువలె చంచలచిత్తముగలది. జీవితము గూడ మెరుపు తీగవంటిది. ఆ కారణముచేత ఓ పరమాత్మా! నీకు శరణాగతుడనైన నన్ను నీవు కరుణతో రక్షించుమా! అని ఓ భక్తుడు సవినయముగ దేవుని ప్రార్థించుచున్నాడు.

ఇట్లు:- సంగ్రహణకర్త
పి.ఎం. రాచవీరదేవర "శిష్ట" మరియు
ఎం.ఓ.ఎల్. సిద్ధమఠము
దూద్‌బౌలి, ఇంటి నెం. 3-3-139,
హైదరాబాద్-27.

ఓం

# సూ క్తి సు ధా

అనువాదకులు :
పండిత పెద్దమఠం రాచవీరదేవర
"తీర్థ" & M.O L. ఉపన్యాసకులు
**N.M.G.A.S** డిగ్రీ కళాశాల, జోగిపేట

వచనము : భక్తనులింగార్పిత మాడిద పత్ర భాజనవన్ను
శ్వాన, సూకర, గార్ధభ, కుక్కుట, మార్జాలంగళు
ముట్టిదొడె, అవుగళకూడె సహభోజనవ
మాడిదంతె కాణిరణ్ణా
భక్తుడు లింగార్పితము జేసిన విస్తరి భాజనము
శ్వానము (కుక్క) సూకరము (పంది) గార్దభము
(గాడిద) కుక్కుట (కోడి) మార్జాలం (పిల్లి)
ఇవి ముట్టినచో, వాటితో సహ భోజనము
జేసిన యట్లయగును చూడుసుమా...........

వచనము : ఇళెనిమ్మాదాన, బెళెనిమ్మదాన
సుళిదుసూసువగాళి నిమ్మదాన
నిమ్మదానవనుండు, అన్యరహోగళువ
కున్నిగళనేనెంబె రామనాథ ॥

శయనక్కెహోశుదేగులగశుంటు.
చన్న మల్లికార్జునయ్యా !
ఆత్మసంగాతక్కెనీనెనగుంటు ॥

కిన్నరి బొమ్మయ్య ఆమెను బరీక్షించుటకై ఆమె యొక్క బాహ్యాడంబరమును ఖండించినప్పుడు అక్కమహాదేవి ఇలా సమాధానమిచ్చినది.

వచనము : అంగదభంగవ లింగదసుఖదిందె గెలిదె.
మనద భంగవ ఆరుహినముఖదిందెగెలిదె.
జీవనద భంగవళి దానుభవదిందె గెలిదె.
జవ్వనద హారమించినల్లి నిమ్మ కణ్ణింగె తోరువ
కామనసుట్టురుహిద భస్మవనోదయ్యా ॥

అల్లమ ప్రభు శివానుభవమండవమునకు అక్క మహాదేవి వచ్చినప్పుడు అమె యాకారమును జూచి దేహముపైనున్న మోహమును బరిత్యజించనిదే కేవలము వేషమును ధరించినంత మాత్రమున గుహేశ్వరుడు మెచ్చుకొనడన్నపుడుగూడ దగిన సమాధానమిచ్చను.

వచనము : కాయకట్టినే కందిదరేను ?
కాయమిట్టినే మించిదరేను ?
చెన్న మల్లికార్జునను ఒలిదకాయ హేగిద్ద
రేనయ్యా ! అని సధామానమిచ్చను.

నిజముగా నాదేవి చన్నమల్లికార్జునిఁగూడి దనజీవిత మును గడిపినది. చిరంజీవి యైనది. అమృత పుత్రికగా మారి నది. చన్న మల్లికార్జుని దివ్య దేహమను దివ్యజ్యోతియందు మహాదేవి యక్కగారి యాత్మ అగ్నిసోకిన కర్పూరము మాదిరి లీనమైపోయినది. భవమును వీడినది.

వచనము : లింగవెన్నె లింగైక్య వెన్నె
సంగవెన్నె సమరస వెన్నె
ఆయిత్తెన్నె ఆగదెన్నె, నానెన్నె - నీనెన్నె
చన్న మల్లికార్జుననల్లి లింగైక్య వాదబళిక
ఏనూ అన్నె ॥

శ్లో॥ ప్రాణలింగం పరిత్యజ్య
అన్యలింగముపాసయన్ ।
శ్వానయోనిశతంగత్వా
చాండాల గృహమాచరెత్ ॥౧॥

తా॥ ప్రాణలింగమునువీడి, అన్యలింగము నుపాశించినచో వందసార్లు కుక్కయోని యందు జన్మించును. చివరికి చండా లునిగృహ నివాసము గలుగునని తాత్పర్యము—

వచనము : సావిల్లద కేడిల్లద రూహిల్లద
చెలువంగెనానొలిదెనవ్వా !
ఈ సావకెసడువగండర నొద్దు
ఒలియొళగికిక్కు.

జననమరణములు రూపములేని అందగాణ్ణి నేను వరించి తినమ్మ. ఈ జనన మరణములకు లోబడిన ఈ భర్తలను వరించనని నుడివినది. తనను కౌశికుడు బెండ్లియాడుటకేలాంటి యభ్యంతరము లేదు. కాని పెండ్లి తరువాతగూడ నేను 1. లింగ పూజను, 2. గురులింగ జంగమ దాసోహమును. జేయుచుండ గలను, 3. ఆ సందర్భమున నీవు నన్ను బీడింపఁదగదని, నిశితములైన, నిబంధనలు బెట్టి మొదలె కౌశికరాజును హెచ్చ రించినది.

వచనము : తరణియ హుళుతన్న స్నేహదల్లి మనెమాడి
తన్న నూలుతన్న సుత్తిసావ తెరనంతే
మనబందుదబయసి బేవుత్తిద్దెనయ్యా !
ఎన్నమనద ఆశయ నివారిసి నిమ్మత్త తోరా !
చన్న మల్లికార్జున

సాలె పురుగు ప్రేమతో తంత్రులనల్లి ఇల్లుగా జేసికొని. అందేఉండి మరలిజనకందేబడి చచ్చునట్లు, మనసుకోరిన వానిని బడయక బాధ జెందుచుంటిని. కాన నో మల్లికార్జున! బంధము లను ద్రుంచి మిమ్ము దర్శించు మార్గమును జూపుమని వేడును.

పచనము : నెలదమరెయనిధానదంతె.
తిలద మరెయ తైలదంతె.
శిలదమరెయ హేమదంతె.
భావద మరెయ బ్రహ్మవాగిప్ప, చెన్న మల్లికార్జున
నిమ్మ నిలవనారు అరియలు బారాదు ॥

వచనము : "చిలిబిలిచిలిబిలి యెందోదువగిళిగళిరా !
నీవు హేళిరె." అని అక్కమహాదేవి విలపించినది.

## -: బసవేశ్వర భావోద్గార తరంగిణి :-

వచనము : ఎన్నవామక్షేమ నిమ్మదయ్యా !
ఎన్నమానాపమాన నిమ్మదయ్యా !
ఎన్నహాని వృద్ధి నిమ్మదయ్యా !
బళ్ళిగెకాయి దిమ్మిత్తె ?
కూడల సంగమదేవా ॥

తా॥ నా వామక్షేమములుమీవే అయ్యా :
నా మానాపమానములుమీవే అయ్యా !
నా హెచ్చుతగ్గులు మీవే అయ్యా !
తీగకు కాయబరువా ? కూడల సంగమదేవా ॥

వచనము : "చకోరంగె చంద్రమన ఉదయదచింతె.......

తా॥ చకోరమునకు చంద్రుని వెన్నెల చింత !
కమలమునకు సూర్యోదయము చింత !
భ్రమరమునకు పుష్పోడి సుగంధము నాను చింత!
నాకు మా కూడల సంగమదేవుని స్మరించుటే చింత!

వచనము : నా నిమ్మనెనెవెను-నీ వెన్న నరియిరి !
నా నిమ్మనోలైసువెను - నీ వెన్నకాణిరీ.
నా నెంతు బదుకువె - ఎంతుజీవిసువేనయ్యా !
కూడల సంగమదేవా ఎనగెనీవే గతిమతినోడయ్యా

తె॥ అందలమునెక్కిన శ్వానమురీతి
చూచిన వీడదు దన మొదటి స్వభావమును.
కాల్చుము కాల్చు మీ మనసు విషయములకై
పరుగిడును. మృత్యుంజయా ! నిన్ను ప్రతి దినము
స్మరింప నీయదు నా ప్రభువా ?
కూడల సంగమదేవ మీ చరణములను స్మరించు
నట్లొనర్చుము. కొంగు చాచి వేడితిని.
ఇదియే మీ ధర్మము ॥

వచనము : కల్లనాగరకండరే హాలనెరెయెంబరు.
దిటనాగరకండరే, కొల్లు కొల్లెంబరయ్యా !
ఉంబువ జంగమ బందరె నడెనడెయెంబరు.
ఉణ్ణదలింగక్కె బోనవహిడియెంబరయ్యా !
నమ్మ కూడల సంగమ శరణర, కండు
ఉదాసీనమాడిదరేకల్లతాగిదమిట్టియంతిప్పరయ్యా॥

తె॥ జాతినాగులఁ జూచిన పాలు బోయుడందురు.
నిజమైన నాగుబామును జూచిన చంపుమందురయ్యా!
ఆకొని జంగమమేగుదెంచిన ముందుకు
పదపద యందురు. తినని లింగమునకు
బోనమును బెట్టుమందురయ్యాఁ మా
కూడల సంగమ శరణులఁజూచి -
(ఉదాసీనముతో నుందురయ్యా)

వధింపఁజేసి నీ మనోరథ సిద్ధిని బొందగలవు. భూలోకమునందు సుఖముగా రాజ్యమును బరిపాలించి, అంతమున శివ సాయుజ్యమును బడయగలవు. అని ఆగస్త్య మహాముని శ్రీరామున కుపదేశించెను.

అందుకు శ్రీరాముడు-

శ్లో॥ కృతార్థోఽహంముని శ్రేష్ఠ-వాంఛితార్థో మమాగతః
పీతాంబుధి ప్రసన్న స్త్వం-యదిమేకిముదుర్లభం ॥
అత స్త్వం విరజాందీక్షాం-బ్రూహిమే మునిసత్తమ ।

ఓయీ ! మునివరేణ్యా ! నేను కృతార్థుడనైతిని. సముద్రమునే ఆపోశనము గావించిన నీలాంటి మహాపురుషుడు ప్రసన్నుండవైన ఇదప నాకు ఏది తానె దుర్లభము ? కావున నాకు మీరే శివదీక్ష నొసఁగి శివలింగ పూజాధికారమును అనుగ్రహించవలెను. అని ప్రార్థించెను, అదేమేరకు ఆగస్త్యమహర్షి శాస్త్రోక్తముగా శ్రీరామునకు శివదీక్ష నొసఁగి, పాశుపత వ్రతమును, దానికంగభూతములైన భస్మ రుద్రాక్షల మహత్వమును వివరించి, శివలింగ పూజా విధానమును ఉపదేశించి, తన ఆశ్రమమునకుఁ తరలిపోయెను. అదే ప్రకారముగా శ్రీరాముడు మహా శివభక్తుడై శివపూజకు ఉపక్రమించెను.

శ్లో॥ అథరామగిరౌ రామః-పుణ్యేగోదావరీతటే ॥
శివలింగం ప్రథిష్ఠాప్య కృతాదీక్షాంయధావిధి ॥
భూతిభూషిత సర్వాంగో-రుద్రాక్షాభరణైర్యుతః ।

గౌతమి, సింధు మొదలగు పుణ్యనదులలో స్నానమొనర్చి భస్మ రుద్రాక్షాదులతో భూషితుండై గోదావరీ నదీ తీ మున రామగిరి యందు శివలింగాన్ని ప్రతిష్టించి శివ లింగమును బూజించుట కారంభించెను, ఒక మాసము వరకు పండ్లను భక్షిస్తు, మరో మాసము పండ్లను వదలి పత్రములను భక్షిస్తు. ఆ పీతట వాటిని వదలి నీటిని మాత్రమే స్వీకరించి. ఆ పిదప కేవలము వాయువే ఆహారముగా గలవాడై తన హృదయ కమలమునంధు పార్వతీ వల్లభుం డైన ఆ పరశివలింగమూర్తిని యెడవిడకుండ ఆరాధించుచుండెను. ఇట్లు నాలుగు మాసముల వరకు అత్యుగ్రవ్రతము నాచరించగా నింతలోనే ప్రళయ కాలమునందలి ఉరుము తెరంగున అతి భయంకరంబైన ఒకానొక ధ్వనియుప్పతిల్లెను. (కలిగెను.) భయ భ్రాంతితో గూడినవాడై ముఖము పైకెత్తి చూడగా ఒక అద్భుత మైన తేజస్సు అగుపించెను. అప్పుడు శ్రీరాముడు ఇది రాక్షసుల యొక్క మాయగా భ్రమించి యుద్ధమునకు సంసిద్ధుడై తన విల్లలను, చక్రము - మహాచక్రము - కాలచక్రము మొదలగునసేకానేక అస్త్రములను ప్రయోగించెను. ఇవన్నియు సముద్రమున బడిన వడగండ్లవలె ఆ తేజోమండలములో మాయ

మైనవి. అట్టి భయంకరమగు దృశ్యమును జూచి లక్ష్మణుడు భయకంపితుడై నేలకొరిగెను. శ్రీరాముడు గూడ చేయునదిలేక దిక్కుతోచక భయావిష్టుడై భూమిపై మోకాళ్ళూని నేత్రములు మూసికొని ఉచ్చ స్వరమునుండి శివసహస్ర నామముల నుచ్చరించుచు శివుని గురించి నానావిధమగు స్తోత్రములతో ప్రార్థించెను, అంతలో మరోసారి భయంకరమగు శబ్దము వినబడెను. భూమి కంపించినది. పర్వతములు చలించినవి. పైకిలేచి చూచు నంతలో వృషభారూఢుండైన పరమ శివుడు ప్రత్యక్షమై విజయమునకు సాధనభూతములగు పాశుపతాది మహాస్త్రములను అనుగ్రహించెను. ఇట్లు శివదీక్షా ప్రభావముచేత శ్రీరాముడు బలశాలియైన రావణుని సంహరించి సీతనుగొనివచ్చి లోక కల్యాణము నొనర్చెను.

卐卐

## జగద్గురు శ్రీ రేణుకాచార్య సంస్కృత వైదిక కళాశాల స్థాపన,

ఆంధ్ర భాషను సుసంపన్నము చేయుటకు సంస్కృత పరిజ్ఞానము ఎంతయో అవసరము. కనుక సంస్కృతమునభ్యసింపగోరు విద్యార్థుల కొరకు ప్రత్యేకించి పండిత పెద్దమఠం రాచవీరదేవరగారి ఆధ్వర్యంలో ఒక సంస్కృత పాఠశాలను ప్రస్తుతము వాణీ అప్పర్‌ప్రైమరీ స్కూల్, మున్సిపల్ కాలనీ, మలక్‌పేట్, హైద్రాబాద్‌నందు స్థాపించబడినది. ప్రాథమిక తరగతులు ఉదయం 7 గం. నుండి 9 గం. వరకు మరియు కళాశాల సాయంత్రం 4 గం. నుండి 6 గం. వరకు జరుపునట్లు తెలుపబడినది.

వీరశైవ దర్పణము మార్చ్, 1991

# వీరశైవ అష్టావరణములలో గురువు ప్రాశస్త్యము

రచన :- పండిత రాచవీరదేవర "తీర్థ" మరియు ఎం.ఓ.ఎల్.

వీరశైవ ధర్మమునకు అష్టావరణములు: పంచాచారములు, షట్స్థలములు ప్రధానాంగములు. ఈ ధర్మమునకు అష్టావరణములు అంగములై యుండగా పంచాచారములు ప్రాణములై, షట్ స్థలములు ఆత్మయైయున్నవి. ఇవి వీరశైవ ధర్మముయొక్క సామాన్య లక్షణములు. కనుక వీరశైవ జన సామాన్యమునకు వీటిని క్షుణ్ణముగా తెలిసికొనుట ముఖ్యావసరముగా నున్నవి. వీరశైవ దర్పణములో ప్రచురించబడు ఈ వ్యాసములు సాధారణ వివరణములతోపాటుగా విశేష విజ్ఞాన వితరణ కలిగియున్నందున పండితులకు కూడ ఇవి ఉపయుక్తము కాగలవన్న భావన రచియితలకు కలిగినది. గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, విభూతి, రుద్రాక్ష, మంత్రములు వీరశైవ ధర్మమునకు అష్ట (8) ఆవరణములు. నేటి ఈ వ్యాసము 'గురువు', అను మొదటి అంశంతో ఆరంభమగుచున్నది. పాఠకులు గమనించ మనవి.

- ఎడిటర్.

## : జంగమమే నాకు ప్రాణము :

వచనము : సింగక్కొలిద మదకరియంతె.
ఆను జంగమక్కొలిదెనయ్యా !
కూడల సంగమదేవా !

తా॥ సింహమునకు వలచిన మదపుటేనుఁగు మాదిరి నేను జంగమునకు వలచితినయ్యా. కూడలసంగమదేవ.

వచనము : జన్మజన్మక్కె హోగలీయదే సోహం, ఎందెనిసదే : "దాZసోహం" నిందెనిసయ్యా ! లింగజంగమద ప్రసాదవతోరిబదుకినయ్యా ? కూడలసంగమదేవా !

తా॥ జన్మజన్మలకు బోనీయక "స్యోఽహం" అని పింపక "దాసోహం" అనిపించుమయ్యా ! లింగజంగ మంబుల ప్రసాదములను జూపి బ్రదుకించుమయ్యా! కూడలసంగమ దేవ ॥

వచనము : ఆవాపభావదల్లి-మాడికూడి హెవెంబవర
బాగిలతోరయ్యా ! తనువనొప్పిసిదవర, మనవ
నొప్పిసిదవర, ధనవనొప్పిసిదవర, బాగిలతోరయ్యా!
ఇవనెల్లవనొప్పిసి జంగమవెన్నవరెన్నవరెన్నవరెం ;
బవర కెరహహో త్తిరిసెన్నను, కూడలసంగమదేవా

తా॥ ఏయే భావములనాచరించి కూడియుండినవారి ద్వారమును జూపుమయ్యా! తనువు నర్పించినవారి, మనసు నర్పించినవారి, ధనమునర్పించినవారి, ద్వారమునుజూపుమయ్యా వీటన్నింటిని సమర్పించి జంగమములు నావారు నావారు, నావారు అనువారి పాదరక్షలకింద నొక్కిఉంచుమయ్యా! కూడలసంగమ దేవ ॥

వచనము : కైవిడిదసజ్జనియెందుసంబిద్దెనయ్యా! అయ్యో!
నమ్మయ్యన కయ్యనొందిత్తుతెగెదుకొడా ఎలా
చాండాలగిత్తి కళ్ళనమనెగొబ్బ బలుగళ్ళ
బందరే సాక్షాత్సంగమనాథనల్లదే బేరేయల్ల!

బసవేశ్వరునికి జంగములయంద నిర్వచనీయమైన భక్తి యుండేది. శ్రీ బసవేశ్వరులవారు జంగమవేషమున తమ పడక గదిలోకి ప్రవేశించిన దొంగను జూచి తన ధర్మపత్నియగు గంగ మాంబనిట్టు మందలించియున్నాడు.

తా॥ సజ్జనురాలని నేను నిన్ను పాణిగ్రహణమొనర్చితిని. అయ్యో! మాయయ్యగారిచెయ్యి నొప్పిడుతుంది. తీసి ఇవ్వవె ఓయీ! చాండాలిని! దొంగ ఇంటికి గజదొంగగా విచ్చేసినాతడు సాక్షాత్తుగా సంగమనాథుడే - గాని వేరు గాదని మందలించి యున్నాడు. ఇట్టి యసామాన్యమైన భక్తి నేటి భక్తులయందెక్కడుంది? ఇప్పటిభక్తులలో కొందరు జంగమనింద యొనర్చువారే ఎక్కువగానున్నారు. గాని శ్రీ బసవేశ్వరులవారివంటి నిజమైన భక్తిగలవారున్నారా?

వీరశైవ దర్పణము జనవరి-1991

॥ఓం॥

శివగీతాసారము:- అథవా

# శ్రీరాముడు శివలింగమునర్చించాడు.

రచన : పండిత పెద్దమఠము రాచవీరదేవర

తొల్లి శ్రీరాముడు దండకారణ్యమును ప్రవేశించిన సమయములో దుర్బుద్ధి (విధి) ప్రేరణ వలన ముల్లోకములను దన బాహుబలముతో జయించి ఏక ఛత్రాధిపత్యముగా లంకను పరిపాలించిన రావణాసురుడు సీతను అపహరించాడు. శ్రీరాముడు సీతా వియోగమును భరించనివాడై పరితపించుచుండగా భగవాన్ అగస్త్య మహర్షులవారు శ్రీరాముని కడకేతెంచెను, శ్రీరాముడు భక్తిమీర వారిని సత్కరించి సాష్టాంగ ప్రణామంబులనాచరించినవాడై ఓయీ! మహర్షిపుంగవా! సీతాదేవియొక్క వియోగము వలన బొడమిన దుఃఖమును భరించకున్నాను. ఇట్టి దుఃఖోపశమనమునకు ఏదైన యొక మార్గమును ఉపదేశింపుము అని వేడుకొనెను. అందుకు అది విని అగస్త్యమహర్షి ఓయీ! శ్రీరామా! రావణుఁడు బహు పరాక్రమశాలే గాకుండ, దుర్జయులైన ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, విభీషణుఁడు మొదలగు మహాబలశాలులైన రాక్షసుల సహాయముగలవాడగుటచేత ప్రస్తుతము నీవు అతనితో యుద్ధము జేయలేవు. అతనిని బరిమార్చ

నిదే నీకు సంభవించిన సీతా వియోగ దుఃఖము పరిహారము గానేరదు. సీత అంత సులభముగా నీకు లభ్యము గానేరదు. అనెను. అది విని శ్రీరాముడు-

శ్లో॥ తస్మాత్తస్యవధోపాయం-లంఘయిత్వాంబుధింరణె ।
బ్రూహిమే మునిశార్ధూల-త్వత్తోనాన్యోస్తిమే గురుః ॥

ఓయీ మునివరేణ్యా ! (అగస్త్యమహర్షీ!) సముద్రమును దాటి లంకలో ప్రవేశించి యుద్ధమొనర్చి అట్టి క్రూరాత్ముడైన రావణాసురుని జంపుటకు దగిన ఉపాయమును జెప్పుము. నీవు గాక నాకు మరివేరే గురువులు లేరని ప్రార్థించెను. అది విని అగస్త్య మహర్షి యిట్లు వచించెను.

ఓయీ! రామచంద్రా ! నాశరహితుడు (మృత్యుంజయుడు) మరియు పార్వతీ పతియైన ఆ పరమశివుని అనన్య భక్తితో నారాధించుము. ఆతడు నీ యభీప్సితమును అనుగ్రహించును. ఇంద్రాదుల కంటెను, బ్రహ్మాదుల కంటెను. అజేయుడై యున్న ఆ రావణాసురుని శివానుగ్రహము లేవిదే నీవు వధింపలేవు. ఆ కారణముచేత శైవాగమ పద్ధతి ననుసరించి శివారాధనకుపయోగ్యతను గల్పించునట్టి శివ (విరజా) దీక్షను అనుగ్రహించెదను. ఆ పిదప శివలింగమును శాస్త్రోక్తప్రకారముగా పూజింపుము. దీని(ఈ దీక్ష) వలననీకు మనుష్య రూపము నశించి అమానుష తేజోభరితుండవై నిరాయాసముగా శత్రువులను



విజయదశమినాడు జోగిపేటపెద్ద మఠముయొక్క మహా
ద్వారము ఎదుట నందిధ్వజారోహణముజేయుచున్న శ్రీ శెట్టి
శివరావు అడ్వొకేటుగారు, ఉపన్యాసమిచ్చుటకై వెళ్ళుచున్న
పం॥ రాచవీరదేవరగారు

"గు"కార స్త్వంధ కారస్తు "ర"కార స్తన్ని వర్తకః అనగా "గు"వర్ణ సంకేతమునుండి శిష్యునిలో నెలకొనియున్న అజ్ఞానమనెడు అంధకారమనియు దానిని "ర"వర్ణసంకేతము నుండి శిష్యునిలో నున్న అజ్ఞానమనెడి అంధకారమును సద్గురువు శిష్యునకు శివదీక్షనొసంగి - జ్ఞానమనెడు దివ్వెను వెలిగించి అజ్ఞానమను పెనుచీకటిని దొలగింప జేయును. అట్టి మహాను భావుడే గురుపదవాచ్యమున కర్హుడని పరిగణింపఁబడును,

ఇట్టి గురువులలో వీరశైవ సిద్ధాంతము మేరకు ముగ్గురు దీక్షా గురువు, శిక్షా గురువు, మోక్షా గురువులని విభజింపబడిరి. శిష్యునకు మొదట శివదీక్ష ననుగ్రహించినవాడు దీక్షా గురు వనియు. ఇతడు తన హస్తమస్తక సంయోగమొనర్చి, మంత్రోప దేశమొసఁగును. ఇంత వరకు అజ్ఞానదశలో మాంసపిండముగా నున్న శిష్యుని శరీరము గురువర్యుని దీక్ష ప్రభావమువలన ఇప్పుడు మంత్ర పిండముగా మారును-ఆచార-విచారములను బోధించుటవలన శ్రీ గురువు శిక్షా గురువుగా పరిగణింపబడును. శిష్యుడజ్ఞానమునుండి యింత వరకు జేసిన తప్పులను గురువు బోధన గరువుటచేత సరిజేయును. మానవుడుగా సమాజమున నడుచుకొనునట్లుగా మార్చును. ఇంకను గురువు తన విజ్ఞా నముచేత అనిర్వచనీయమైన శక్తిపాతమును-కరుణా కటాక్షము ననుగ్రహించి శిష్యుని మోక్షమును బడయుటకు అర్హునిగా నొనర్చుట వలన మోక్షా గురువని ప్రసిద్ధి గాంచును. వీరశై

వులే గాకుండ అన్ని మతముల వారును గురువునకు ఉన్నత స్థానము నొసఁగి గౌరవించు సాంప్రదాయము అతీవ ప్రాచీన కాలమ నుండి వచ్చుచున్నది. రామాయణ-మహాభారతము-భగవద్గీత - వేదాగమోపనిషత్తులందును ఈ గురుశబ్దమును గురించి సవిస్తారముగా ప్రతిపాదించబడినది. మొట్టమొదటవేదము "ఆచార్యదేవోభవ" అనియు, మరోచోట "నగురోరధికం, నగురోరధకం విదితంవిదితం శివశాసనతః" అనగాఆచార్యుడనగా గురువనియు - దేశికుడనియు "జ్ఞానందిశతీతి దేశికః" జ్ఞానము నొసఁగునాఁడు దేశికుడనియు. ఇట్టి అచార్యుడే దేవునితో సమానుడనియు, కనుక ప్రపంచములో గురువును మించిన దైవము లేదనియు. వేదాగములుద్ఘోషించుచున్నవి. సామాన్యముగా నేటికిని సమస్త జనుల నోట సజీవముగానున్న గురు శబ్దమును గురించి ఇట బరిశీలించవల్సియున్నది. నేటికిని గురువుస్థానము గొప్పదనియు. గౌరవోపేతమైనదిగాను చెప్పఁబడుచున్నది.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

అని యనుదినము ప్రార్థించుటకద్దు - నిరాకార పరమ శివుడెక్కడున్నాడో కాని మనకు ప్రత్యక్షముగా దర్శనమొసఁగి మన సమాజములో ఉచిత మానవుడిగా మార్చె శక్తి గురువు నకు దప్ప మరెవ్వరికిని లేదని చెప్పవచ్చును. కనుక సాకార

రూపముననున్న ఈ గురువే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడని పై గురుస్తోత్రము మనకు బోధించుచున్నది.

కావున వీరశైవులలోని ధర్మమునకు మూలసూత్రములైన అష్టావరణములలో

విభూతి రుద్రాక్ష మంత్రేణ-గుర్లోర్లింగంతు జంగమః।
పాదతీర్థ ప్రసాదేన-అష్టావర్ణాః ప్రకీర్తితాః॥

ఈ విధముగా నిరూపింపఁబడిన అష్ట-ఎనమిది ఆభరణములను ధరించి ఆచరించినవాడె నిజమైన వీరశైవ పదవాచ్యుడని వీరశైవాగమ సిద్ధాంతమునకు సారభూతమైన సిద్ధాంత శిఖామణిలో శివయోగి శివాచార్యుల వారు సుదీర్ఘముగా ప్రతిపాదించి యున్నారు. మచ్చునకు ఈ దిగువ నుదహరించిన శ్లోకములను బరిశీలించవల్సియున్నది. అందును వీరశైవ ధర్మదృష్టి కోణమున ప్రవర్తకులైన వాడు అత్యవశ్యముగాను యాశయమును పాటించవల్సియుండును. సిద్ధాంత శిఖామణిలో ఏకాదశ పరిచ్ఛేదము నందు జగద్గురు శ్రీ రేణుకాచార్యుల వారు మునిపుంగవుండైన అగస్త్య మహర్షికి శ్రీ గురు మహాత్మ్య స్థలమును గురించి యిట్లు బోధించి యున్నారు.

శ్లో॥ యథా శివప్రసాదాన్నం-స్వీకార్యం లింగతత్పరైః।
తథాగురోః ప్రసాదాన్నం-తథైవ శివయోగినా॥౧౮॥

తా॥ లింగనిష్ఠా తత్పరుడైన వీరశైవులు శివప్రసాదమునత్యంత భక్తితో నెట్లు స్వీకరింతురో అట్లే గురుభక్తిగలవారును స్వీకరించవలెను.

శ్లో॥ గురురేవాత్ర సర్వేషాం-కారణం విద్ధి కారణం।
గురు రూపో మహాదేవో-యతః సాక్షాదుపస్థితః ॥౧౯॥

తా॥ గురువే ఇక్కడ సమస్త కార్యములకును కారణభూతుడు. ఈ గురువే సాక్షాత్తుగా మహాదేవుడై మనకు దర్శన మొసఁగు చున్నాడు.

శ్లో॥ నిష్కలోఽపి మహాదేవో-నిత్యజ్ఞానమహోదధిః।
సకలో గురురూపేణ- సర్వానుగ్రాహకో భవేత్॥౨౦॥

తా॥ మహాదేవుడు నిర్గుణ స్వరూపుడై నప్పటికిన్ని జ్ఞానాంబుధి యైన సాకారమున గురు స్వరూపుడై సమస్త జనులను అనుగ్రహించువాడగు చున్నాడు.

శ్లో॥ యశ్శివః సగురుర్జ్ఞేయో యోగురుః సశివస్మృతః।
నతయోరంతరంకుర్యాత్॥జ్ఞానావానేవ మహామతిః॥
॥౨౧॥

తా॥ శివుడే గురువుగాను - ఆ గురువే సాక్షాత్తుగా పరమశివుని గాను - చెప్పబడినది. బుద్ధిమంతుడై వాడు దానుదివ్య జ్ఞానమును బడయుటకై గురువునే శివుడిగా భావించవలెను. వీరిద్దరిలో తరుతమ భేదములను పాటించ(దగదు.

శ్లో॥ హస్త పాదావహాత్యేన-నేతరైసదృశంవదేత్।
ఆచార్యం జ్ఞానదంశుద్ధం-శివరూపతయాస్థితం ॥౨౨॥

తా॥ పరిశుద్ధుడైన దివ్య జ్ఞానముసుపదేశించు నట్టి గురువును సాక్షాత్పరశివస్వరూపుడే గాని. అందరివలె హస్త పాదముల సామ్యత వలన ఆ గురుపుంగవుడిని ఇతరులతో పోల్చగూడదు.

శ్లో॥ ఆచారస్యావమానేన-శ్రేయః ప్రాప్తిర్విహన్యతే।
తస్మాన్నిశ్రేయసః ప్రాప్తై-పూజయేత్తం సమాహితః
॥౨౩॥

తా॥ అట్టి ఆచార్యుని (గురువును) అవమానించుట వలన ఉపలబ్ధమైన కీర్తి నశిస్తుంది. కావున మోక్షప్రాప్తి కొరకు సావధాన మనస్సు గలవాడై అనన్య భక్తితో గురువును బూజించవలెను.

శ్లో॥ గురుభక్తి విహీనస్య-శివభక్తిర్నజాయతే।
అతః శివేయథా భక్తి-స్తథా భక్తిర్గురావపి ॥౨౪॥

తా॥ గురుభక్తిలేని వారికి శివభక్తి గలుననేరదు. ఆకారణము చేత శివునియందెంతటి భక్తియుంటుందో అదే విధముగ గురువునందును అనన్యమైన భక్తిగలిగి యుండవలయును.

ఈ విషయములో శ్రీ బసవేశ్వరులవారు గూడ ఇట్లు వచించి యున్నారు.

వచనము :

"మడికెయ మాడు పరెమణ్ణే మొదలు
తొడిగెయ మాడువరెహొన్నే మొదలు
శివ పథవసరివడే గురు పథవే మొదలు.

అనగా కుండలు చేయుటకు మన్ను. నగలు జేయుటకు బంగారమెట్లు మొదట అవసరమో అదే విధముగా శివ స్వరూపమును దెల్సికొనవలెననిన గురువు నాశ్రయించుట మొదలు జేయుదగినపని. మరోచోట బసవన్నగారు

''నాను ఆరంభవమాడువెనయ్యా గురు పూజెగెందు
నాను బెవహారవ మాడువెనయ్యా! లింగార్చనగెందు,
నాను గురుసేవెయ మాడువెనయ్యా, జంగమదా
సోహక్కెందు.

ఈ వచనములో తమగురుభక్తిని నిండు హృదయముతో నిజ విచారమును జాటి చెప్పియున్నారు.

గురు స్వరూపమును గురించి సిద్ధాంత శిఖామణి పంచ
॥ పరిచ్ఛేధములో జగద్గురు శ్రీ రేణుకాచార్యుల వారు
గస్త్య మహర్షి కిట్లుద్బోధించి యున్నారు.

(దీక్షా గురు స్థలం) :

శ్లో॥ దీక్షా గురు స్థలం పూర్వం-తతః శిక్షా గురు స్థలం।
ప్రజ్ఞా గురుస్థలంచాథ, క్రియాలింగ స్థలం తతః

ఇందు మొదట దీక్షా గురుస్థలమును గురించి యిట్లు
రూపించిరి.

శ్లో॥ దీయతే పరమ జ్ఞానం-క్షీయతే పాశబంధనం।
యయా దీక్షేతి సాతస్యాం-గురుర్దీక్షా గురుస్మృతః ॥౨॥

తా॥ శిష్యుడిలో నెలకొని యుండిన అజ్ఞానమనెడు పాశబంధ
నమును గురువు తనజ్ఞానబలముచేత విచ్ఛిత్తిగావించును.
(గురుపద నిర్వచనము) :-

శ్లో॥ గుణాతీతంగవర్ణంచ-రూపాతీతం రువర్ణకం।
గుణాతమ రూపంచ-యోదద్యాత్స గురుఃప్మృతః

తా॥ "గ" వర్ణము నిర్గుణమును- "రు" వర్ణము ఆ రూపము
(నిష్కలము)ను సూచిస్తుంది. ఇట్టి గుణాతీతము ఆరూప
వస్తువును తెలియపరచు వాడె నిజమైన సద్గురువని
యర్థము చెప్పబడును.

శ్లో॥ అచినోతి హిశాస్త్రార్థానా చారే స్థాపయత్యలం।
స్వయమాచరతె యస్తు-స ఆచార్య ఇతి స్మృతః ॥౯॥

తా॥ ఏ ఆచార్యుడు శాస్త్రార్థములను బరిశోధించి తను ఆచరించుచున్నాడో అతడే ఆచార్యుడని చెప్పఁబడుచున్నాడు (శిక్షా గురుస్థలం) :

శ్లో॥ ఓ క్షా గురురసౌ శిక్షాహేతుః శిష్యస్య బోధకః।
ప్రశ్నోత్తర ప్రవక్తాచ-శిక్షా గురురితీర్యతే ॥౧౨॥

తా॥ ఈ దీక్షాగురువే శిష్యునకు శివజ్ఞానమునుపదేశించుటవలన శిక్షాగురువగుచున్నాడు.

శ్లో॥ బోధకోఽయం సమాఖ్యాతో-బోధ్యమేతదితి స్ఫుటం
శిష్యోనియుజ్యతె యేన సశిక్షాగురు రుచ్యతే ॥౧౩॥

శ్లో॥ దదాతియః పరంజ్ఞానం-జగన్మాయానివర్తకం।
అద్వైత వాసనోపాయం-తమాచార్య పరం విదుః ॥౧౪॥

తా॥ ఏ గురువైతే ప్రభుజ్ఞాన మొసఁగి ప్రపంచమాయను వొలగింపఁజేసియునో అద్వైతభావనమునకు మార్గమును జూపునో అట్టివాఁడే విజ్ఞానవేత్తయైన గురుపుంగవుడగును.



# భాగ్యనగర్ జంగమ సంఘం, హైదరాబాదు-27

(రిజిష్టర్ నెం. 787/82)

8-3-1982, సోమవారం

ఆం. ప్ర. వీరమహేశ్వర (జంగమ) మహాసభ హైదరాబాదు-27
శ్రీ జగద్గురు రేణుకాచార్యుల వారి సంక్షిప్త పరిచయము

కైలాస వాసియైన పరమశివు నానాతి మేరకు శ్రీ రేణుకాచార్యుల వారు పుణ్యభూమి యగు నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా శ్రీకొలనుపాక క్షేత్రమందలి శ్రీ సోమనాధలింగము నుండి యుద్భవించిరి. అటనుండి మలయ పర్వతమున తపోధనుడైన అగస్త్య మహారుషుల వారికి శివదీక్ష యొసంగి వీరశైవ సిద్ధాంతమును ప్రబోధించిరి. మహాశివభక్తుడైన రావణుని భ్రాత యగు విభీషణుని ప్రార్థన మేరకు రావణుని యంతిమ కోరికను దీర్చుటకై లంకలోనేక కాలమున ముక్కోటి లింగములను ప్రతిష్ఠింప జేసిరి. అక్కడి నుండి కాశి క్షేత్రమునకు వెళ్ళి యచట తపమాచరించుచుండిన మహర్షులకు గంగావతరణ ప్రసంగమును వివరించిరి. శ్రీ విశ్వారాధ్యుల వారిని సందర్శించిరి.

తరువాత కేదార క్షేత్రమున కరిగి యచట నున్న మహర్షులకు మహిషాకారమును ధరించిన శివుని యొక్క లీలను

విశదీకరించిరి. హిమాలయ పర్వతమున నెలకొని యున్న శ్రీమదేకో రామారాధ్యులను సందర్శించిరి. ఆటనుండివెళ్ళి ఋష్య శృంగ మహామునికి ఆ పర్వతము యొక్క పూర్వ వృత్తాంత మును, పరమశివుని పంచలింగములను త్రిలోకములను వివరించిరి. మరియు కూష్మాండ పర్వతమున సంగమగిరి యను పేరు వచ్చుటకు కారణమును తెల్పిరి. మంగళవాడ కరిగి అట నున్న వీర బిజ్జళుని అజ్ఞానమును దొలగించిరి. మరియు నాతనికి శివతత్వోపదేశమును గావించిరి. శ్రీశైల క్షేత్రమును జేరి యచట పరమ శివుని బూజించి ప్రార్థించిరి. శ్రీ పిండితా రాధ్యులవారిని సందర్శించి యట చిరకాలము నుండి తపంబు జేయుచు శ్రీ రేణుకాచార్యులవారి రాకకై వేచియుండిన శ్రీ ఆది శంకరాచార్యుల వారి యభీప్సితము ప్రకారము వారికి శివ దీక్ష యొసగి చంద్రమౌళీశ్వర లింగమునను గ్రహించిరి. పుండరీక పురముయొక్క పూర్వ వృత్తాంతమును తెలిపి, కాంచీపురమున కరుదెంచి యట వరదరాజ విగ్రహము యొక్క శిరఃకంప మును ఆపిరి. చోళభూపాలునకు శివతత్వోపదేశము గావించిరి.

మాచనూరు గ్రామమున రాక్షస రూపమున నుండి జనులను బీడించుచున్న యక్ష దంపతులను తన అగ్నినేత్ర ముతో భస్మమొనర్చి అయోగోళకములుగా మారిన ఆ రెండింటిని ఖడ్గములుగా మార్చి వానిలో నొక దానిని నది నీటిలోను పాతి- రెండవ దానిని ఉజ్జయినికి గొనికొని వెళ్ళి. శ్రీ మరుళారాధ్యుల

వారిని సందర్శించి అటనున్న విక్రమార్కునకు ఖడ్గము నొసంగి తత్త్వోపదేశము జేసిరి. గోరఖనాథుని గర్వభంగ మొనర్చి అతనికి గూడ శివ తత్త్వోపదేశము నొసంగిరి. మంగళ వాడయందలి ఖర్పరుడను కుటిలసిద్ధు నొకనిని శిక్షించి పండ్రెండు వేల బాలికలను చెరనుండి విడిపించిరి. శ్రీ రేణు కార్యుని అనుగ్రహాతిశయమున చోళభూపాలునికి మగసంతానము గలుగునట్లు ఆశీర్వదించిరి. పరమ శివుని ఆనతి మేరకు శ్రీ రేణుకార్యుడు భూగర్భము నుండి శ్రీరుద్రమునిశివాచార్యుల బడసిరి. అతనికి శివతత్త్వోపదేశమును గావించి పట్టాభిషేకము మొనర్చి. మల్లినాథునకు శివతత్త్వోపదేశ మొనర్చి శ్రీశైలక్షేత్ర మున కరిగిరి. శ్రీరుద్రముని శివాచార్యుల వారిని తనవెంట శ్రీశైలక్షేత్రమునకు దీసికెళ్ళి అటనున్న చిత్రవిచిత్ర ఘట్టములను సందర్శింపజేసి పునఃరంభాపురి పీఠమునకు విచ్చేసి అటనుండి కొలనుపాకకు విచ్చేసి యచట సోమనాథలింగమునందైక్య మొందిరి.

ఉపన్యాసకులు (పరిచయకర్త) పి.ఆర్.వి.దేవర
కార్యస్థానము :
శ్రీ నాగలింగేశ్వరాలయము
మలక్ పేట, బి.బ్లాక్స్, ముంతాజ్ కాలేజి వెనుక

# వినతి పత్రము
## ఎండోమెంట్స్ కమీషన్ గారికి
## నివేదించుకున్న విషయములు

1. వీరమహేశ్వరుల (జంగమ) బాలురకు ఆగమ పండిత అర్చక పరీక్షల పాఠశాలను, దాని కనుబంధముగా బి. సి. వసతి గృహము నేర్పరచుట.

2. గ్రామ-నగరములలో నుండే మఠము లకు, గృహములకు గృహస్థ మహేశ్వరులనే మఠాధికారులుగా ప్రకటించాలి, దీనివలన నిరుద్యోగ సమస్య సమసి పోతుంది. దాని యాదాయము వారికే సంక్రమింప జేయాలి.

3. సన్యాసులను లేదా విరక్తులను గ్రామ-నగర మధ్య మఠాలలో నుంచగూడదు, ఏలన వీరు విషయాసక్తుల గుటచేత సమాజమునకు కళంకము వాటిల్లు చున్నది. భక్తులలో నపహాస్యమునకు గురియగుచున్నారు.

4. సమాజమునకు, ధార్మిక సాహిత్యక-సాంస్కృతికముగా సేవలొనర్చు వారిని ప్రోత్సహించుటకై వీరికి అవార్డులను (బహుమతులను) ప్రకటించాలి.

5. బొంతపల్లి వీరభద్రస్వామి దేవస్థానమున "వీరశైవా గమ పాఠశాలను, నెలకొల్పాలి. లేదా హైదరాబాదు సికింద్రాబాదులోనైన నెలకొల్పాలి.

6. బాగా సంపన్నులైన మఠస్థులచేత వీరశైవ ధార్మిక పాఠశాలను తప్పనిసరిగా నిర్వహించునట్లుగా ఆదే శాలివ్వాలి? అందులకంగీకరించని పక్షాన మఠాధిపతు లను వెంటనే తొలగించాలి.

7. ఇట్లు ధార్మిక పాఠశాలను నెలకొల్పుట వలన వీర శైవులలో జననాది-శివదీక్ష-వివాహ-అంత్యేష్ఠి విధు లను ఆగమ శాస్త్రోక్తముగా నిర్వహించుటకు వీలు కలుగుతుంది.

8. ఆగమ పండిత వీరశైవాగమ పండితపరీక్షలకు తెలు గులో పాఠ్యపుస్తకములను విధిగా నిర్ణయించాలి, ఇంతవరకు తెలుగు పాఠ్యపుస్తకాలు లేకుండానే పరీక్షలు నిర్వహించియున్నారు.

9. వీరశైవ మఠాల బాగోగుల పరిశీలనకై మంచిగా ఆరితేరిన వీరశైవ ఆగమ విజ్ఞానముగల పండితులనే ఇ.ఓ.పరిశీలకులుగా నియమించాలి.

10. వీరశైవ సాహిత్యక-సాంస్కృతిక-చారిత్రిక-ప్రాచీన గ్రంథములను పునర్ముద్రణకు ఆదేశాలివ్వాలి.

11. వీరశైవ ప్రాచీన గ్రంథములను, తాళపత్ర గ్రంథ ములను సంగ్రహించి హైదరాబాదులో ఒక గొప్ప గ్రంథాలయము నేర్పరచాలి.

12. వీరశైవులకు సంబంధించిన మఠ, మందిరములలో ప్రాచీన-సాంప్రదాయము ప్రకారమే అచట కార్య క్రమములను నిర్వహింప చేయాలి. గాని వానినే మాత్రము మార్చుట కవకాశ మీయగూడదు.

13, ఆం. ప్ర. దేవాదాయ ధర్మాదాయ శాఖ వారి అధ్వ ర్యమున నిర్వహింపఁ బడుచున్న ధార్మికోపన్యాసాది కార్యక్రమాల్లో వీరశైవ పండితులకు అవకాశమును గల్పించాలి.

ఇట్లు సం॥
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ వీరమహేశ్వర (జంగమ)
మహాసభ, హైదరాబాదు ఆం. ప్ర.
ఇ. నెం. 3-3-139, కాచిగూడ,

ప్రతి :-

శ్రీమాన్ గౌ॥ ముఖ్యామాత్యులు
ఆం. ప్ర. హైదరాబాద్ గారికి

# వినతి పత్రము

నమస్తె

విషయము : ఆంధ్రప్రదేశ్ వీరశైవ ఆగమ పండిత అర్చక పరీక్షార్థులకు తెలుగులో పాఠ్య పుస్తకములను నిర్ణయించుట మరియు ఈ విద్యార్థులకు హైదరాబాదులోనే వీరశైవాగమ పాఠశాలను నెలకొల్పుటను గురించి.

ఆర్యా !

ఆంధ్రప్రదేశ్ లోని వీరశైవాగమ పండిత అర్చక పరీక్షార్థులకు ఇంతవరకు తెలుగులో పాఠ్యపుస్తకములను నిర్ణయించకుండగనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ, ధర్మాదాయ శాఖా వారు వీరశైవాగమ ప్రవేశ, వర, ప్రవర, పరీక్షలు నిర్వహించి యున్నారు. మరియు నిర్వహించుచున్నారు. తెలుగులో పరీక్షా పాఠ్య పుస్తకములు లేకుండా పరీక్షలు నిర్వహించుట ఎంతటి పొరపాటు చేయుచున్నారో ఈ విషయమును శ్రీవారే గమనించగలరు, ఈ విషయమై వీరశైవాగమ పండిత అర్చక బోర్డ్ సభ్యులుగా ప్రభుత్వముచె నియమింపబడిన జి. ఓ. నెం. వం॥ రాచవీర దేవరగారు ఎండోమెంట్ కమీషనర్ గారికి అనేక తడవలు మనవి చేసుకున్నను మరియు తెలుగులో పాఠ్యపుస్తకములను నిర్ణయించుటకు, కొన్ని పుస్తకములను అందజేసినను వాటిని నిర్ణీష వైఖరితో నిర్ణయించకుండానే ఆ

పుస్తకములను తిరిగి ఇచ్చి యున్నారు. కాని ఫలితము లేకుండా పోయినది. ఈ పొరపాటును జూచి సహించలేక శ్రీవారు తమ పదవికి రాజీనామాను యిచ్చుటకు గూడా సిద్ధపడి శ్రీ. జె. సి. గారితో ప్రత్యేకముగా చెప్పియున్నారని తెలిసినది. మరియు ఏకారణముచేత పరీక్ష పుస్తకములను నిర్ణయించుటలేదో మాకు తెలియకున్నది.

పరీక్షార్థులకు తెలుగులో పాఠ్యపుస్తకములు నిర్ణంచక పోవడము వలనే వారు తబ్బిబ్బులు పడుచున్నారు. పోగా వీరశైవాగమ అర్చక పరీక్షార్థులు కడు బీదావారుగాను ఉన్నారు. యిట్టి తరి ఆగమ పరీక్షల అధ్యయనము కొరకు తిరుపతి దేవస్థానము వారికి అప్పగించి యున్నామని శ్రీ యెండోమెంట్ కమీషనర్‌గారు చెప్పియున్నారు. ఇట్టి నిరుపేద విద్యార్థులు కడు దూరములో ఉన్న తిరుపతికి వెళ్ళి చదువుకోవడముగాని, అథవా పరీక్షల నొసగడముగాని, సాధ్యపడని విషయముగా మారినది.

అందుచేత జంటనగరాలలోని ఏ మఠము మందిరాలలోనైన వైదిక సంస్కృత మరియు అర్చక పాఠశాలను నెలకొల్పి వీరశైవుల కోరికలను నెరవేర్చగలరని ప్రార్థన.

ఇట్లు

ప॥ రాచవీరదేవరగారు

అధ్యక్షులు

ఆం. ప్ర. వీరమహేశ్వర (జంగమ)

మహాసభ. హైదరాబాదు.

1. ఆర్. చంద్రశేఖర్
2. ఎ. ఈశ్వరయ్య
3. ఎ. మల్లికార్జున్
4. ఎమ్. కరిబసయ్య 7-10-90
5. సం॥
6. ఎమ్. వీరభద్రయ్య
7. ఓ. ఉదయశంకర్
8. శ్రీ ప్రభుపయ్య
9. సి. మహేశ్వర్
10. వై. ఎ. స్వామి
11. సి. పతంజలి
12. ఎమ్. సిద్ధలింగస్వామి
13. ప్రభులింగదేవర
14. సం॥
15. పి. బసవరాజ్
16. ఎమ్. చంద్రమౌళి
17. ఆర్. ఎమ్. వీరభద్రయ్య
18. మహాప్రభు, సదాశివపేట

19. ఎస్. శివానందం

20. ఆర్. ఎస్. మల్లికార్జున్

21. కుమారస్వామి

22. ఎస్. శివకుమార్

23. ఆర్. ఎస్. శివమూర్తి

24. ఎం. మృత్యుంజయ

25. ఎం. బి. కవిభద్రయ్య



వి. వి. హాస్టలులో వే॥ పం॥ శ్రీ పెద్దమఠము రాచవీరదేవరగారి అధ్యక్షతలో ఒకహరిజన కుటుంబమునకు లింగదీక్షా సంస్కారము జరిగిన దృశ్యము



వి. వి. హాస్టలు బాగ్ లింగంపల్లిలో శ్రీజగద్గురు రేణుకాచార్య జయంత్యుత్సవములో వే॥ పం॥ శ్రీ పెద్ద మఠం రాచవీరదేవరగారి అధ్యక్షతనజరిగిన మహాసభలో శ్రీవారు ఉపన్యసిస్తున్న దృశ్యము

# హైదరాబాదులో ధర్మాభివృద్ధికై (అనేక) నానారకాలుగా పాటుపడుట

ఆగస్టు ది. 5-1991

మెదక్ జిల్లాలో విద్యాశాఖ ఉపాధ్యాయవృత్తిలో దాదాపు ఐదు సం॥లు గడచిన పిదప నాకోరికను పురస్కరిలిచుకొని హైదరాబాదు విద్యాశాఖలో సంస్కృత పండితునిగా మొట్ట మొదట న్యూమలక్ పేట ప్రభుత్వోన్నత పాఠశాలకు నా స్థాన మార్పును రామాయంపేట ప్రభుత్వోన్నత పాఠశాలనుండి ఇక్కడికి జరిగినది. ఇందుకు నాకు మిక్కిలి తోడ్పడిన సహోపా ధ్యాయులుగా నా జన్మభూమియైన జోగిపేట ప్రభుత్వోన్నత పాఠశాలలో పనిజేసి హైద్రాబాదుజిల్లా విద్యాశాఖాధికారిగా నియుక్తులైన శ్రీ టి. ఎ. నారాయణగారే ముఖ్య కారకులుగా నుండిరి. వారికి నాయెడ సంస్కృత పండితులనే అభిమానము గౌరవము మెండుగా యుండెను. ఆ సమయములో నేరుగా జిల్లానుండి హైదరాబాదు సిటీకి స్థానమార్పు జరుగుటయనిన చాలా దుర్లభముగా నుండెను. దీనికి కారణము ప్రధానముగా జిల్లా విద్యాశాఖాధికారి హైదరాబాదుకు బంపుటకు సిద్ధముగా నుండాలి. హైదరాబాదు జిల్లాధికారిగారు ఆపంపిన ఉద్యోగిని గ్రహించుకొనుటకు సిద్ధముగా నుండాలి. ఆమీదట వీరుభయుల యేకా

భిప్రాయమున కనుగుణ్యముగా హైదరాబాదు రీజనల్ డిప్యూటీ డైరక్టరుగారు సిద్ధపడాలి. ఈవిధముగానే ముగ్గురియాశయమొక టౌతేనేగాని హైదరాబాదుకు స్థానమార్పు జరుగుచుండెను. ఇట్టి వాతావరణమునకనుగుణ్యముగా నేను మెదక్ జిల్లాధికారితో నా యోగ్యతాపత్రమునసనుసరించి(క్వాలిఫికేషన్)తగినవేతనాభివృద్ధి (ప్రమోషన్) జేయవల్సిందిగా మాటిమాటికి పోట్లాడుతుందేవాడిని ఈబాధను భరించలేక అప్పటిజిల్లాధికారిగానుండిన శ్రీ శ్యాంసన్ రామక్రిష్ణయ్యగారు ఈబాధ ఎప్పుడు విరగడైపోతుందా అని విసుక్కునేవారు ఇంతలో నేను స్థానమార్పుకు దరఖాస్తు పెట్టు కోవడము వారికి ఈయవకాశము లభించినది. ఇక్కడ హైదరా బాదులో నూతనముగా జిల్లాధికారిగా నియమింపబడిన నాతోటి మిత్రులైన శ్రీ టి.వి. నారాయణగారు నన్ను హైదరాబాదుకు తీసికొనుటకుత్సుకత గల్గియుండిరి. రీజనల్ డైరక్టరుగారికి నా విషయమై అనుకూలమైన సిఫారసు వ్రాసి వారి యనుమతితో నాకు స్థానమార్పు పత్రమును బంపుట జరిగినది. ఇట్లు అప్పట్లో అనాయాసముగా మెదక్ జిల్లా నుండి హైదరాబాదుజిల్లా విద్యాశాఖకు నామార్పు జరిగినది.ఇది "కాకతాళీయ న్యాయముగా" అనగా కాకి తాటిచెట్టు కొమ్మపై కూర్చోవడము ఆ కొమ్మ విరగ డము ఓకేసారి జరిగినట్లుగా జరిగిపోయినది. ఇప్పట్లో మాత్ర మిదిగూడ సాధ్యపడేదిగాదు ఆ సమయములో అట్టి వాతావరణము కల్సి వచ్చినది కాబట్టి అట్లు జరిగినది. అప్పుడు నానెలసరి వేత నము కేవలము రూ. 42-54 గ్రేడు మాత్రమే ఉండేది.

అప్పుడు హైదరాబాదులో ఇద్దరు-ముగ్గురు పరిచితులు దప్ప నాకు వేరేవారెవ్వరును పరిచయము లేకుండిరి. ఇందులో మొదటివారు యాదగిరి ఎస్. ఎస్. కాలేజీలో సంస్కృత విద్యార్థిగా నున్నప్పుడు ఆ కాలేజీకి మెంబరుగానుండి అప్పు డప్పుడు హైద్రాబాదునుండి యాదగిరికి మాకాలేజి మీటింగులకు విచ్చేసినప్పుడల్లా మా విద్యార్థుల యోగక్షేమములను వ్యవస్థను గురించి విచారించి తెల్సుకునే శ్రీ శ్రీనివాసరావు మదనూర్‌కర్ అడ్వొకేటుగారు. అప్పుడు వారి గౌరవ ప్రతిష్ఠలు హైదరాబాదులో బాగా ఉండి వారి న్యాయవాద వృత్తి బాగుగా జరుగుచుండెడిది. వారి కుటుంబము ఇష్టైశ్వర్యములతో నిండి కళకళలాడుతు కారు డ్రైవరు పరివారముతో ఉండేవారు. వీరిలో వీరశైవ ధర్మాభిమానము మెండుగా నుండేది. కనుక విద్యార్థిదశలో నేను మద్రాసు యూనివర్శిటీకి సంబంధించిన కన్నడ బి. విద్వాన్ ప్రవేశ (ఎన్‌ట్రన్స్) పరీక్షను వ్రాయుటకు నిజాం కళాశాల కేంద్రమునకు వచ్చినప్పుడు నేను నా సహాధ్యాయులందరము వీరింట్లో ఉండుటవలన వీరితో నాకు మిక్కిలి పరిచయ మేర్పడి నది. పోగా నేను హైదరాబాదుకు ఎప్పుడొచ్చినను వారింట్లోనే విడిది. వారు నన్ను మహేశ్వరుడనన్న గౌరవముతో చూచుచే గారుండ తమ ఇంట్లోనే భోజనము చేయించి నాకు భక్తితో పాదాభివందనము చేసేవారు. తరువాత నాకు హైదరా బాదులో జరిగిన వీరశైవ సమాజాభివృద్ధికరమైన సేవలో నేను

పాల్గొన్నప్పుడు వీరెంతగానో తోడ్పడేవారు. వీరు వీరశైవు లకేవిధమైన (విపత్తు-కష్టము) ఇబ్బంది ఏర్పడినను దాన్ని జూచి సహించేవారుగాదు. తన శక్తినంత ఉపయోగించి అట్టి ఇబ్బందిని దొలగింపజేసేవారు. ఈవిధముగా సికింద్రాబాదులోని గొల్లమఠము హైదరాబాదులోని, మలక్‌పేట మఠమును అన్యాక్రాంతమగు చుండగా కోర్టులో దావావేసి వాటిని కాపాడారు. ఆంధ్రప్రదేశ్ వీరశైవ సమాజాభివృద్ధికి మిగులసేవ యొనర్చియున్నారు. అట్టి మహానుభావులు త్వరలోనే లింగైక్యమైనారు.

ఇకపోతే హైదరాబాదు ఇసామియాబజారులో సుప్రసిద్ధ వైద్యుడుగా పేరుగాంచిన శ్రీ ఆర్. ఎం. వీరభద్రయ్యగారు రెండవవారు హైదరాబాదుకు నేను ట్రాన్స్‌ఫర్ అయి రావడము తోనే నాకన్నివిధముల సహాయ సహకారములు అందచేసేవా లుగా నిలిచినవారు వీరు. నాకు మొట్టమొదట వీరు తమ ఇంటి వెనుకనున్న ఒక మార్వాడి గృహస్థుని ఇంట్లో నొకగదిని అద్దె కిప్పించిరి. వీరు హైదరాబాదులో జరిగే వీరశైవ సమాజ కార్య కలాపాల్లో నధికముగా పాల్గొనువారే గాకుండ వీరికి చాలాకాలము నుండి మిక్కిలి స్నేహితులుగా ఉండిన ఉందా బజారులోని శ్రీ మఠము వీరయ్యగారితోగల్సి శివానుభవ సాహిత్యసమితి, నొక దానిని నెలకొల్పిఅప్పుడప్పుడు వీరశైవ లఘుపుస్తకములనునాతో గాని లేదా మఠము వీరయ్యగారి తోడ్పాటుతోగాని వ్రాయించి భక్తులవద్ద చందాలు వసూలుజేసి ముద్రించుతు ఉంటారు. ఐతే

శ్రీమఠము వీరయ్యగారు లింగైక్యమైనారు. ప్రస్తుతము శ్రీ ఆర్. ఎం. వీరభద్రయ్యగారున్నారు. వీరిప్పుడు చాలా వయోవృద్ధులైనారు. ఇప్పటికి వారు వీరశైవ ధర్మ గ్రంథములను పత్రికలనుదెప్పించి తమకుయోగ్యమనిపించిన విషయములను తెనుగున కనువదించి (కొద్దిగా) కన్నడ భాషను దెల్సియున్నందున వ్రాసి నాకు మళ్ళీ తప్పులున్నచో సరిజేసి ఇమ్మని ఇచ్చి నేను సరిదిద్దిన పిదప పత్రికలోనో అథవా లఘుపుస్తకముల రూపమునసో భక్తులవద్ద అథవాస్వాములవద్ద విరాళాలుగా సంగ్రహించి ముద్రిస్తు ఉన్నారు.

వీరు నాతో మొదటినుండి (నాకు దగ్గర పరిచయమైనప్పటినుండి) బాపగారి పదనతో బాల చనువుగాను, ప్రేమాభిమానములతో అప్పుడప్పుడు కవ్వించుకోవడము నవ్వించుకోవడము మాయుభయులమధ్య తరచు జరుగుతుంటుంది. ఐతే కొన్నివేళల్లో నేను చేయు సమాజాభివృద్ధికర పనులలో అడ్డంకులను ఒడ్డుతు ఉండడము ఆది వారికి వెన్నతో బెట్టిన స్వభావము. అయినను నేను స్వకర్తవ్యాన్ని వారొడ్డిన అడ్డంకులనన్నింటిని ఛేదించుకుంటు సమాజాభివృద్ధికర కార్యక్రమములను నా సొంత డబ్బును వేలకొలది వెచ్చించియైనను సాంఘిక సాహిత్య-సాంస్కృతికములుగా సంఘములుగా మిత్రులను కూడగట్టుకొని సాధిస్తూనే ఉన్నాను. ఇది నా జీవిత పరమావధివరకు

నేనెరుపుటకై పరమాత్ముడు నాకు నిండార ఆయురారోగ్యములను అనుగ్రహించాలని రేయింబవళ్ళు ప్రార్థిస్తు ఉంటాను. నేను చేసే సమాజ సేవ అంతయు నా పరమాత్ముని కంకితము గావించి ఆతనిపై పరిపూర్ణమైన విశ్వాసమునుంచి జరుపుచున్నాను. కనుకనే ఎదుటివారునే జేయు కార్యకలాపములను ఎన్ని ఆటంక ములను గలిగించినను నా నిండు గుండె నిబ్బరముతో ముందుకు సాగిస్తూ ఉంటాను. ఇతరులొడ్డిన అడ్డంకులన్నియు నా పర మాత్ముని యనుగ్రహమువలన గాలి తాకిడివలన క్రమ్ముకున్న మేఘాలు చెదరిపోవునట్లుగా పటాపంచలై పోవుచున్నవి. దీని కంతకు దైవానుగ్రహమే సరి అని నమ్మినాడను, నేనుజేయు సాహిత్యసేవకు (గ్రంథ ముద్రణకు) ఇతరులను యాచించలేదు. ఈ దుర్గతి నాకుఇంతవరకు వాటిల్లనందులకు పరమాత్మునికై నేను వేనోళ్ళ కృతజ్ఞతలను చెల్లించుకుంటున్నాను. ఈర్ష్యాళువులెంతగా నేజేయు సమాజ సేవలకాటంకములు గల్గించినను "క్రిందబడ వైచిన కందుకము (రబ్బరు బంతి) పైకెగసినట్లుగా నేజేయు సత్కార్యములు పదుగుర నాకర్షిస్తూనేయున్నవి. ఇందుకుదా హరణముగా" వీరశైవధర్మ పత్రికను ఒంటరిగానే నా ఉద్యో గమును నిర్వహిస్తు నడపడము, అరువదిమూడుమంది పూజలు జరుపడము, సాహిత్యరూపమున సంవత్సరమునకొకటి రెండు (ఒండురెండు) వీరశైవధార్మిక గ్రంథములను వ్రాసి ముద్రించి ప్రకటించడము, సామాజాభివృద్ధినిగోరి నేను నామిత్రులందరిని కూడగట్టుకొని మొట్టమొదలు వీరశైవ తరుణ సంఘమును తరు

వాత, వీరశైవ సాహిత్య సాంస్కృతిక సంఘమును-ఆం. ప్ర. ఉపాధ్యాయ పండిత పరిషత్తును-మరియు ఆంధ్రప్రదేశ్ వీర మహేశ్వర (జంగమ) మహాసభను స్థాపించి పోషించి సర్వాంగ సుందరముగ నాసంస్థలను అభివృద్ధిపరచి ఇంచుమించు ఆంధ్ర కర్నాటక మహారాష్ట్ర ప్రాంతముల వీరశైవ ప్రజలకు సుపరి చితములైనవి. అంతేగాదు ఆంధ్రప్రదేశ్ వీరశైవ జనాంగము లోనవచైతన్యమును గలిగింపచేయుట మైనది. ఒకప్పుడు హైదరా బాదులో మన వీరశైవులతో కొందరిని నేను మన జగద్గురువు లెవరని ప్రశ్నించినప్పుడు వారు "శంకరాచార్యులని చెప్పినారు. అట్టిది నా హృదయమునకు కఠోరముగా దోచినది. మొదటిసారి జగద్గురు జ్ఞానసింహాసనాధీశులు కాశీపీఠాధిపతులైన శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారిని ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాకు రప్పించి వారిచేత శ్రీమంతులైన శ్రీ సిద్ధుల రాజేశము గారి కుటుంబ సభ్యులకు లింగదీక్షా సంస్కారమును జరిపించి శ్రీవారి పరిచయము గావించడమైనది. మరోసారి నేను సొంత ముగా 10వేల రూ॥లను వెచ్చించినా షష్ఠిపూర్తి యుత్సవము నెపమున జగద్గురు వీరసింహాసనాధీశులు శ్రీ రంభాపురీ పీఠాధీశు లైన శ్రీ రుద్రముని శివాచార్య మహాస్వాములవారిని హైదరా బాదుకు రప్పించి శ్రీవారి పరిచయము గావించడమైనది. ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ వీరశైవ మహాసభ పక్షమున జగద్గురు పంచాచార్యులను నగరమునకు రప్పించి వారి యుపదేశామృత

ము ను ఆంధ్రప్రదేశ్ వీరశైవులందరికిని రుచింపజేయుట మైనది. అయితే ఇదంతా నామిత్రుల సహాయ సహకారములతో జరిగి నది. కేవలము నేను వారికి సలహాదారునిగా ఉండి పనిచేయడమే జరిగినది.

ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ వీరమహేశ్వర (జంగమ) మహాసభవారి కార్యకలాపాలుగూడ మూడుపువ్వులు ఆరుకాయ లుగా అభివృద్ధిగాంచుచున్నది.

## హైద్రాబాదులోని కార్యక్రమములు

స్థానికముగా శ్రీ లిం॥ మఠము వీరయ్యగారు శ్రీ ఆర్. ఎమ్. వీరభద్రయ్యగారు మరియు శ్రీ శ్రీనివాసరావు ముడనూరు కర్‌గారు గల్సి ఒకప్పుడు నేను కొత్తగా ఇక్కడికి ఉపాధ్యాయ వృత్తిగా వచ్చినప్పుడు వీరు పాతబస్తీలో శంకరశేఖర్ హోటల్ సమీపంలో ఒక గదిని అద్దెకు దీసికొని వీరశైవధర్మ ప్రచార కార్యక్రమములను నిర్వహించుటకు ప్రయత్నించిరి. ప్రతినిత్యం సాయంత్రము 6నుండి ఇక్కడ శివానుభవగోష్ఠి అనునొక కార్య క్రమమును నా ప్రవచనముతో నారంభించిరి. ప్రతిరోజు నేను బడి ముగియగానే ఇంటికి తిరిగివచ్చి ముఖ ప్రక్షాళనము గావించుకొని, మిత్రులైన శ్రీ రవికోటి మఠము డా॥ వీర భద్రయ్యగారితోబాటు నేను రిక్షాలో కార్యాలయమునకు వెళ్ళి



వి. వి. హాస్టలులో 15-1987 మన పం॥ రాచవీరదేవరగారు నిర్వహించిన 63మంది పురాతనుల మంటప పూజాకార్యక్రమము



పం॥ రాచవీరదేవరగారు విద్యార్థిదశలో చిత్రించిన రంగుల అందమైన మామిడి కొమ్మ వారి కళా నైపుణ్యమునకు ఇది మచ్చుతునక



శ్రీవారు తమ హస్తలాఘముచేత స్వయముగా తమ తండ్రిగారి
అంతిమదినాల్లో ప్రత్యక్షముగా చూసి గీసిన చిత్రమిది
లింగైక్యులు శ్రీ పెద్దమఠము వీరయ్యగారు జోగిపేట

సమయమున వయోవృద్ధులైన పెద్దలు నగర వీరశైవ సమాజం ప్రముఖులు శ్రీ శ్రీనివాసరావు అడ్వొకేటుగారు. శ్రీ ఎల్. జి. హాంబాసగారు, శ్రీ శివరాజప్పగారు, శ్రీ మఠం వీరయ్యగారు. శతకత్రయం మరియు శ్రీ బసవేశ్వర వచనములను కన్నడంలో చదివి, తెలుగులో వాటి సారాంశమును బోధించుచుంటిని. ఆ సమయమున వయోవృద్ధులైన పెద్దలు నగర వీరశైవ సమాజము ప్రముఖులు శ్రీ శ్రీనివాసరావు అడ్వొకేటుగారు. శ్రీ ఎల్. హాంబాసగారు. శ్రీ శివరాజప్పగారు, శ్రీ మఠం వీరయ్యగారు, మొదలగువారు వచ్చి నేజెప్పిన వీరశైవధార్మిక విషయములను బహుశ్రద్ధగా వినుచుండిరి. అందును శ్రీ శ్రీనివాసరావుగారు. నేజెప్పిన ముఖ్య విషయములను తన (దినచర్య) డైరీలో వ్రాసికొనుచుండిరి. అక్కడే చిన్నదొక గ్రంధాలయముగూడ యేర్పడియుండెను.

అపుతే ఇంత గొప్ప నగరములో ఎప్పుడు వచ్చినను శ్రోతలు 10 నుడి 15 మంది వరకే వచ్చుచుండిరిగాని అధిక సంఖ్యలో రాకుండిరి. ఇది నాకు నిరుత్సాహాన్ని విసుగును గలిగించినది. పోతే ఎల్లప్పుడు నేనొక్కడినే ప్రవచనము జేయడము విసుగుకు కారణమయ్యెను. పెద్దవారు తమయొక్క అనుభవ విషయములనేపైన జెప్పితే వినాలని ఆసక్తితో నేనక్కడికి వెళ్ళితే ఎప్పుడునేనె ప్రవచింపవల్సివచ్చేది.ఇది నాకు ఏమాత్రము

గిట్టలేదు. కొద్దిమాసాలకు నేసక్కడికి వెళ్ళవము మానుకోవడం తోనే అది మూతబడినది.

## ప్రకటన కరపత్రము

"నవీరశైవ సదృశం మతమస్తి జగత్రయే"

హైదరాబాదు (నగర) వీరశైవ సమాజము :-

శివానుభవగోష్ఠి ప్రారంభము శ్రీ విళంబినామ సం॥ మాఘ బ॥ ౧౪ శనివారము తేది. 7-3-59 నాడు వీరశైవ మత స్థాపనాచార్యులగు శ్రీ విశ్వారాధ్య శివాచార్యులు, మరియు శ్రీ పండితారాధ్య శివాచార్యులు లింగోద్భవమైన పుణ్యదినమగు మహా శివరాత్రి పుణ్యకాలమునందు రాత్రి 5-30 గం॥లకు హైధరా బాదు వీరశైవ సమాజమువారి యాజమాన్యమున వారి కార్యా లయము 15-9-340, అఫ్జుల్‌గంజ్, హైదరాబాదునందు జోగి పేట పెద్దమఠము శివశ్రీ పండిత రాచవీరదేవరు సంస్కృత- "కావ్యతీర్థ" హిందీ "విశారద"గారిచే శివానుభవగోష్ఠి ప్రారం భించబడును.

ఈ గోష్ఠి నియమముగా, సమాజ కార్యాలయమున ప్రతి శనివారము సాయంకాలము 6-00 గం॥నుండి 8-00 గం॥వరకు

జరుగుచుండును. ధర్మజిజ్ఞాసగలవారు శివానుభవజ్ఞానాపేక్ష గలవారు అందరు ఈ గోష్ఠియందు పాల్గొనుచు లాభమును బొందుచుండవలయునని మనవి.

15-9-340

అఫ్జలగంజ్

హైదరాబాదు (ఆం. ప్ర.)

ఇట్లు

విన్నవించు

రే. మ. వీరయ్య

కార్యదర్శి

[illegible] కాలని ఎస్.ఆర్.టి. గృహప్రవేశమునుండి అత్యంత జరిగిన విషయములు :-

1963-1964 సం॥ల మధ్యన నేను హైదరాబాదు మలక్ పేట అంధబాలుర ప్రభుత్వోన్నత పాఠశాలలో సంస్కృతాంధ్ర భాషా సీనియర్ గ్రేడు 1 పండితుడిగాపనిచేయుచున్న సమయంలో ఒక అంధ ముస్లిం సహోపాధ్యాయుడిమైత్రి మూలాన హైదరాబాదు హౌసింగుబోర్డుద్వారా ఒక చిన్న ఎస్.ఆర్.టి. గృహము నాపేరిట లభించినది. దానికి ప్రతినెల రెండుకిస్తుల రూపంలో డబ్బును చెల్లించాల్సియుండెను. మొదట దాని ఖరీదు రూ. 4,000 (నాలుగువేలు రూ.లు) మాత్రమేనని మాతో బాండు ప్రభుత్వ స్టాంపు (కాగితము)ను వ్రాయించుకొని ఇచ్చియుండిరి.

కాని రానురాను "హనుమంతుని తోకలా పెరిగి రూ. 7000-00 (ఏడువేల రూ.) ఆ తదుపరి మేము దాన్ని విక్రయించు సమయానికి రూ. 25000-00 రూ. వరకు బోర్డువారు దాని వెలను హెచ్చించిరి. ఈ గృహము ఒక మూలన (కార్నర్)లో ఉండుట చేత ఇంటికి మూడువైపుల అనగా తూర్పు, పడమర, ఉత్తర దిశలలో కొంత ఖాళీస్థలముండెను. దానికి చుట్టుప్రక్కల ప్రహరిగోడ నొకదాని బెట్టించి దానికొకవైపున (ఉత్తరాన) ద్వారమునుంచి, దానికి ప్రక్కనే లోపలి భాగముననే ఒక చక్కని చేదుడు బావిని ఇంటివారమే కలిసి త్రవ్వగా కేవలం రెండు మూడు గజముల లోతులోనే మంచి తీర్థము పొడమినది. అందుకే "కష్టే ఫలి అన్నారు పెద్దలు, మంచి ముహూర్తము చంద్రగ్రహణ సమయంలో నా మొరపనేల స్థలమును బూజించి త్రవ్వ నారంభించాము. గనుకనే నా పుణ్యకాల ప్రభావమువలన నా నూతిలో మంచి తీర్థమే పడినదని మా విశ్వాసము, తత్ఫలితముగా ప్రభుత్వము కొళాయినుండి (నల్లాలనుండి) ఈకాలని వాసులకు నీరు లభించనినాడు ఆ పరిసర ప్రాంత ప్రజలందరు ఇక్కడికి వచ్చి ఈ బావినుండే నీటీని చేదుకొని వెళ్ళేవారు.వారెంతగా నీరును తోడెక్కిళ్ళితే అంత నీరు మరుక్షణములోనే మళ్ళీనీరూరుచుండినది. ఆ బావి పుణ్యవిశేషమువలననే ఆ ఖాళీగా స్థలములో మొట్టమొదట రకరకాల సుగంధ పూలమొక్కలను (మూడురకాల మల్లెలు బొంతిమల్లె,

గుండుమల్లె సన్నజాజి చేమంతి) మున్నగువాటిని, మామిడి, నిమ్మ, బొప్పాయి, అరటి, దానిమ్మ, (తియ్యనివి. పుల్లనివి) మోసంబి అల్లనేరేడు, బిల్వవృక్షాలు అరటి మొదలగు పండ్ల మొక్కలను నాటుటతోబాటు ఇందొక ఆశ్రమ పుష్పవాటికలా శోభించుచుండెను. అక్కడికి వచ్చిన జనులు తిలకించి ఆనందించుచుండిరి. ప్రప్రథమున అరటితోటను విరవిగా పెంచడముతో అరటిపండ్లను మేమధికముగా తినడమే గాకుండ ఇతరులనుగూడ తినగా మిగిలినవాటిని పంచిపెట్టుచుంటిమి. తరువాత అరటిచెట్లకేదో రోగము సోకి వాటి కాండములు కుళ్ళిపోవడము చేత వాటిని బొత్తిగా పెరికివైచి మామిడిచెట్లపైనే ఎక్కువ శ్రద్ధ వహించి పెంచగా నవిగూడ కొద్ది సమయములోనే పూతబూచి కాయలు గాచినవి, రకరకాల పండ్లను విశేషముగా ననుభవించాము. విశేషించి తోతాపరి, నీలాలు ఈ మామిడిపండ్లకంటేను తొక్కుడు పనికివచ్చే పుల్లని మామిడిచెట్టు విరివిగా గుతులుగుతులుగా మామిడికాయలు కాచేవి. వాటిని సం॥ము పొడుగునా మా కుటుంబమునకు సరిపడేట్టుగా తొక్కుపచ్చళ్ళు (ఊరగాయలు) పెట్టగా మిగిలిన మామిడికాయలను మండిలా వేసి అవి పక్వము (పండ్లుగా మారగా) కాగానే వాటి రసముతో పాటు భక్షాలు మరియు పిండి వంటకాలను జేసికొని తృప్తిగా భుజించేవారము. అవి కాయలుగా నున్నప్పుడెంత పుల్లగానుండేవో నవి పక్వమైన తరువాత చాల తియ్యగా నుండేవి. ఆ పిదప

ఒక అల్లనేరేడుచెట్టు కోతకువచ్చి విరివిగా ఫలించడముచేత దాని పండ్లనుగూడ మనసార తృప్తిగా ననుభవించాము. ఆమీదట దానిమ్మపండ్లలో పుల్లనివి కొన్ని, తియ్యనివి కొన్ని ఫలించడము చేత అందు పుల్లని చెట్నికి పనిచ్చుచుండెను. తియ్యని పండ్లు పెద్దవిగానుండి తినుటకు బహురుచికరముగా నుండేవి. వీటి మధ్యన రెండు కొబ్బరిమొక్కలనుగూడ బెట్టియుంటిమి. కాని అవి అతి చిన్నవిగానుండి కోతకు రాలేకుండినవి.

ఈ ఇంటి పుణ్యవిశేషమేమిటోగాని ఒక భార్య (మొదటి భార్య పి. ఈశ్వరమ్మను టి.బి. రోగి)కు సంతానము గలుగక పోవడముచేత రెండవ పి. సంగమ్మను వివాహమాడగా ఆమెకు కొంతకాలము గడచిపోగా ఇద్దరు కుమారులు ఒక ఆడపిల్ల జన్మించియున్నారు. ఇట్లు దారా పుత్రాదులతోడ సకల సౌభాగ్యములతోడను ఆనందమయ జీవితమును గడుపనైనది. అంతేగాకుండ కాశి జంగమవాడి మఠము స్థాన సింహాసనాధీశులైన లిం॥ జగద్గురు 1008 పూజ్యశ్రీ శ్రీవిశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు, కోడన్‌గల్లు సంస్థాన మఠాధిపతులైన పూజ్యశ్రీ స్వామివీరూపాక్షలింగ మహాస్వాములవారు. పావన్న పేట మఠాధ్యక్షులైన లిం॥ పూజ్యశ్రీ చంద్రశేఖర మహాస్వాములవారు మరియు(కర్నాటక ప్రాంతము)కు చెందిన మండ్యజిల్లా తాలూక హలగూరు మఠాధ్యక్షులైన లిం॥ పూజ్యశ్రీ స్వామి వీరభద్ర శివాచార్యమహాస్వాములవారు మొదలగు గొప్ప విద్వాంసులు తమం

తటతాము అక్కడికి విచ్చేసి రెండు మూడురోజులుండి శివార్చన గావించుకొని మమ్మాశీర్వదించి వెళ్ళుచుండిరి. ఇందులో వీరంచరు ఇప్పుడు లింగైక్యమైనారు.

ఈ గృహములోనున్నప్పుడే నేను స్థానికముగా ఉత్సాహముతో వీరశైవ యువకులను కూడగట్టుకొని తరుణ సంఘము నొకదానిని నెలకొల్పుట జరిగినది. ఆం. సా. పరిషత్తులోని ఓరియంటల్ కళాశాలలో ఎమ్.ఓ.ఎల్. విద్యార్థిగా నున్నప్పుడు సహోపాధ్యాయులను ప్రోత్సహించిసాహిత్యసభలను,సమావేశములను నిర్వహించడము, ఉస్మానియా విశ్వవిద్యాలయముయొక్క అప్పటికి తెలుగు శాఖాధ్యక్షులైన శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానిగారివంటిగొప్పపండితులనాహ్వానించి ఉపన్యాసముల నిప్పించడము. జంటనగరములందు మరియు ఇతర జిల్లాకు సంబంధించిన ప్రభుత్వోన్నత పాఠశాలల, కళాశాలల బాషాపండితులను కూడగట్టుకొని, ఆం.ప్ర. ఉపాధ్యాయ పండిత పరిషత్తునునెలకొల్పి వారి హక్కులకై నిరంతరము ప్రభుత్వముతో పత్ర వ్యవహారముల నెరపుట, సభలు సమావేశములను జరిపి, అందు గొప్ప విద్వాంసుల నాహ్వానించి వారిచేత ఉపన్యాసములను చెప్పించడమైనది, శ్రీ వెరవలింగయ్యశాస్త్రి, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, మున్నగువారిని సన్మానించుట 25 సం॥లలో ఈ పరిషత్తునకధ్యక్షుడుగానుండి చివరకి రజతోత్సవాన్నిఅతి వైభవోపేతముగానిర్వహించుటయందు శ్రీడా॥వేంకటావధానిగారినిరప్పించి

పరిషత్తు పక్షమున విద్యాశాఖామాత్యులైయున్న శ్రీ అళ్వారు దాసుగారిచేత వారి నిసన్మానింపజేయుట. ఇట్టి సభలు సమావేశము లకుప్రసిద్ధిగాంచిన శ్రీ డా॥ సి. నారాయణరెడ్డిగారిని డా॥ మాధవ శర్మ. శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ నర్సింహశాస్త్రి,శ్రీ టి.వి. నారాయణ మున్నగువారిని రప్పించి ఉపన్యాసములిప్పించడము జరిగినది. పోగా స్థానిక వీరశైవ సంఘములలోను, సభలు, సమావేశములలోను అచటి కార్యకర్తల ఆహ్వానములను పురస్కరించుకొని వెళ్ళి వీరశైవ ధర్మముపై యుపన్యసించు చుంటిని. మరికొన్ని సభలకు కార్యకర్తగా (అధ్యక్షుడుగానో, ప్రధాన కార్యదర్శిగా)నో ఉండుటవలన నేను ఆయాసభలు, సమావేశాల్లో చురుకుగా పాల్గొని అచటి కార్యకర్తలను ప్రోత్స హించుచుంటిని. ఆ దాని ఫలితముగానే హైదరాబాదు, సికింద్రా బాదు జంటనగరములలోని భక్తామహేశ్వరులతో సన్నిహిత పరి చయమేర్పడి,వారి గౌరవాభిమానములకు పాత్రుడనైతిని. కనుక స్థానిక జంటనగరములలోని వీరశైవులందరు జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి, అథవా శ్రీ బసవేశ్వరులవారి జయింత్యుత్స వాలను జరుపుకునే సందర్భములో నన్ను తప్పకుండ ముఖ్య ఉపన్యాసకులుగా ఆహ్వానించుట పరిపాటియైనది. యాకుత్పు రాలో నున్నప్పటినుండే కొన్ని వీరశైవ ధార్మిక సాహిత్య గ్రంధములను వెలువరించుటేగాకుండ "వీరశైవ ధర్మతత్త్వ ప్రకాశిక, అను పత్రిక నొకదానిని నిర్విఘ్నముగా 1974 నుండి



ఆం. సం. పరిషత్తు రజతోత్సవములో
డా. దివాకర్ల వెంకటావధానిగారు ఉపన్యసించుచున్నారు



శ్రీవారి హస్తలాఘవమునకు చిహ్నము గజరాజు



యాదగిరి సంస్కృత కళాశాలలో తన మిత్రుడు శాంతిలింగ దేవర ఫోటోను వ్రాసిన చిత్రము



ఆం. ప్ర. ము. శ్రీ ప॥ రాచవీరదేవరగారు ఎం. లింగయ్యగారు

1984 సం॥వరకు పది సం॥పాటు నేనొంటరిగా ప్రధాన సంపాదకుడిగానుండి ఒకవైపు ప్రభుత్వోద్యోగ వృత్తిని సాధించుచు నిర్వహించాను. ఏ తత్ఫలితముగా ఆంధ్ర-కర్నాటక మహారాష్ట్ర ప్రాంతములలోని భక్తా మహేశ్వరులతో సన్నిహిత పరిచయము అధికమైనది. అందరు నన్ను ఆప్యాయతతో గౌరవ దృష్టితోజూచుట సహజ సిద్ధమైనది.

ఆయాయా ప్రభుత్వ ఉన్నత పాఠశాల, జూనియర్ కళాశాల మరియు డిగ్రీ కళాశాలల్లో నేను బోధకు (దేశికు)డిగా నుండి పనిజేసిన వాటి.

సంక్షిప్త పరిచయము:-

యాకుత్పురాకాలోని గృహమందున్న సమయంలోనే సామి-యాబజారు ప్రభుత్వోన్నత పాఠశాలలో ఏకధాటిగా పది సం॥ములు. మహరస్ ఆలియా జూనియర్ కళాశాలలో రెండు సం॥ములు-మలక్‌పేట కాలని జూనియర్ కళాశాలలో నాలుగు సం॥ములు, అంబర్‌పేట పాఠశాలలో రెండు సం॥ములు. క్కడి విద్యార్థులకు హెచ్. ఎస్. సి, వారికి, సంస్కృతము-తెలుగు-హింది పాఠములను బోధించెవాడిని, కలాసిగూడ కిందరాబాదు ఉన్నత పాఠశాలలోను ఒక సం॥ము. దారుషిఫా న్నత పాఠశాలలోను ఒక సం॥ము, పేట్లాబుర్జులో ఒక సం॥ము,

చంచల్‌గూడ ప్రభుత్వ జూనియర్ కళాశాలలో మూడు సం॥ములు ఇక్కడి నుండె శ్రీ ఎన్. టి. రామారావు ఆం.ప్ర. ముఖ్యామాత్యులుగా నున్న సమయంలో 1983 ఫిబ్రవరి నెల అధిక సంఖ్య సహోపాధ్యాయులతోబాటు నేను గూడ మొదటి సారి రిటైర్డు అయినాను, తరువాత మళ్ళి ఖైరతాబాదు ప్రభుత్వ ప్రాక్టిసింగు హైస్కూలులోనియుక్తుడనై ఒక రెండు నెల్లు మాత్రమే పనిజేసి పునః రెండవసారి తేదీ 15-జులై-1985న శాశ్వతముగాను రిటైర్డు అయినాను. హైయిస్కూలు-కళాశాల ల్లోను సీనియర్ గ్రేడు ఒకటి తెలుగు పండితుడిగానే పనిజేసి రిటైర్డు అయినాను. పిదప జోగిపేట నెహ్రూమేమోరియల్ ప్రభుత్వ డిగ్రీ కళాలలోను తెలుగు ఉపన్యాసకుడిగా నియుక్తు డనై రెండు సం॥ములు 1990-1991, వరకు పనిజేసి యున్నాను.

నా మొట్టమొదటి నియుక్తి మెదక్ జిల్లా విద్యాశాఖ ప్రభుత్వ - పాఠశాల టేక్మాలు, ప్రభుత్వోన్నత పాఠశాల రామాయంపేట, సదాశివపేట జూనియర్ కళాశాలలోను మొత్తము ఐదు సం॥ములు పనిజేసి తరువాత కొన్ని కారణము లను బురస్కరించుకొని, హైదరాబాదు ప్రభుత్వ కళాశాలకు నా స్థాన మార్పును నా కోరిక మేరకు గావించుకున్నాను, నాటి నుండి నేటి వరకు హైదరాబాదు సి.టి (పట్టణము)లోనే స్థిరపడి

ఇక్కడ ప్రతియేట జరిగే స్థానిక వీరశైవ మహాసభలు చేపట్టిన జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి మరియు శ్రీ బసవేశ్వర జయంత్యుత్సవాలకు ఆహూతుండనై అందులో విరివిగా పాల్గొని ఉపన్యసించడముచేతను, మరియు సాహిత్య-సామాజిక సాంఘిక-సమావేశపు మహాసభలలో పలుసార్లు పాల్గొనడమువల్లనైతేనేమి. స్థానిక భక్తుల పరిచయ భాగ్యములతో ఆం.ప్ర.లోనే పేరు ప్రతిష్ఠల నార్జించుకొన్నాను.

ఇంతవరకు ఈ సమయములో నాకు ఇంటి పరిస్థితులను కూలముగా లేకున్నను. ఎన్ని ఇడుములకు లోనైనను. వాటన్నిటిని దైవానుగ్రహముచేత గుండెనిబ్బరముతో ప్రక్కకునెట్టుతు ముందుకు సాగిపోవుటయే నా ప్రథమ కర్తవ్యమైయుండెను. నాలో ఎల్లప్పుడు స్థిరమైన పట్టుదల ఆత్మవిశ్వాసములు, దృఢ సంకల్పములుండుటవల్లనే సమాజములోనే ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకొన గలిగాను. ఇట్టునా ఆత్మవిశ్వాస మెల్లప్పుడు నాలో ప్రబోధిస్తుంది.

(ప్రత్యక్ష) సాక్షాత్తుగా శివ సందర్శనము గలుగుట:-

ప్రతి దినము మాదిరిగానే కళాశాలలోని విద్యార్థులకు సుహృద్భావముతో తెలుగు పాఠములను బోధించి సాయంత్రము 4 గం॥కు యూసుఫ్పురకాలని గృహమునకు వచ్చి ముఖ ప్రక్షా

శనము గావించుకొని. నుదుట భస్మత్రిపుండ్ర రేఖలను ధరించి కొంత వడి విశ్రాంతికై చెట్ల మధ్యన నమర్చిన చెక్కల మంచముపై చల్లగా వీచుచున్న పిల్లగాడ్పులతాకిడికి హాయిగా కాలిమీద కాలువైచుకొని దర్భాసనముపైమేను వాల్చతిని, శివ చింతనలో నుండగా నాకు తూర్పు దిక్కులో మా ఇంటిలోపల గదివరాండకుత్తర దిశలో నున్న రెండుగా చీలికలుగా బెరిగి లేతపచ్చని యాకులతో కళకళలాడుతు కన్నులకింపుగా నగు పడుచుండిన దానిమ్మ చెట్టు వైపునాదృష్టినిమరల్చగా చెట్టు యొక్క రెండు చీలికల మధ్యనుండి ప్రత్యక్షముగా జటాజూట ములతో చంద్రరేఖను దాల్చి. గంగజడలో నొప్పుచుండగా నుదుట భస్మ త్రిపుండ్రరేఖలు ప్రకాశించుచుండగా ఫాలనేత్రము తిలకముగా నొప్పుచుండ. తన చల్లని చూపులతో నాపై వె ల కించు (చూచుచుండు) శివుని ప్రత్యక్ష దృశ్యము నాకు గోచ రించెను. అకస్మాత్తుగా ననుకోకుండ ఇలా శివుడు ప్రత్యక్ష మైనందుకు నాలో పట్టరానియానందము పెల్లుబికినది. ఇప్పటికి నా జన్మ సార్థకమైనదనిదలంచి ఇన్నాళ్ళకు గదా! మీకునాపైన అనుగ్రహము గలిగెనా? మహాదేవా? అని నా మనస్సులోనే తృప్తిగా ఆ నందమును పొందితిని. ఇందుకు నేను ధన్యుడనైతి నని తృప్తిజెందితిని.

మళ్ళి మనుష్యులతోనే ఇదినా భ్రాంతిగా బోలునని భావించ అదే క్షణములో ఇంట్లో నుండెను మా ఇద్దరు శ్రీమతు

లను బలచితిని. అప్పుడు వారిద్దరిలో నా పెద్ద శ్రీమతి ఈశ్వరమ్మ త్వరగా వచ్చి నా వద్ద నిల్చుండి యేమని ప్రశ్నించినది. అందుకు నేను వెంటనే నా దృశ్యము వైపు జూపి "అక్కడేమి అగుపడుచున్నదో చూడుమంటిని, ఆమె అటు వైపు జూచి సాక్షాత్తుగా శివుడై యున్నాడనేను, అప్పుడు గాని నాకు ఊరట గలిగినది. (మనస్సు తృప్తిచెందినది.) శాంతి గలిగినది. నేను నా మనస్సులో కృతజ్ఞతల వెలిబుచ్చితిని.

**యాకుత్పురాలని నుండి కాచిగూడకు నా గృహమును మార్చుట:-**

యాకుత్పురాలని ఎస్. ఆర్. టి. 76లో నున్నప్పుడు సమస్త జీవితము ఎన్ని విధములుగా సుఖమయముగా జరుగుచుండెను. కాని అప్పుడప్పుడు తరచుగా హిందు ముస్లిముల కలతలు జరుగుచుండుటవలన రెండు మూడు రోజులు కర్ఫ్యూ విధించబడుట చేత అక్కడుండే హిందువులకు భద్రత లేకపోవుటచేతను. మరిగా ఆ ప్రాంత మంతయు ముస్లిముల సంఖ్యయే అధికముగా నుండుటచేతను, హిందువులు భయమునకు లోనై కొందరు వెళ్ళిపోగా మరికొందరు చౌకబారుగా తమకు గృహ కల్పము (హౌసింగుబోర్డు) నుండి గృహములు లభించబడుట చేతను వాటిని విక్రయించగా బహు మూల్యము 60 వేల నుండి 70 వేల రూ॥ల వరకు లాభమురాగా అక్కడి

హిందువులందరు తమ ఇండ్లను అక్కడి ముస్లిములకే విక్ర యించి తమ కనుకూలమైన చోట అందును హిందువులధికముగా నున్నచోట ఇండ్లు లేదా స్థలమును కొనుక్కొని వెళ్ళి పోయిరి.

ఈ రీతిగా ముస్లిములే అధికసంఖ్యలో ఉంటవలన నేనక్కడుండుట క్షేమకరమైనది కాదనిపించి, అప్పట్లో నాకే మియు మాఇల్లును విక్రయించుటవలన అంతగా లాభము రాక పోయినను కాల పరిస్థితినిబట్టినేనుగూడ మాఇంటిని ముస్లిము లకే విధిలేక విక్రయించవలసి వచ్చినది. నేనక్కడ స్థిరముగా నుండనెంచి నాకు రిటైర్డు అయ్యే సమయము సమీపించుటచేత స్థానిక (హైదరాబాదు) ఇసామియాబజారు నివాసియైన శ్రీ ముల్గు రామయ్య గుప్తగారికి నాపై చాలా విశ్వాసమేర్పడుటవలన ఆ సస్త్రాజమాసలోనే నెల ఒక్కంటికి వంద రూ॥కు (100 రూ॥ల) నాలుగు రూ॥ల వడ్డి చొప్పున వేలడబ్బును అప్పుగా చేసికొని వచ్చి ఇక్కడ ఖాళీ స్థలము చాలా విశాలముగా నుండుట వలన అహర్నిశలు శ్రమకులోనై హౌసింగుబోర్డునుండి మాకు లభించిన సింగల్‌రూమ్ (ఒకే గది గలది) ఉండగా దానిని విస్తృతపరచి మళ్ళి క్రొత్తగా తొమ్మిది గదులను, మూడు స్నానపు గదులను. మూడు మరుగుదొడ్లను. కట్టించితిని. వాటికిదగిన రీతిగా రెండువైపుల రెండు ఇనుప తలుపులుగల ద్వారములను (రెండు స్టీలు గేట్లను) విశాలముగా పెట్టించడ

మైనది. ఏలననగా నేను రిటైర్డైయిన తరువాత ఆ గదు లను అద్దెకిచ్చుకొని వాటిపైన జీవితమును సుఖమయముగా గడుపవలచి నేనలా అర్థిక ఇబ్బందికి లోనైగూడ ఇంటిని విస్తృతపరచాను. కాని చివరివరకు నాకా అదృష్టము దక్క లేదు. విధి వక్రించినది. ఇదిగూడ కొంతవరకు నాకునే మేలు చేకూర్చినదనవచ్చును. ఏలనన హిందువులందరు వెళ్ళిపోగా నేనొక్కడను మాత్రము (ఒంటరిగా) అక్కడ ఆ ముస్లిముల వాతావరణములో కలకాలము నామనుగడనెలా సాగించగలను? ఎప్పుడే ప్రమాదము వాటిల్లుతుందో ఎరుగనయితిని. అందులోను మాగృహము మహాద్వారము ఎట్టఎదుటే పేరుమోసిన ముస్లిం గుండాలు కొందరు రేయింబవళ్ళు ఒక గదిలో పేకాడడము. (జూదము) త్రాగడము. పరస్పరముగా కలహించుకోవడము. తరచుగా జరుగుచుండేవి. వారివలన కొంత భీతి గలుగు చుండేది. కాని వారు మాత్రము ఎక్కడైన ఎదుట కనపడినచో "ఆదాబు మాస్టరుసాబునిము, అచ్చేహై" అని పలుకరించే వారు. ఏలన నేనప్పుడు అంబర్‌పేట ప్రభుత్వ జూనియర్ కళాశాలలో తెలుగుపండితునిగా పనిచేయుచుంటిని. గనుక వారలా గౌరవించే వారు. కాని ఎల్లప్పుడిదే పరిస్థితి నిలకడగా వుంటుందని ఏమి నమ్మకము ?

కనుక నేను నా మూడుత్సరాలలో నిర్మొత్తగాకట్టించిన అన్ని హంగులున్న గృహమును ఒక లక్షా ఇరువదియైదువేల రూ॥లకు

విక్రయించి. కాచిగూడలోని ప్రస్తుతము నేనుండిన ఇ. నెం. 3-3-139, దానిని తేది. 3 మార్చి 1983లో ఒక లక్ష రూ॥కు చిన్నది 58 చదరపు గజములలో నిర్మించియున్న ఇంటినికొని ఓ శుభ ముహూర్తములో ఈ గృహప్రవేశము గావించితిమి.

ఈ ఇంటిలోకి వచ్చినప్పటినుండియు సుఖమయ జీవితాన్నే గడుపుచున్నాము. కాని కాస్త పెద్ద వయసు (70) సం॥లు దాటినవి గనుక అప్పుడప్పుడు ఆరోగ్యము కొద్దిగ తగ్గినదన వచ్చును. కాచిగూడాలోని నూతన గృహప్రవేశానంతరము గూడ పరమ పూజ్యులైన జగద్గురు 1008 లిం॥లైన శ్రీ జ్ఞాన సింహాసనాధీశులు విశ్వేశ్వర శివాచార్యులుగారు విచ్చేసి మమ్మాశీర్వదించిరి. ఆ తరువాత తెది. 20-4-1984 వీరశైవ విద్యా వర్ధక వసతి గృహము బాగ్ లింగంపల్లి హైద్రాబాదులో అత్యంత వైభవోపేతముగా జరిగిన నా షష్టిపూర్తి ఉత్సవానికై ఆహ్వానింపబడిన జగద్గురు 1008 వీర సింహాసనాధీశులైన బాహశెళ్ళి పూజ్యశ్రీ శ్రీ వీరరుద్రముని శివాచార్య మహాస్వాములవారుగూడ విచ్చేసిన సందర్భములో మా నూతన గృహమును సంధర్శించి పాదార్చన గావించుకొని మమ్మాశీర్వదించి వెళ్ళారు. ఈ సందర్భములో శ్రీపాదుల వెంట కర్నాటక ప్రదేశమునుండి శ్రీవారి భక్త బృందమువారు రెండువందలమంది స్త్రీలు-పురుషులు-కార్లు-జీపులు-సర్వీసు బస్సుల్లో వచ్చియుండిరి.

మరోసారి స్థానిక వీరశైవ విద్యావర్ధక వసతి గృహములో ఆంధ్రప్రదేశ్ వీరశైవ మహాసభ పక్షమున మహా వైభవముగా తేది. 18, 19, 20, 1990. మే నెలలో త్రిదివస రాష్ట్రస్థాయి సమ్మేళనము కార్యక్రమములు జరిగిన మహాసభ ఆహ్వానముపై విచ్చేసిన వీరశైవ ధర్మ సంస్థాపకులైన పంచ పీఠాధీశుల సమావేశములో పాల్గొనిన శ్రీ మద్రంభాపురి సింహాసనాధీశులైన జగద్గురు 1008 శ్రీ వీరసోమేశ్వరముని శివాచార్య మహాస్వాములవారు మరియు పూజ్యశ్రీ జగద్గురు శ్రీ మదుజ్జయిని పీఠాధీశులైన శ్రీ శ్రీ మరుళారాధ్య శివాచార్య మహాస్వాములవారుగూడ మా గృహమునకు ప్రత్యేకముగా విచ్చేసి మాచేత పాదపూజలందుకొని మమ్ము ఆశీర్వదించి వెళ్ళిరి.

ఈ మహాసభ సమయమున ఆంధ్రప్రదేశ్ వీరమహేశ్వర (జంగమ) మహాసభ పక్షమున సభాధ్యక్షుడనైన నేను 6వేల రూ॥లను సొంతముగా వెచ్చించి తెలుగులో పంచపీఠాధీశుల సంక్షిప్త చరిత్ర అను పుస్తకరూపమున ముద్రించి. ఆ సమయమున ఆ మహాస్వాములవారిచే ఆవిష్కరించబడినది. అంతేగాకుండ దేవనాగరిలిపి (హింది) భాషలో సన్మాన పత్రములను. మరొకటి ఆంధ్రప్రదేశమున దినదినము క్షీణదశనందుచున్న ఈ తరుణములో పంచ పీఠాధీశుల తరఫున ఒక ధార్మిక కళాశాలను లేదా ధార్మిక పాఠశాలను. నెలకొల్పి. వీరశైవ ధర్మాన్ని పున

రుద్ధరించవల్సిందిగా నాలుగు పుటలుగల ఒక వినతిపత్రాన్ని సమర్పించి. పంచ పీఠాధిపతులను ప్రశస్తి పత్రములతోను సత్కరించి సమర్పించనైనది. కాని వారిలో ఒక్కరుగూడ ఈ విషయమై శ్రద్ధ జూపకపోవడము నాకు చాలా విచారకరముగా దోచినది.

పైగా ఇక్కడికి వచ్చేసిన ప్రస్తుత జగద్గురువులు గొప్ప గొప్ప ధనవంతుల నిమంత్రణములతో వారి గృహములకు వెళ్ళి దక్షిణలను కానుకలరూపమున ధనమునే సంగ్రహించుకొనుటె వారిప్రధాన లక్ష్యముగా దోచినది. కాని ఏవిధమైన ధర్మాభివృద్ధి గానించవలెనను నాకాంక్ష వారిలోనేయొక్కరికిని ఉన్నట్లు స్థానిక భక్తులకుగాని. మాకుగాని. ఏ మాత్రము. గోచరించలేదు-ధర్మోద్ధారమునకై నడుము బిగించి పరిపంచకమును ధరించి సర్వహంగులున్న ఈ మహాపీఠాధిపతుల సంగతే ఇలా ఉండగ ఇక ఏ హంగులు లేక ఆర్థికముగా మాటిమాటికి ఇబ్బందులకు గురియగుచుండిన సామాన్య పీఠమాహేశ్వరుల సంగతి చెప్పవలవిగాదు.

అయినను నాబోటి పీఠమాహేశ్వరులలో ఒకరిద్దరు భక్తులలో మరికొందరు తమతమ అభిమానము కొలది ధర్మదీక్షను గైకొని సొంత డబ్బును వేలకొలది వెచ్చించియైనను. సాహిత్యరంగములోనైతేనేమి, సాంస్కృతిక రూపములోనైతే

నేమి ఎన్ని విఘ్నములు తామువేయు కార్యములకు వాటిల్లినను వాటిని గుండె నిబ్బరముతో ప్రక్కకునెట్టుతు తమ జీవితమునే అంకితము గావించి యున్నారుకొందరు. ఇట్టి సేవ కేవలము ఉడుతా భక్తిలాంటిది. చంద్రుని పూజకుసూలు పొగువంటిది. అయినను ఈసేవ వృధాబోదనిమాంతరాత్మ ప్రబోధించుచున్నది.

ఇంతవరకు పీఠవైవ ధర్మోన్నతికై నిరంతరముపాటు బడుతు ఆర్థికముగా [illegible]పరిపుష్టించకుండ ఉండి పరశివమూర్తి మా కనుగ్రహించినంతలోనే సాహిత్యసేవ. సాంఘిక, సామాజిక, సేవలందించిన విషయములను దయచేసి నా వ్రాసి ప్రకటించిన 1-2-3-వ-భాగములు గలముద్రిత మరికొన్ని గ్రంథములను పఠించిన ఫలితము [illegible] హృదయులై ఖుణ్ణముగానిశితమైన కుశలమతితో [illegible] వాస్తవ విషయములను గ్రహింప గోరుచున్నాను. [illegible] తాము అనుభవించిన విషయము లను తాము [illegible] వారివారి హృద్గతాభిప్రాయములను- మంచి విచారములను ఇతరులు వారి వారి జడదేహములను జూచినంత మాత్రమున తెలిసికొనలేరుగదా! ఎవరిసుదుటను వీరిలో విజ్ఞాన మెంత [illegible] యున్నదని గ్రహించుటవలను పడదు. ఉద్గ్రంథ పఠి[illegible]రేమి? తాళపత్ర - శిలాశాసన పరిశోధ కులైన [illegible] చేసిన నిరంతర కృషి సర్వమానవాళి ఉద్ధారమునకై గ్రంథరూపముననో సేవా పత్రికా రూపముననో

అథవా మహాసభలో నుపన్యసించుటచేతనో వారి వారి ఉన్నతము లైన విచారములు బహిర్గతములగు చున్నవి.

అట్లుగా కుండ "పుట్టలోని చెదలు పుట్టవా ? గిట్టవా ?" అనుమాదిరి ప్రపంచములోనే క్షణమునకెన్ని ప్రాణులు బుట్టవు ? గిట్టవు, అట్టి వారి జన్మ సార్థకమైనదిగాదని నా విచారము.

శ్లో॥ వందేసత్పురుషాన్‌లోకే-గుణ గ్రహణతత్పరాన్ ।
రాజహంసానివజలాత్-క్షీరగ్రహణకోవిదాన్॥

పఠితలు నా రచిత గ్రంథములలోని మంచి విషయములనే గ్రహించి దోషములను "హంసక్షీర న్యాయము"వలె వదల వలయునని నామనవి.

వయోపరిమితి ననుసరించి మానవుడికి మరుపు గలుగుట సహజము:-

ఇందుకు నా అనుభవములో ఒండో రెండేమిటి యనేకసార్లుమతిమరుపుస్వభావముయొక్క ప్రభావము నాపై జరిగినది. కానివాటిలో ఒకటి రెండిటిని మాత్రమే ఉదహరించుచున్నాను.

ఒకసారి నేను వంచల్ గూడ ప్రభుత్వ జూనియర్. కళాశాలలో విద్యార్థులకు పాఠమును బోధించుటకైనా పీరియడ్ గంట మ్రోగింపగానే త్వరత్వరగా పాఠ్యపుస్తకమును చేత బుచ్చుకొని తరగతిలోకి వచ్చితిని. అచట కుర్చీ వద్దనిల్చొని ముందున్న టేబుల్‌పై పుస్తకమును బెట్టినాకెట్టుకున్న రెండు జేబుల నన్నింటిని మాటి మాటికి తడివి చూచుకొంటిని. అది దొరకమి మరీ గాబరాతో వెదక నారంభించితిని. సమయము వృధా పోవుచున్నదనుభావన నాలోనితొందరపాటుకుగారణ మైనది.

ఇంతలో నాముందు బెంచిలో గూర్చుండిన ఒక విద్యార్థి "సర్ మీరేమి వెదకుచున్నారని" ప్రశ్నించెను. అందుకు నేను "బాబునాకద్దాలు కనపడదా ? ఎక్కడ బెట్టానో" అన్నదే తడవుగా ఆ విద్యార్థి నవ్వుతు "అవేమి సర్ కంటి అద్దాలు మీరు

పెట్టుకొనే ఉన్నారుగదా ?" అనేను, అప్పుడు నాకుజ్ఞప్తికి వచ్చినది మరుపు ఇంత పనిచేసినదిగదా ? యనివాపోయితిని, అందుకే పెద్దలు అందును అనుభవజ్ఞులు ఇలానుడివి యున్నారు "అరువది యేండ్లకు హద్దు బద్దు లేకుండా పోతుందని" నాన్నదినాలో అప్పుడప్పుడు స్ఫురిస్తుంది. ఇది మొదటి మరుపు పని చెప్ప నొప్పును.

ఇంకను రెండవసారి జరిగిన సంఘటన ఇలా ఉంది. ఆనాడు కాలేజికి సెలవుంది. కావున రాచిగూడ గృహమందే యుంటిని. ప్రతిదినం మాదిరిగానే నిత్యకృత్యములు స్నానము-ఇష్టలింగార్చన - సహస్రశివనామ పారాయణము-శివగీత, శత కత్రయము, బసవవచనామృతములను పఠించి, అంతకు ముందుగూడ వైదిక గ్రంథములోని శ్రీరుద్రము - నమకము-చమకము - పురుష సూక్తములను - శివస్తోత్రములను గూడ పఠించి. భోజనానంతరము తొడుగు వస్త్రములను ధరించి బజారునకు వెళ్ళదలచితిని. ఇంట్లో కుటుంబము వారెవరును లేకుండిరి.

బజారుకు వెళ్ళితే డబ్బవసరముగదా ? అనే ఆలోచనతో నా (బీరువ) ఆల్మారాతాళపు చెవిని వెదుక నారంభించితిని. నేను దినాలు ఏయే స్థానాల్లో పెట్టుచుంటినో వాటన్నింటిలోను మరల మరల శోధించి చూచితిని. కాని యెక్కడను దొరకద

దెలియ[illegible]ను. చివరికి ఇంటిగూళ్ళన్నింటిలోను వెదకి వేసారితిని, ఇంటి మహాద్వారము వెలుపలికి వచ్చి ప్రక్కింటి నున్న కుమారి రాజేశ్వరి అను అమ్మాయితో నేను చనువుగా ఉండుటవలన "రాజేశ్వరి నా అల్మారా తాళపుచెవి ఎక్కడ బెట్టానోగాని [illegible] ఎంత వెదికినా దొరకడము లేదంటిని." అందుకా అమ్మాయి "ఎక్కడికి పోతుందిసర్! ఇంట్లోనె ఎక్కడ పెట్టి మరచారేమో [illegible] జాగ్రత్తగా చూడండనెను. అంతటితో నేను [illegible] వచ్చి నేనుదొడగుకొనియున్న బనియను [illegible] ఉండుండినది. దీనితస్సదీయ నా[illegible] అని రెండవసారి వాపోయి [illegible] చంకనిడుకొని ఊరంత [illegible] నాకు జ్ఞప్తికి వచ్చెను.

[illegible] అవసరముండిన వస్తువును ఎక్క[illegible] ఒక్కచోట బెట్టి మరొ[illegible] వెదకుట జరుగుతు ఉంటుంది. ఈ [illegible] మానవులందరికిట్లుజరుగుట సహజ[illegible] బాగారుజువై నది. అందుకే ప్రభుత్వము వారు [illegible] ప్రతి ప్రభుత్వోద్యోగిని అరువది సం॥ముల[illegible] తప్పనిసరి విశ్రాంతిగై కొమ్మని ఆ దేశము[illegible]. ఇదియెంతయో ఔచిత్య పూరితమైన[illegible] అంగీకరింపవలసిన విషయమేసరి.

లేని మొదల తరగతిలో విద్యార్థులతోగాని లేదా ప్రభుత్వాధికారులతోగాని. సహవాస్యమునకు గురికావల్సివచ్చెను. నేను నా వృత్తినుండి 1985-7-15వ. తేదిన రిటైర్డ్ అయిన తరువాత నా జన్మ భూమియగు మెదక్ జిల్లా జోగిపేట నగరములోని "బ్రహ్మ మెమోరియల్ ప్రభుత్వ డిగ్రికాలేజిలోను." రెండు సం॥ములు 1990వ. సం॥ము 1991. సం॥ములోను తెలుగు లెక్చరారుగా పనిజేశాను. అక్కడి నుండి మరల హైదరాబాదునకు వచ్చిన పిదప నగరాన నేనుండెడి ప్రాంతాల సమీపమునందు ఒకప్పుడు ఇసామియాబజార్ ప్రభుత్వోన్నత పాఠశాలలో నా సహోపాధ్యాయునుగా పనిచేసి ఉద్యోగమునుండి తనంతటతానే విరమించుకొని. తానే స్వయముగా బసమ్మాళక్క ఒక్క డిగ్రి కాలేజి బికాం బి.ఎస్.సి. ఎల్. బి. నగర్‌లో కాలేజి నల్లగొండలో బి.ఇ.డి. కాలేజి మరొకటి హరిజన విద్యార్థుల హాస్టలును నిర్వహించుచుండిన శ్రీ డి. ఎలమందగారు మలక్‌పేట మున్సిపల్ కాలని హైదరాబాదు "వాణి అప్పర్ ప్రైమరిస్కూలు" భవనములో నేను సంస్కృత వైదిక కళాశాలను నేలకొల్పినా సొంతముగా నిర్వహించుకొనుటకై శ్రీ డి. ఎలమందగారు యుదారబుద్ధితో వ్రాతమూలాన అనుమతించగానే అచట తేది 1-10-1990, నుండి" జగద్గురు శ్రీరేణుకాచార్య సంస్కృతి వైదిక కళాశాలను ప్రారంభించియున్నాను. సంస్కృత.

విద్యార్థులతోబాటు స్కూలులోని విద్యార్థులకు తెలుగునుగూడ బోధించితిని.

ఇంతలో నకస్మాత్తుగా వచ్చిన పెనుతుఫాను ప్రభావమున తేది 16-డిసెంబరు-1991న సోమవారము మధ్యాహ్నము సుమారు 1-2 గం. మధ్యన భరించరాని శీతజ్వరము సోకినది. ఈ సమయంలో రాచిగారి ఇంట్లో (నేనున్న నా గృహంలోనే) బాధపడుచుంటిని. సహించరాని చలికియెన్ని ఉలన్‌రగ్గులు, దుప్పట్లు గప్పుకొనినను చలితగ్గరపోగా జ్వరము క్షణక్షణమధికమైనది. మా [illegible]వారములోని ఒక్కరు గూడ ఈ సమయంలో నా వద్ద లేనందులకు ప్రక్కనున్న అతిపరిచయస్తులతో సహాయము (ఫోన్)ను [illegible]తోడనే పాపము ఇంటి ముందున్న వారు స్కూలు హెచ్. ఎం. శ్రీమతి హేమగారు నా వద్ద [illegible] ప్రభుత్వోన్నత పాఠశాలలో విద్యనభ్యసించిన తన శిష్యురికపు అభిమానముతో నన్ను ఎంతలో [illegible] తమ ఇంట్లో నుండి అమృతాంజనమును తన బాలురతో తెప్పించి ఆ బాలురతోను తానునాఅరికాళ్ళకు అరిచేతులకు అమృతాంజనమును లేపించిబాగా చేతులతో తాను రాయడమేగాకుండా [illegible]తో గూడ రాయించి చలి తగ్గుటకు సహాయపడినది. ఈ ఉపకారమెన్నటికి మరుపురానిది. ఈ చలిజ్వరము [illegible] రెండవ దినమున సరిగా రాత్రి 9 గం.ల [illegible] జ్వరము వచ్చేది. రెండవదినము

